# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి సెరిలాక్ లాభాన్ని అందించండి.

**పోషకాహార లాభం :** సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

**రుచి లాభం :** పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

**సమయం ఆదా లాభం :** సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

**ఎంపిక లాభం :** ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీద సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి

4-మాసాలు నించి

6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008

Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL



# నాలుగో ముడిపై సమీక్షలు

మార్చి 'చతుర'లో ప్రచురితమైన 'సంచారి'గారి నవల 'నాలుగోముడి'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## హృద్యంగా ఉంది

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

**నే**టి వైవాహిక వ్యవస్థలో స్త్రీ స్థానం ఎక్కడుందో వివిధ దృక్కోణాలనుండి చర్చిస్తూ వేగంగా చదివింపచేస్తుంది. ఆర్థిక, సామాజిక రంగాలలో విప్లవాత్మకమైన ఎన్నో మార్పులు వస్తున్నప్పటికీ స్త్రీ జీవితాన్ని శాసించే వైవాహిక వ్యవస్థ మాత్రం ఇంకా స్త్రీని తన కబంధ హస్తాలతో బంధించి ఉక్కిరిబిక్కిరి చేస్తూనే ఉంది. తరతరాలుగా పురుషాధిక్యతను గుర్తు చేసే మాంగల్యం స్త్రీ మెడలో ఉరితాడుగా మారి అనుక్షణం అథఃపాతాళానికి తొక్కే ప్రయత్నంచేస్తోందనే విషయం రచయిత చక్కగా వివరించారు. స్త్రీ ఆధునికంగా ఎంత పురోగమించినప్పటికీ సరియైన జీవితభాగస్వామిని ఎన్నుకొని వైవాహిక జీవితంలో స్థిరపడకుంటే వచ్చే దుష్ఫలితాలు ఎలాంటివో రచయిత మనముందుంచారు. స్త్రీని విలాసవస్తువుగాచేసి పురుషుడు ఆడుకొంటున్నాడా లేక పురుషుడు విసిరే మోహపు ఉచ్చులో స్త్రీ తనంతతానే బంధీ అవుతోందా?- అనే సమస్యపై పాఠకులలో ఆలోచన రేకెత్తింపచేసే నవల ఇది.

రచయిత కథనంలో చూపిన శ్రద్ధ పాత్రల ఎన్నికలో చూపలేదనిపిస్తోంది. అధిక సంఖ్యలో పాత్రలు సృష్టించి, ప్రతిపాత్రకు ఓ విషాదగాథను అల్లి పాఠకులను కొంత గందరగోళపరిచారనిపిస్తూంది. నవల మొత్తంమీద పాఠకులను ఆకర్షించే పాత్ర గౌతమి. గంభీరమైన వ్యక్తిత్వంతో మంచిచెడులను నిశితంగా పరిశీలించే గౌతమి ఏకారణంచేత జీవన్‌ను తన భర్తగా ఎన్నుకున్నదో అంతుపట్టదు. వివాహం స్త్రీకి ఏ విధంగా భద్రతను చేకూరుస్తుందో ఒక వైపు తెలియచేస్తూ, తప్పటడుగుల ద్వారా స్త్రీ తన జీవితాన్ని ఎలానరకప్రాయం చేసుకుంటోందో కూడా రచయిత హృద్యంగా వివరించారు. గతంలో చేదు అనుభవాన్ని చవిచూసిన ఆనందం డాక్టరుగారిలో దైవాన్ని చూసుకొని సెటిల్‌గావడం వర్తమానం వరకు

బాగుందికాని భవిష్యత్తులో ఆమె సంతానం ఎలాంటి ఒడిదుడుకులకు గురి అవుతుందో ఊహించలేము. ఆర్థికస్వాతంత్ర్యం కూడా వైవాహిక వ్యవస్థలో స్త్రీకి బాధ్యతను, స్వేచ్ఛను కలుగజేయజాలదనే విషయం స్పష్టంచేస్తూందీ నవల. వివాహ వ్యవస్థలో స్త్రీ ఎదుర్కొనే సమస్యలకు పురుషుడితోపాటు స్త్రీ కూడా సమంగా బాధ్యురాలనే విషయం తెలియజేసినందుకు రచయిత అభినందనీయులు.

**–యల్. రామకృష్ణారెడ్డి**, మద్రాసు.

## సమర్థనీయం కాదు

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

"ఎక్స్ట్రా మారిటల్ రిలేషన్స్" గురించి ప్రస్తావిస్తూ సాగిన "నాలుగో ముడి" చదివాక కొన్ని అనుమానాలు కలుగుతాయి.

ఈ నవలలో భార్యవద్ద దొరకని మనశ్శాంతి కోసం భర్త మరొక స్త్రీకి దగ్గర కావడాన్ని చిత్రీకరించారు. కొన్నిచోట్ల రచయిత దానిని పూర్తిగా సమర్థించినట్టే కనబడుతుంది. ఈ నవలలో మొదటి భార్యలందరూ-సరస్వతి, శశికళ, ఆనందాన్ని ఆదరించిన డాక్టర్ భార్య గయ్యాళివాళ్లయినట్లూ, భర్తలు తాము వారివద్ధ పొందలేని ఆప్యాయత, అనురాగాల కోసం మరొక స్త్రీని ఆశ్రయించినట్లూ చూపారు. తనకు కావలసిన గుణాలు భార్యలో లేనపుడు, ఆ పురుషుడు మరొక స్త్రీతో బాంధవ్యాన్ని ఏర్పరచుకొనడం సమర్థనీయమైతే, అదే ధోరణిలో స్త్రీలు కూడా తమ భర్తలు తాము ఆశించినవిధంగా లేనపుడు, మరొక వ్యక్తిని వెతుక్కోవడాన్ని ఏ పురుషుడైనా సమర్థిస్తాడా? ఈ ఆలోచన మౌలికమైన వివాహబంధానికి గొడ్డలిపెట్టు కావడంలేదా?

అందరు భర్తలూ ఉత్తములు కారు; అందరు భార్యలు ఉదాత్తులు కారు. అలాగని భార్యాభర్తలు ఒకరినొకరు అర్థంచేసుకొని, సరిదిద్దుకొనేందుకు ప్రయత్నించకుండా, దాంపత్యాన్ని విచ్ఛిన్నం చేసుకోవడం, ఇతర సంబంధాలనేర్పరచుకోడం, సమాజ శ్రేయస్సు దృష్ట్యా, వ్యక్తి శ్రేయస్సు దృష్ట్యా సమర్థనీయమా?

అలా ఎక్స్ట్రా మారిటల్ రిలేషన్స్ ఏర్పరచుకొన్న పురుషులు, తమలాగే తమ అక్కచెల్లెళ్ల భర్తలు, తమ కూతుళ్ల భర్తలు చేస్తే బాధపడరా?

ఇటువంటి సంబంధాలలో నష్టపోయేది స్త్రీలే. ఇటు భార్యను, అటు మరొక స్త్రీని కూడా అన్యాయం చేస్తున్నాడు పురుషుడు. అతని కారణంగా అతనికి సంబంధించిన ఆ స్త్రీలు ఇరువురూ కూడా మనశ్శాంతిని, జీవితానందాన్ని కోల్పోవడం జరుగుతుంది. ఇరువురి దృష్టిలోనూ ఒకమోసగాడుగా మిగిలిపోయి, ఏ ఒక్కరి పరిపూర్ణమైన ప్రేమనూ పొందలేడు. నమ్మి వివాహమాడిన భార్యకు నరకయాతన ప్రసాదించినవాడవుతాడు. ఏదో కారణంగా వివాహంచేసుకోలేని స్త్రీలైనా, తెలిసి గాని తెలియకగాని ఒక వివాహితుడైన పురుషుని జీవితంలో ప్రవేశించడం వల్ల ఉన్న మనశ్శాంతిని పోగొట్టుకొనడం, సాటిస్త్రీ జీవితాన్ని నాశనం చేయడమే అవుతుంది.

**– సూర్యనాగ శమంతకమణి**, అమలాపురం.

## సందిగ్ధంగా ఉంది

*(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

సంచారిగారి "నాల్గోముడి" ప్రస్తుత సమాజంలో స్త్రీల వ్యక్తిత్వం మీద, స్త్రీల శీలంమీద, స్త్రీ స్వాతంత్ర్యం మీద ఉన్న ఆంక్షలపైన ఒక విసురు. "నాల్గోముడి" అంటే చట్టబద్ధంకాని లైంగికసంబంధమా? ఎన్నుకున్న సమస్య మెచ్చదగ్గది అయినా, మొదలుపెట్టిన సన్నివేశానికి, ముగించినసన్నివేశానికి, కథాగమనానికి ఎక్కడా పొంతనలేదు. మూడుముళ్ల సాంప్రదాయాన్ని వ్యతిరేకించే రచయిత సృష్టించిన స్త్రీ స్వాతంత్ర్యము కావాలనే పాత్రలు, మరల మూడు ముళ్ళకోసమే పాకులాడటం బాగాలేదు. గౌతమి పాత్ర నిజంగా నిండు గోదారే. ఎక్కడా తొణకదు. ఆ పాత్ర చిత్రీకరణ మెచ్చదగ్గది. స్త్రీ ఐనా, పురుషుడైనా తమ వ్యక్తిత్వాన్ని నిలువుకోవాలంటే

ఆమె అన్న మాటలు మరీమరీ చదవాలి, ఆచరించాలి. ఆమె మగాళ్ల వ్యక్తిత్వం మీద సున్నితంగా దెబ్బకొడుతుంది. లోకంగురించి మాట్లాడుతూ, "'లోకం' అంటే ఎవరు జీవన్ నువ్వు, నేనూ, మనలాంటి మనుషులే. నువ్వు అమ్మాయి సినిమాల్లో నటిస్తుందని ప్రాస్ అన్నావు. నువ్వు లోకంలో ఒకడివయ్యావు. నువ్వనకుండా ఉండు. మనల్ని ఇతరులు అనకుండా వుండాలని కోరుకో, సమస్యే లేదు" అంటుంది. అటువంటి వ్యక్తిత్వాన్ని స్త్రీలు గాని, పురుషులుగాని ఏర్పరచుకుంటే, ఏడుజీ మగాణ్ణి "స్త్రీ" కేవలం "మగవాడు" అనే దృష్టితోనూ, పురుషుడు తన స్నేహితురాల్ని "స్త్రీ" అనే దృష్టితో చూడకుండా సమస్యలు చర్చించుకుంటే ఆ సమస్యలు పెద్దసమస్యలుగా అనిపించవేమో! నవలలో జీవన్ పాత్ర ఒక చవట పాత్ర. ఏమాత్రం ఆదర్శంలేనిది. ఉన్నత వ్యక్తిత్వంగల గౌతమికి జీవన్‌తో పొత్తు ఎలా కుదిరింది అనేది ప్రశ్నార్థకమే. నవలలో వ్యక్తిత్వాన్ని నిలుపుకొనే మరో పాత్ర మయూరి.

స్త్రీ శారీరక శీలానికి అనవసరమైన ప్రాధాన్యతనిచ్చే సమాజంలో శారీరక శీలంలేని స్త్రీ పాత్రలతో నవల రాయడం విశేషం. కాని రచయిత కావాలనే మార్పు ఏది? స్త్రీ శారీరక శీలానికి అనవసరమైన ప్రాధాన్యత వద్దనా? నాల్గోముడిని స్త్రీలు ప్రోత్సహించవద్దనా? ముగింపు సందిగ్ధంగా ఉంది.

— జి. నరసింహమూర్తి. గుంటూరు.

## ప్రభావితం చేయలేదు

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ద్వితీయ వివాహాలపై 'సంచారి' వేయదల్సిన 'నాలుగో ముడి' సరిగా వేయలేదనిపించింది. రచయిత ఎన్నుకొన్న ఇతివృత్తం కొత్తదే అయినా కథాసంవిధానంలో కొన్ని లోటుపాట్లున్నాయి. నవల మొదట్లోని కల, నవల మధ్యలో రోనీ, బాలుకి చెప్పిన రేవతి కథ, చివర్లోని శివలక్ష్మి కథ చదువుతున్నప్పుడు అవి ఎవరికి సంబంధించినవో మొదట్లో అర్థంకాలేదు. ఇవి పాఠకుల్ని కొంత అయోమయంలో పడేస్తున్నాయనిపించింది డాక్టర్. జీవన్‌పాత్రలు. ఇంట్లో భార్యపోరు భరించలేని సందర్భాల్లో భార్యల్ని సరైన దారిలో పెట్టడానికి ప్రయత్నించకుండా 'చిన్నింటి' వైపు మొగ్గు చూపేట్టుగా చిత్రించారు. కథలో ముఖ్యపాత్ర అయిన గౌతమి గతాన్ని స్పష్టంగా ప్రస్తావించలేదు. కష్టాల కడలిలో మునిగిపోతున్న రేవతికి ఆసరా ఇచ్చిన రోనీ పాత్ర చిత్రణ అభినందనీయం.

స్త్రీ మగతోడు లేకుండా బతకలేదనీ, రెండో పెళ్ళివాడైనాసరే మగవారిని ఆశ్రయించక తప్పదని ఆనందం పాత్ర ద్వారా చెప్పించటం ద్వారా రచయిత స్త్రీల ఆత్మస్థైర్యాన్ని దెబ్బతీశారనిపించింది. శివలక్ష్మి తన ఆఫీసర్ని శిక్షించినతీరు ఊరట కల్గించింది. ఏమైనా ఈ నవల ఆశించినంతగా ప్రభావితం చేయలేదు.

— ఎ.రాధాశ్రీనివాస్, కోదాడ.

## అభినందనీయం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

సంచారిగారి నవల "నాలుగోముడి" నేటి వివాహ వ్యవస్థలోని లోపాలను చక్కగా ఎత్తిచూపింది. రెండవ భార్య అంటేనే అసహ్యించుకొనే పాఠకులకు ఆ స్త్రీ ఎటువంటిదో, ఎటువంటి పరిస్థితులలో అటువంటి పని చేయవలసివచ్చిందో రేవతి, ఆనందం పాత్రలద్వారా చక్కగా వివరించారు. గౌతమి తన వ్యక్తిత్వం ద్వారా పాఠకులను ఆకట్టుకున్నా ఆమెకు జీవన్‌కు పరిచయమెలా అయి, వివాహమేపరిస్థితులలో జరిగిందో విశదీకరించనందువలన ఆమెపట్ల పాఠకులకు సానుభూతి తగ్గింది.

సరస్వతి, గౌతమి పాత్రలద్వారా స్త్రీలోని రెండు వ్యతిరేక స్వభావాలను, జీవన్‌ద్వారా పురుషుని అవకాశవాదాన్ని, స్వార్థపరత్వాన్ని బహిర్గతం చేశారు. కథాకథన శిల్పం బాగున్నా ఎక్కువ పాత్రలవలన కథాగమనం కుంటుపడింది. మయూరి, ఆనంద, శివలక్ష్మి పాత్రల

ద్వారా పురుషునివల్ల మోసపోయిన స్త్రీల ప్రతిస్పందనను వివిధ కోణాల్లో చూపారు. మయూరి పాత్రద్వారా యువహృదయాలపై సినిమా ప్రభావమెలా దెబ్బతీస్తుందో తెలిపారు. బాలూ, సిల్వియాల ప్రణయం రెండవ పెళ్ళిచేసుకొనబోయే పురుషుడు కేవలం తన స్వార్థమే చూసుకొనక తన పిల్లల భవిష్యత్ కూడా దృష్టిలో పెట్టుకొనవలసిన ఆవశ్యకతను తెలియజేస్తుంది.

శైలి బాగుంది. జీవన్, గౌతమిల సంబంధం చక్కబడిందా లేదా చెప్పకపోవడం వలన, మయూరి పాత్రకు ఏ పరిష్కారము చూపనందువలన కథ అసంపూర్తిగా ముగిసినట్లుంది. ఎక్కువ పాత్రలను ప్రవేశపెట్టినందు వలన కొన్ని పాత్రలకు పూర్తిగా న్యాయంచేకూర్చలేకపోయారు. ఇలాంటి పొరపాట్లు తప్ప కథ నడిపినతీరు, సారాంశం బాగున్నాయి. రోసీ పాత్రద్వారా రేవతి కథకు చక్కని పరిష్కారం చూపారు. ఆ సందర్భంగా హిందూ మ్యారేజి యాక్టు గురించి తెలియజేసినందుకు కృతజ్ఞతలు. వీరి కలం నుంచి ఇలాంటి వెరైటీ కథలు మరిన్ని వస్తాయని ఆశిస్తున్నాం.

— సి.యస్. లక్ష్మి, తిరుపతి.

## సాధించిందేమిటి?

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

వైవాహిక జీవితానికి మామూలుగాపడే ముడుముళ్ల సంగతి కాకుండా నాటకీయంగా పడే 'నాలుగోముడి'ని రచయిత 'సంచారి' కొంచెం చిక్కుగానే వేశారు.

అయితే విషయాన్ని రచయిత పాజిటివ్‌గా చెప్పదల్చుకున్నారా లేక నెగెటివ్‌గా చెప్పదల్చుకున్నారా అన్నది ఒక పట్టాన అర్థంకాదు. ఉదాహరణకు ఒక వ్యక్తికి రెండోభార్యగా ఉండటమనే ఒకేవిషయంలో ఆనందం, అనుభవం ఆనందదాయకమైతే, శివలక్ష్మి, రేవతిలది విషాదమైంది. గౌతమిని గాలికొదిలేసి వెళ్లిపోయాడు జీవన్. వీళ్లకు భిన్నమైన మార్గం మయూరిది.

ఈ నవలలో రచయిత చేసిన వాదన స్త్రీ శారీరక శీలానికి ఒక వస్తువులా విలువకట్టగూడదు, శీలం చెడిపోతే ఎదుర్కొనే పరిస్థితులు పురుషుడికంటే స్త్రీకే ఎక్కువ బాధాకరంగా ఉంటాయి. 'పురుషుడి సంపర్కంతో స్త్రీ శరీరంలో ఏదో పోతుందని భావించకూడదు' - అని రచయిత అభిప్రాయం. ఏదో పోతుందనుకునే బదులు ఏదో మచ్చ వస్తుందని ఎందుకనుకోకూడదు? ఆ పరిస్థితుల్ని ఎదిరించైనా నిలబడాలనుకునే స్త్రీ ఆ విపత్కర పరిస్థితే కోరి కొనితెచ్చుకోకుండా ఉంటే ఈ శ్రమే ఉండదుకదా! అమెరికాలో పెళ్లికాకముందే కన్నెతనం పోగొట్టుకునే వారినిచూసి మనవనులు సమర్థించుకోవడమెందుకు? ఉదాహరణకు ఐశ్వర్యవంతమైన కుటుంబంలోపుట్టి అన్నీ అనుభవిస్తూ ఏవో అందలాలెక్కాలన్న ఆవేశంలో ప్రొడక్షన్ మేనేజర్ నుండి ప్రొడ్యూసర్ వరకూ "అయిదు నిమిషాలు కళ్లు మూసుకుని" లొంగిపోయే మయూరికి జీవితంలో అగ్రతార కావడమేనవా మరో మార్గాంతరం, ఉన్నత లక్ష్యంలేదా? స్త్రీలలో ఉండే పట్టుదల ఇటువంటి కుహనా కోరికలు సాధించడంకోసం ఉపయోగించడం విచారకరం. "మగవాడి అండలేకుండా ఏ ఆడది ఒంటరిగా బతకడం అసాధ్యమని అనుకునే ఈ దేశంలో మయూరి ధైర్యంగా బతుకుతుంది- అదే ఆమె ప్లస్‌పాయింట్" అన్నారు రచయిత. కాని అవసరమైనప్పుడల్లా ఆ మగవాళ్లకి లొంగిపోవడం ద్వారానేగా ఆమె పైకి రావాలనుకున్నది?

స్త్రీకి పురుషునితో అవసరం లేదనుకున్నప్పుడు, అతని ప్రమేయం లేకుండా ఆమె ఎన్నో లక్ష్యాలను సాధించవచ్చుకదా!

పెళ్లికాగానే అంతకుముందు ఆమెలో ఏవైనా ఎబిలిటీస్ ఉన్నా అన్నిటికీ ఫుల్‌స్టాప్ పెట్టించి, కూపస్థమండూకాల్లా తయారుచేసే భర్తల, సంసారజంజాటాల బెడద లేకుండా ఆమెలోని అంతఃశక్తులను వీలయినంతగా వినియోగించుకోవచ్చు. తమ భర్తలు, సంతానం ఏదో తవ్వి తలకెత్తుతారన్న భ్రమలు లేకుండా తృప్తిగా బతకవచ్చు.

—మేడేపల్లి శేషు , తిరుపతి.

ముఖచిత్రం: లక్ష్మణ్

# చతుర

సంపుటి: 12 మే 1989 సంచిక: 4


అతనో మధ్యతరగతి మానవుడు. భార్యాబిడ్డల్ని పోషించగలిగే సంపాదనవున్నా అప్పులపాలవుతూనే వుంటాడు. ఆమె చేసే దుబారా ఖర్చులనిగానీ, హద్దూ పద్దూలేక వాగే ఆమె నోటినిగానీ అదుపు చెయ్యటం చేతకాదతనికి. ఎప్పుడైనా వారించినా ఆమె వినిపించుకోదు. ఆమె నోటికి జడిసి అప్పు చేసైనా డబ్బు అందిస్తాడు. అయినా అతన్ని విమర్శించటమే గొప్పగా భావిస్తుందే తప్ప ఏనాడూ అతన్ని అర్థం చేసుకుందుకు ప్రయత్నించదామె! కుటుంబ అవసరాలు తీర్చలేని అసమర్థుడుగా జీవన సమరంలో

## పరాజితుడు

గానే అతను మిగిలిపోయాడా? ఆమె బారినుండి తప్పించుకొనడానికి అతను వేసుకున్న పథకం ఏమిటి? ఆ పథకం నెరవేరి అతనికి సుఖశాంతులనిచ్చిందా? అతని చేతగానితనాన్ని విమర్శించినవాళ్ళ నోళ్ళు మూయించిందా?

పరాజితుడుగా మిగిలిన అతని మానసిక పరిస్థితికి దర్పణం పడుతూ

భమిడి వేంకటేశ్వర్లు

చిత్రించిన **పరాజితుడు** ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

రామారావు నిద్రలేచేసరికి బాగా ఆలస్యమయింది. రాత్రి తను నిద్రపోయేసరికి బాగా పొద్దు పోయింది–ఇంటి కొచ్చేసరికి పన్నెండు గంటలు దాటివుంటుందేమో... రెండుగంటల దాకా నిద్రపట్టలేదు. మామూలుగా ఒంటి గంటకు-ఆతరువాత నాలుగు గంటలకు తలుపు కొట్టే గూర్ఖా రావటం కూడా తెలియదు. అయిదు గంటలకు పాలవాడు వచ్చి తలుపు కొట్టిన విషయం కూడా గుర్తులేదు. ఏమిటో ఈ మొద్దునిద్ర! మామూలుగా అయితే పొద్దున్నే పేపరు హెడ్‌లైన్సు చూసి కాలకృత్యాలకు వెళ్ళటం అలవాటు. కాని ఆరోజు ఏమీ జరగలేదు.

"ఇంక ఆ దొరగారిని నిద్రలేవమను- కాఫీ రెడీ అయిందని చెప్పు" వంటింట్లో నుంచి అన్నపూర్ణ కూతురితో చెప్తోంది.

కామేశ్వరి ఆ విషయాన్ని తండ్రికి చెప్పింది.

అప్పుడు లేచాడు రామారావు.

"ఎంతసేపూ నిద్ర, బలాదూరు తిరుగుడు, ఆఫీసు తప్ప ఏమీ పట్టదు ఆ మనిషికి. అందరూ ఇలాగే ఉంటున్నారా...పెళ్ళాం ఎక్కడ కందిపోతుందోనని వెనకాలే ఉండి పనులు చేస్తుంటారు మొగుళ్ళు. కాని ఈ మొగుడు ఎక్కణ్ణుంచో ఊడిపడినట్టుగా ప్రవర్తిస్తాడు. ఛీఛీ... ఈ అవతారం ఇలా తయారవుతుందనుకోలేదు" అన్నపూర్ణ వంటింటిలో నుంచి సణుగుతూనే వుంది.

రామారావుకి ఆ సుప్రభాతం ఇరవై ఏళ్ళ నుంచీ అలవాటే. పెళ్ళయిన అయిదారేళ్ళు భర్తపట్ల అణకువ, గౌరవం చూపించింది అన్నపూర్ణ. ఇద్దరు కూతుళ్ళు పుట్టగానే ఆమె ధోరణి మారిపోయింది. భర్త పట్ల ఓ విధమైన చులకన భావం ఏర్పడింది. నోరు హెచ్చింది.

"కాఫీ చల్లారిపోతోంది. లేచి ముఖం కడగమను మీ నాన్నని. పేపరు తీరుబడిగా ఆఫీసుకెళ్ళి చదువుకోవచ్చు" అరిచినట్లుగా అంది అన్నపూర్ణ.

"నాన్నా... ఇంకలే...అమ్మ అరుస్తోంది, వినిపించటం లేదూ... కాఫీ తాగుదువుగాని, లే..." మంచం దగ్గరి కొచ్చి చెప్పింది కామేశ్వరి.

రామారావు బద్ధకంగా మంచం దిగాడు. తిన్నగా బాత్‌రూముకెళ్ళాడు. అతనికి నీళ్ళ బకెట్టు కనిపించలేదు. చికాగ్గా అరిచాడు- "బకెట్లో నీళ్ళు అన్నీ తాగేసేవా ఏమిటి?" అంటూ.

"ఎలావుంటాయి... వెళ్ళి నూతిదగ్గర తోడి తెచ్చుకోండి" అన్నపూర్ణ చెప్పింది.

రామారావుకి కోపం వచ్చింది- "ఏమిటి నీవుద్దేశం... నిన్న ఆఫీసుకెళ్ళేప్పుడు గోలెంనిండా నీళ్ళు తోడేను. తెల్లారేసరికి ఏభై బకెట్ల నీళ్ళు తాగేశారా... నీ దిక్కుమాలిన శుభ్రతమండిపోనూ... వీధిలో కళ్ళాపు చల్లడానికీ, పెరడు, సందుల్లోకి పది బకెట్లు తగలెయ్యాలిటే...అసలే నీళ్ళు లేక జనాలు చస్తుంటే... కడిగిందే కడుగుతూ ఏమిటా చాదస్తం నీకు...ఇన్ని నీళ్ళు రోజూ తోడి పోస్తున్నా ముఖం కడుక్కోడానికి నన్ను తోడి తెచ్చుకోమంటున్నావా" అన్నాడు.

అంతలో కామేశ్వరి నీళ్ళుతోడి తెచ్చి తండ్రికిచ్చింది.

"ఏం మనుమలో ఏమిటో...ఎంత చేసినా ఏమీ చేయలేదని ఏడుపే. ఒకళ్ళని అని లాభం ఏమిటి... నాకు అంటగట్టిన నాన్నని, అమ్మని అనాలి... వాళ్ళు మాత్రం ఈ అవతారం ఇలా తయారవుతుందని కలకన్నారా..." గొణుక్కుంటూ ముఖం కడగసాగాడు రామారావు. అయిదు నిముషాల్లో పూర్తిచేసి బయటికొచ్చాడు.

"ఆ దొరగారికి ఈ కాఫీ తీసుకెళ్ళి ఇచ్చిరా" కూతురికి గ్లాసుయిచ్చి వంటపనిలో మునిగిపోయింది అన్నపూర్ణ.

"నాన్నా... ఇదిగో కాఫీ. కాఫీ తాగాక నీళ్ళు తోడి గోలెంలోపోయి... లేకపోతే అమ్మ మళ్ళీ పురాణం చదువుతుంది" అంటూ తండ్రికి చెప్పింది కామేశ్వరి.

"రోజూ ఉండే భాగోతమే కదా ఇది... నిత్యం చచ్చేవాడి గురించి ఎవడేడుస్తాడు... కొందరి జీవితాలు ఇలాగే ఉంటాయమ్మా...ఓపిక ఉన్నంతవరకూ నీళ్ళు తోడతాను. అప్పుదొరికినంతవరకూ డబ్బు తెచ్చి మీకేలోటు రాకుండా చేస్తాను. నేను బతికున్నంతవరకూ మీకు ఏమీ ఫరవాలేదు. ఆ తరువాత ఏమయితే నాకేమిటమ్మా..." కాఫీ తాగుతూ అన్నాడు రామారావు వేదాంత ధోరణిలో.

అన్నపూర్ణ విసురుగా భర్త దగ్గరకొచ్చింది-

"ఏం మాట్లాడుతున్నారు మీరు...పెళ్ళానికి, పిల్లలికి తిండిపెట్టడం ఊరికి ఉపకారం చేస్తున్నట్లా... పక్కింటాయన్ని చూడండి, పెళ్ళాం ఎక్కడ కందిపోతుందో అని-నీళ్ళు తోడక్కర్లేకుండా, నూతికి మోటారు పెట్టించాడు. ఆ ఎదురింటాయన బోరింగుకి కరెంటు పెట్టించాడు. ఎనభై రూపాయలు ఇచ్చి పనిమనిషిని పెట్టించాడు. వారం, పదిరోజులకోసారి సినిమాలకెడతారు. మూడునాలుగురోజులకోసారి వీడియోలో సినిమా చూస్తారు. ఏడాదికోసారి ఏదోఊరు వెళ్ళి వస్తుంటారు." ఇది కూడా రామారావుకి కొత్తకాదు.

"అయిందా... యింకా ఏమైనా వుందా" అన్నాడు అతను.

"సిగ్గులేదూ యిలా చేయడానికి" అన్నపూర్ణ వెంటనే అనేసింది.

"సిగ్గా...నాకా...ఎందుకు? సిగ్గులేకనే పెళ్ళి చేసుకున్నాను- అందులో నిన్ను! నువ్వు చెప్పే మొగుళ్ళు క్లబ్బుల్లో పేకాడి వందలు తగలేస్తారు. గుర్రాలమీద మోజుతో శని, ఆదివారాలు రేసుపుస్తకాలతో రోడ్లమీద తిరుగుతారు. వాటంవున్న ఆడది కనబడితే రుచి చూడకుండా వదలరు. నేను ఏకపత్నీవ్రతుణ్ని. అందుకే నిన్ను నమ్ముకున్నాను. డెబ్బయ్యేళ్ళొచ్చినా, మీనాన్న ఆడది కనబడితే ఎలాగో మాట్లాడేందుకు ప్రయత్నించి మాటల్లో జ్యోతిష్యం, జాతకం అంటూ వాళ్ళచేతులు నలుపుతూ తృప్తిపడుతుంటాడు. ఇన్ని లొసుగులు, చరిత్ర పెట్టుకుని నా శీలాన్ని శంకిస్తూ మాట్లాడటం తప్ప నీకేం తెలీదు" అతను కోపంగా అన్నాడు.

అన్నపూర్ణ ఆ సంభాషణని పొడిగించదలచుకోలేదు. అందుకే వంటింట్లోకెళ్ళిపోయింది.

"నాన్నా...మీకు కొత్త ఆఫీసరు వస్తాడన్నావు... వచ్చాడా?" కామేశ్వరి అడిగింది.

రామారావుకి గుర్తుకొచ్చింది. "బాగా గుర్తు చేసావు. ఈవేళ వస్తాడు...కనీసం ఈవేళైనాత్వరగా బయలుదేరాలి" అంటూ స్నానం చేసేందుకు బయలుదేరాడు.

"నీళ్ళు కాగాయి...వేడినీళ్ళు పోసుకో" అంది కామేశ్వరి.

"నాకు వేడినీళ్ళు దేనికమ్మా...రోజూ చన్నీళ్ళే పోసుకుంటున్నాను కదా..."

"పోసుకోనీ చన్నీళ్ళు...చలికాలంకాదుగా" అంది అన్నపూర్ణ.

రామారావు బాత్‌రూములోకెళ్ళి గొళ్ళెం బిగించాడు.

"ఎందుకమ్మా నాన్నగారిని అస్తమానూ ఏదో ఒకటి అంటూ వుంటావు...మీ అమ్మకు, అక్కలిద్దరికీ యిది అలవాటు. ఊరికే వుండకపోతే నిద్రపట్టదా...అందుకే నాన్నగారు యింట్లోవుండటానికి భయపడతారు" అంటూ కామేశ్వరి తండ్రిని సమర్థించబోయింది.

"ఏమిటేవ్... అంత పెద్దదానివయిపోయావా! మా అమ్మ నీకు ఏమవుతుంది... మా అక్కలు ఏమవుతారే నీకు! పుస్తకాలు ఏమైనా కొనాలా, సినిమా ప్రోగ్రాం వుందా...లేకపోతే మీనాన్నను ఎందుకు సమర్థిస్తావు?" అన్నపూర్ణకు కూతురిమీద కోపం వచ్చింది.

"సరేలే...నిన్ను కదిలించడం నాదే పొరపాటు. నువ్వు ఎప్పుడూ మీవాళ్ళపార్టీనే కదా...ఇక్కడ నాన్నగారు, మేము, యిల్లు ఏమయిపోయినా నీకు మాత్రం దృష్టి అక్కడే వుంటుంది. డబ్బంతా కార్డులు, కవర్లకే తగలేస్తున్నావు. అసలు మనకు ప్రత్యేకంగా ఓ పోస్టాఫీసు వుండాలి. ఏమైనా నాన్నగారిని నువ్వు అలా సాధించడం బాగోలేదు"

రామారావు స్నానం ముగించి వచ్చాడు.

"వంట అయిందా...ఏంచేసావు?" ఓ అరగంట తరువాత అడిగాడు అతను.

"మీరు తెచ్చిన కూరలు ఎండిపోతున్నాయిగా...ఏంచేయాలో తెలియక చస్తున్నాను" వెటకారంగా అంది అన్నపూర్ణ.

"నేను బజారుకు వెళ్ళి కూరలు తేవాలా...వీధిలోకి ప్రతిదీ వస్తుంది. కొని ఏడవ్వచ్చుగా"

"ఏం..మీరుకొని తెస్తే మీ మగతనంపోతుందా"

"నీపిండాకూడు...మీ అమ్మా, నాన్న అన్నలు, అక్కలు, బావలు వస్తే నన్నడిగే చేస్తున్నావా...నేనే బజారుకెళ్ళి తెస్తున్నానా? అయినా నీకు అంత తీరిక ఏదీ...చుట్టుపక్కల ఆడంగు

లతో సొల్లు కబుర్లు చెప్పేందుకే ఎక్కడలేని టైమూ చాలదు...స్వేచ్ఛ, స్వాతంత్ర్యం కావాలని మైకులు, ప్లాట్‌ఫారాలు అదరగొడతారు మీరు. కొంపలు సరిదిద్దుకోలేరుగాని దేశాన్ని ఉద్ధరించే కబుర్లు. బయట వల్లించే శ్రీరంగనీతులు మొగుడికి, పిల్లలకు, ఇంటికీ సరిపెట్టుకుంటే చాలు...''

''అయిందా లెక్చరు...కదిలిస్తే ఆనోటికి అదుపుండదు. ఏ రాజకీయనాయకుడో కావాల్సింది''

''ఛీఛీ..వాళ్ళతో నాకు పోలికా...వాళ్ళు చేసేది ప్రజాసేవకాదు. వారికి దేశ'భక్తి' కంటే దేశ'భుక్తి' ముఖ్యం. వారికి ప్రజలు కనిపించరు. కూతుళ్ళు, కొడుకులు, కోడళ్ళు, అల్లుళ్ళు, బంధువులు తప్ప ఎవరూ కనిపించరు. పైకి పిచ్చి ప్రజల ముందర వాగేదంతా నిజమనుకుంటే అంతకంటే ఆత్మద్రోహం మరొకటి వుండదు. నేను నేనే...నేను మిమ్మల్ని ఎంత బాగా చూసుకుంటున్నానో నాకు ఎవరో వచ్చి చెప్పక్కర్లేదు- ఆ నమ్మకం నాకుంది'' రామారావు చెప్తున్నాడు.

''నాన్నా..తొమ్మిదవుతోంది టైము. ఆఫీసుకెళ్ళవా? పైగా కొత్త ఆఫీసరు వస్తున్నాడుగా'' అంటూ కామేశ్వరి గుర్తుచేసింది మరోసారి.

''నువ్వు కాలేజీకెళ్ళవా?'' అడిగాడు రామారావు.

''ఈవేళ కాలేజీ లేదు'' అందామె.

''ఇంతకీ వంట ఏమిటి'' భార్యవైపు తిరిగి అడిగాడు. ''దొండకాయలు కోసి వేయించాను. బచ్చలికూర పులుసు...కొబ్బరివచ్చడి..అప్పడాలు...'' చెప్పింది అన్నపూర్ణ.

''ఇంతచేసి పైగా ఆ వేటకారం దేనికీ...సరే వడ్డించు'' అన్నపూర్ణ కంచం పెట్టింది. కామేశ్వరి మంచినీళ్ళు పెట్టింది. తండ్రి తొడుక్కునేందుకు పాంటు, షర్టు బీరువాలోనుంచి తీసింది.

రామారావు కంచం ముందు కూర్చున్నాడు.

''మా అన్నయ్య ఉత్తరం చదివేరుగా..ఏంచేయమంటారు'' పాయింటులోకి వచ్చింది అన్నపూర్ణ. అలా అడగటంలో కోపం, చికాకు లేదు. అవి ప్రదర్శిస్తే పని జరగదని అమెకుతెలును. రామారావుకు ఈ డిప్లమసీ తెలియకపోతే కదా...

''నీయిష్టం..నన్నడగటం దేనికి...నీకు ఎలా చేయాలనుంటే అలా చేయి'' అన్నాడు అతను.

''మిమ్మల్ని అడగటం ఎందుకంటారేమిటి...ఎవరినింక అడగాలంటారు'' అన్నపూర్ణ కొంచెం చిరాకు ప్రదర్శించింది.

''చూడు అన్నపూర్ణా..నీతో యిరవై ఏళ్ళనుంచి కాపురం చేస్తున్నాను. ఆమాత్రం అర్థంచేసుకోలేని వెధవననుకుంటే ఎలాగ. నీ తెలివితేటలముందు నేనెంత- నీయిష్టం వచ్చినట్లు చెయ్యి...''

ఆమెకు ఏం చెప్పాలో తోచలేదు.

''ఇంతకీ ఎవరెవరు వెడుతున్నారు?'' అడిగాడతను.

''నేనూ...మా అక్క వెడదామనుకుంటున్నాము''

రామారావు నవ్వేసాడు. ''ఎందుకు నవ్వుతున్నారు'' అని అడిగింది తను.

''పిల్లి సమర్తాడిందంటే ప్రయాణం అవుతారు మీ యిద్దరూ. అవసరం ఎంత అని ఆలోచించరేం''

''బాగుందండీ...అన్నయ్య యిల్లు కట్టుకుంటే వెళ్లద్దా ఏమిటి?'' అన్నపూర్ణ ఎత్తిపొడిచింది.

''మరి మీ అన్నయ్య ఎందుకు వెళ్ళటంలేదు''

''వాళ్లబ్బాయి పరీక్షలకు తను చదువు చెప్పాలిట''

మరోసారి నవ్వాడు రామారావు- ''అవును మరి... మీ అన్నయ్యకే పెళ్ళయింది. పెళ్ళాం వుంది. పిల్లలున్నారు. వాళ్లకే కొంపవుంది. కొంపలో సామాన్లున్నాయి. మిగిలిన వారెవరికీ పెళ్ళిళ్ళు కాలేదు. పిల్లలు లేరు. ఉన్నా చదువులు లేవు. వానాకాలం చదువులనుకుంటే పరీక్షలుండవనేమో మీ అన్నయ్య ఉద్దేశం! ఎందుకు ఆత్మవంచన...కడుపులో లేనిది కావలించుకుంటే వస్తుందా...సొంత అన్నయ్య...సాక్షాత్తూ తండ్రి తరువాత తండ్రి అంతటివాడు, యిల్లు కట్టుకుని ఆహ్వానిస్తే ఏవోకుంటుసాకులు చెప్పి తప్పించుకుంటాడా...తను వెడితే

డబ్బు ఖర్చు, మిగిలినవాళ్ళు బేవార్సుగా ప్రయాణం చేస్తారనేమో...లేక తనవే రూపాయలని నీవిచిల్లపెంకులు అనికూడా భావిస్తుండవచ్చు'' అని అన్నాడు.

''వాడి గొడవ మనకెందుకు...వెళ్లమంటారా వద్దా?''

''వద్దు అంటేమానేస్తావా'' సూటిగా అడిగాడు రామారావు.

''వెళ్లకపోతే వాడేమైనా అనుకుంటాడు''

''ఏమిటి నీబొంద అనుకోడం! టికెట్లకు మూడొందలు అవుతుంది. రెండురోజులు ప్రయాణం. అసలే రోజులు బాగోలేవు. రైలు ప్రమాదాలు, దొంగతనాలు ఎక్కువగా జరుగుతున్నాయి. అందులో ఆడవాళ్లప్రయాణం. ఇప్పుడు నువ్వెడితే ఎంతలేదన్నా అయిదారు వందలు ఖర్చు అవుతాయి. దానికి తోడు మాకుయిబ్బంది. ఇంటికి తాళంవేస్తే ప్రమాదం. క్రితం ఏడాది మీ అన్నయ్యకూతురు పెద్దమనిషియిందంటూ వెళ్ళి ఎంతఖర్చు చేసుకోచ్చావో తెలుసుగా...ఇప్పుడు యీ గృహప్రవేశం..ఇటువంటి చిన్నచిన్న సందర్భాలకే వందలు ఖర్చుపెట్టడం సమంజసంకాదు. ఆలోచించుకో మరి...మా ఏడుపేదో మేము ఏడుస్తాం. నువ్వు దర్జాగా తిరగిరా! నీకు డబ్బు విలువ, అవసరం ఎప్పుడు తెలిసివస్తుందో! తెలీకపోతే తెలుసుకోవాలి. చెప్పినట్లు చేయాలి. ఫాల్సుప్రిస్టేజి పనులు చేసి వంటిమీద చీరవూడేలా భరతనాట్యం చేస్తే నష్టం ఎవరికి అని ఆలోచించాలి. నువ్వు వెడతానంటే నాకేం అభ్యంతరంలేదు. అప్పులు చేయడం అలవాటయింది కాబట్టి, తిరిగి ఎప్పటికైనా యిస్తాడన్న నమ్మకం వారికి వుండబట్టి డబ్బు ఎల్లాగోతెస్తాను'' అన్నాడు రామారావు కోపంగానే.

అన్నపూర్ణకు భర్త ధోరణి తెలుసుకాబట్టి అంతగా పట్టించుకోలేదు. మరోసారి ప్రయత్నించాలనుకుంది.

''నాన్నా...ఆఫీసుకు బయలుదేరు ఇంక'' కామేశ్వరికీ గొడవయిప్పట్లో తేలేదికాదని అర్థంకాగానే తండ్రికి టైముచెప్తూ బయలుదేరదీసింది.

రామారావు ఆఫీసుకు బయలుదేరేసరికి తొమ్మిదిన్నర అయింది. సైకిలు నెమ్మదిగా రోడ్డుమీద దొర్లుతోంది.

★ ★ ★

సైకిల్ తొక్కుతుంటే ఆయాసం వస్తోంది. నీరసం పెరుగుతోంది. కాళ్ళు నొప్పులు పుడుతున్నాయి. ఇంక తను సైకిలు తొక్కలేడు. తనకి ఏభై ఏళ్ళొచ్చినట్లే సైకిలుకు పాతికేళ్ళు వచ్చాయి. సైకిల్ దిగాడు రామారావు. పాంటు జేబులోనుంచి రుమాలు తీసి ముఖం తుడుచుకున్నాడు. ఓవైపు ఎండ...మరోవైపు ఎదురుగాలి. సైకిలుకేసి చూసాడు...బాగాపాతదైపోయింది. ఈ పాతికేళ్ళల్లో పదిసార్లు టైర్లు, ట్యూబులు, కొన్ని ఇతర భాగాలు మార్చాడు. రెండుమూడేళ్ళకోసారి ఓవరాయిలింగు చేయించాడు. ఇది సైకిల్‌మీద ప్రేమకావచ్చు, కాకపోనూవచ్చు. మనిషికి తిండి, నిద్ర ఎంత అవసరమో-నోరులేని ఇటువంటి వాహనాలకు కొన్నినదుపాయాలు మన అవసరం, స్వార్థంకోసం చేయకతప్పవు.

రామారావు ఎప్పటికప్పుడు సిటీబస్సులో వెళ్ళాలనుకుంటాడు. కాని బస్సులకోసం ఎదురుచూడలేక, ఆ రద్దీలో ఎక్కి దిగే ధైర్యంలేక సైకిల్‌నే నమ్ముకోసాగాడు. సమయానికి రాని బస్సులు, స్టేజీల్లో ఆగని బస్సులు అంటే అతనికి చికాకు. వాటికంటే మున్సిపాలిటీ బళ్ళే నయం. చెత్తకుండీలు కనపడగానే ఠపీమని ఆగిపోతాయి. అతనికి స్కూటర్ కొనాలని వుంది. ఈ కోరిక దాదాపు పదేళ్ళనుంచీ వుంది. కాని కొనే స్తోమతా, దాన్ని ఉపయోగించే ధైర్యం లేవు. ఈ మధ్యకాలంలో సైకిళ్ళు రోడ్లమీద అంతగా కనిపించటంలేదు. ప్రజల్లో సుఖప్రయాణంపట్ల మోజు, సరదా పెరిగింది. మోపెడ్లు, స్కూటర్లు, మోటారుసైకిళ్ళు - స్తోమతను మించి కొంటున్నారు.

రామారావుకి ఆశ్చర్యంగా వుంది. తన యిల్లు కట్టిన తాపీమేస్త్రీ, ఎలక్ట్రీషియను, కార్పెంటరు, ప్లంబరు, ఇంటికి మెటీరియల్స్ సప్లయిచేసినవాళ్ళూ స్కూటర్‌నుపయోగిస్తున్నారు. వారిముందు తాను పాత సైకిల్‌తో నిలబడాలంటే సిగ్గు, అవమానంగానూ ఉంటుంది. ఏ అప్పో చేసి కొన్నా పెట్రోలు ధర, టాక్సులు, ఇన్సూరెన్సు, పోలీసుల గొడవలు, ప్రమాదాలు అతన్ని భయపెడుతు

న్నాయి.

ఏమిటీజీవితం.....ఎందుకీబతుకు.....ఇన్నేళ్ల జీవితంలో తను ఏం సాధించినట్లు, తనకు యింట్లోనూ బయటా సుఖంలేదు. ఎందుకొచ్చిన బతుకిది! ఎంతసంపాదించినా ఖర్చులు పెరుగుతున్నాయి. అప్పులు తప్పటంలేదు. భార్యాభర్తలు సంసారరథానికి రెండు చక్రాలన్నది ఎవరు.....ఆరెండు గుర్రాలు ఒకే విధంగా పరుగెడతాయా.....నోరున్న మనుమల్లోనే ఏకాభిప్రాయం, సమైక్యత వుండదు. కాబట్టే నోరులేని జంతువులే నయమేమో.....రామారావు ఎంత పొదుపుగా ఉండాలనుకుంటాడో, అన్నపూర్ణ అంత ఖర్చుమనిషి. దుబారా మనస్తత్వం. ఇద్దరివీ ఉత్తర దక్షిణ ధృవాల వ్యత్యాసం. అయిదువేళ్ళ అనుబంధం. అమావాస్య-వెన్నెల భేదం. తూర్పుపడమరల అంతరం.

తాను అన్నపూర్ణ విషయంలో పొరపడ్డాడా.....ఏమో మరి.....మనిషికి తెలివితేటలు, మంచితనం, ఆలోచనా, వివేకం యిచ్చాడు దేవుడు. అలాగే తొందరపాటు యిచ్చాడుకాబోలు.

రామారావుకిప్పటికీ గుర్తే.

అతను యిరవై ఏళ్ళక్రితం ఓ పెళ్ళికి వెళ్ళాడు. ఆ పెళ్ళిలో అతన్ని కలిసిన ఓ పెద్దమనిషి అచ్యుతరామయ్య. ఆయన రామారావుని గమనిస్తూనే, పెళ్ళికొచ్చిన కొందరి ద్వారా అతనిగురించి భోగట్టా చేసాడు. చివరికి భోజనాలదగ్గర యిద్దరివీ పక్కపక్క సీట్లే. భోజనాలయ్యాయి. పందిరిలో ఓ పక్కగా తమలపాకులు, వక్కపొడి, సున్నం సీసా వుంచిన ట్రేని చిన్న టీపాయి మీద వుంచారు ఆహ్వానితుల నిమిత్తం.

అచ్యుతరామయ్య తమలపాకులు వేసుకుంటూ రామారావు దగ్గరకొచ్చాడు. "నువ్వు ఏంచేస్తున్నావు?" అని అడిగాడు.

"ఇప్పుడే భోజనం చేసాను. ఓ గంట తరువాత బస్సుకెడతాను" అన్నాడు అతను.

"భలేవాడివోయ్.....నేనడిగేది ఏంఉద్యోగం అని"

రామారావు చెప్పాడు.

"మీదేవూరు.....మీ నాన్నగారిపేరు, ఏంఉద్యోగం చేస్తున్నారు?" ఆ ప్రశ్నలక్కూడా జవాబు చెప్పాడు తను.

"నీతో మాట్లాడాలి- ఆఫీసు అడ్రసు ఇస్తే వస్తాను"

"ఇక్కడ అడగండి ఫరవాలేదు. ఇంకా బస్సుకి టైముందిగా"

"ఇప్పుడొద్దులే.....నేనే వస్తాను"

రామారావు ఆఫీసు అడ్రసు రాసిచ్చాడు. అచ్యుతరామయ్య ఉద్దేశం గ్రహించాడతను ఇదేదో పెళ్ళివ్యవహారం బాపతుగా. పెళ్ళిళ్ళలోనే సాధారణంగా వధూవరుల భోగట్టా చేస్తుంటారు. వివాహం ఎవరెవరికి రాసిపెట్టి వుందో ఓ పట్టాన తెలియదు. వివాహాలు స్వర్గంలో జరుగుతాయిట. కాని అవి ప్రస్తుతం ధనలోకంలోనే వ్యాపార ధోరణిలో జరుగుతున్నాయి. ప్రయత్నం మామూలుగానే వుంటుంది. చెప్పులు అరుగుతాయి. పంచెలు-చొక్కాలు చిరుగుతాయి. డబ్బు ఖర్చు అవుతుంది. జుట్టు నెరిసి ఊడిపోతుంది. ప్రశ్నల వర్షంలో జవాబులు కొట్టుకుపోతాయి. ఓపిక నశిస్తుంది. కోపతాపాలు పెరుగుతాయి. అయినా అన్వేషణ కొనసాగుతుంది. ఇంత జరిగినా ఫలితం ఎలా వుంటుందోననే భయమే మరి!

సరిగ్గా పదిహేను రోజులకే రామారావుని కలిసాడు అచ్యుతరామయ్య.

"నువ్వు ఈపాటికే నారాకలోని ఉద్దేశం గ్రహించివుంటావు" అంటూ జేబులోంచి పర్సు తీయబోయాడు.

"తెలుసు... ఈ మాత్రందానికి మీరు యింతదూరం రావటందేనికి? ఆరోజే చెప్పవచ్చుగా.....అనవసరపు ఖర్చు దేనికి" అన్నాడు రామారావు.

అయితే అచ్యుతరామయ్య యిక్కడ ఓ రాజకీయం ప్రదర్శించాడు. తానుచేసే పెళ్ళి ప్రయత్నం మరొకరికి తెలియకూడదు. తెలిస్తే పోటీకొచ్చే ప్రమాదం వుంది. తాంబూలాలు పుచ్చుకునేవరకూ ఈ వ్యవహారం మరొకంటికి తెలియకూడదు. రాజకీయరంగం కంటే కుళ్ళిపోతోంది వివాహరంగం. తొలిచూపుల్లోనే రామారావు పట్ల ఆకర్షితుడయ్యాడు అచ్యుతరామ

య్య ఆవిధంగా.

రామారావుకి పోస్టు గ్రాడ్యుయేటు చదు వుంది. సాంప్రదాయ కుటుంబం. మంచి ఉద్యోగం వుంది. తెలివైనవాడు. తల్లిదండ్రు లు సంస్కారులు. ముగ్గురు అన్నదమ్ముల్లో తనే పెద్ద. ముగ్గురు చెల్లెళ్ళున్నారు. నాలుగైదె కరాల పొలం వుంది. ఇంతకంటే ఏంకావాలి!

"ఈఫొటో నా మూడోకూతురిది. పేరు అన్న పూర్ణ. ఎస్సెల్సీ పాసయింది. టైపు హైయ్యరు పాసయింది. హిందీ రాష్ట్ర భాషకూడా పాస యింది" అన్నాడు అచ్యుతరామయ్య.

రామారావు ఫొటోవైపు చూడలేకపోయాడు.

తాను "ఒకరిని" పెళ్ళిచేసుకోవాలనుకు న్నాడు. అందుకు తన తల్లి-తండ్రి గ్రీన్‌సిగ్నల్ యిచ్చారు. "ఆమె" సంసిద్ధత, అంగీకారం వెల్లడించింది. కాని "ఆమె" తల్లి వారి వివా హానికి స్పీడు బ్రేకర్‌గా నిలిచింది.

తనదనుకున్న "ఆమె" తనకు దక్కలేదు. "నీదన్నది నీది కాదు"-ఎవరన్నారో.....అదే నిజమయింది. రామారావు ఆలోచిస్తున్నాడు. "ఆమె" తనదికానప్పుడు ఆ స్థానంలో ఎవరొ చ్చినా తనకంగీకారమే! ఎటొచ్చీ తనభార్య 'ఆమె'లా వుండాలి. 'ఆమె'లోని అందచందా లు అంతగా లేకపోయినా తనని అర్థం చేసు కుని ప్రవర్తిస్తే చాలు.

కర్టెసీ కోసం అన్నపూర్ణ ఫొటో చూశాడు రామారావు. 'ఆమె' రూపం మెరుపులా మెరి సింది -"కళ్యాణిలా"!

అచ్యుతరామయ్య తన సంభాషణ కొనసా గించాడు. "నాకు ముగ్గురు కొడుకులు, ముగ్గు రు కూతుళ్ళు. పెద్దకొడుకు జంషెడ్‌పూర్‌లో పనిచేస్తున్నాడు. వాడికి నరేంద్రపురం వారి అమ్మాయినిచ్చి పెళ్లిచేశాను. రెండోవాడు భీమాకంపెనీలో ఉద్యోగం. హైదరాబాద్‌లో మకాం. వాడికి నరసాపురం వారి పిల్లనిచ్చారు. ఇకమూడోవాడు రైల్వేలో యీమధ్యనే చేరాడు - ఖరగ్‌పూర్‌లో. వాడి అత్తవారిల్లు యానాం. ఇకపోతే పెద్దమ్మాయిని మండపేటఇచ్చాము. అల్లుడు రోడ్లు భవనాలశాఖలో ఉద్యోగం. రెండో అమ్మాయికి నరసాపురం సంబంధం చేశాను. భర్త హైదరాబాదులోనే చేస్తున్నాడు-టెలిఫోన్స్‌లో. పోతే అన్నపూర్ణకు ప్రస్తుతం వివాహం చేయాలని ఉద్దేశం. నాకు తాటిపా కలో ఓ పెంకుటిల్లు, పొలెంలో నాలుగెకరాల మాగాణి వుంది. బడిపంతులుగా ఉద్యోగం చేస్తున్నాను. నేను, నాభార్య, మాఅమ్మ వుంటు న్నాము. మాయింటి పనులన్నీ నామూడో కూతురు - అన్నపూర్ణే చేస్తుంది"

రామారావు వింటున్నాడేగాని, అంతగా దృ ష్టినిలిపి ధ్యానంతో మనసు కేంద్రీకరించ టంలేదు.

"మీరు మాఫాదరుతో మాట్లాడండి" అన్నా డు.

అచ్యుతరామయ్యకు పచ్చివెలక్కాయ కొరి కినట్లనిపించింది. "అమ్మాయి నీకు నచ్చితే మిగిలిన వివరాలు మీ నాయనగారితో మాట్లా డతాను" అన్నాడాయన.

"కాని ముందుగా వారి ఉద్దేశం తెలుసుకో వాలిగా"

"నిజమే, కాని నీ అభిప్రాయం తెలును కుని" డిప్లమాటిక్‌గా ధోరణి మార్చాడాయన.

"భలేవారండీ మీరు... ముందువారి ఉద్దేశం తెలుసుకోడం మంచిదికదా... వాళ్లు ఏ సంబంధాలైనా చూస్తున్నారేమో..వారిదృష్టిలో ఎవరి అమ్మాయిఉందో...

"అంతేనంటావా"

"మీరు అమ్మాయి తండ్రిగా మాట్లాడవద్దు. అవసరాన్ని అవకాశాన్ని జోడించకండి. మీ కొడుకు పెళ్లయితే ఎలా ప్రవర్తిస్తారు అని ఆలోచించండి. ఏ పెళ్లికయినా పద్ధతి, ఫార్ములా ఒకటే. ముందుగా మీరు నాన్నగారితో చెప్పండి. ఆయనకు తెలియకుండా నేను మీకు నాఉద్దేశం చెప్పడం బాగోదుకదా..." రామారావు వివరంగా చెప్పాడు.

అచ్యుతరామయ్య పరిస్థితి జారుడుమెట్ల మీద కాళ్లలా అయింది. ఏమైనా రామారావుని వదులుకోకూడదని నిర్ణయించుకోడంతో, అతని తండ్రితో మాట్లాడేందుకే నిర్ణయించు కున్నాడు. తనకు పోటీగా ఎవరొచ్చినా ఏదోవి ధంగా అన్నపూర్ణని వదిలించుకోవాలి. ఇది డబ్బు ప్రపంచం. ఇక్కడ మనుమలకు విలువ లుండవు. విలువలను నడిపించేది, మార్చేదీ కేవలం డబ్బు.

అచ్యుతరామయ్య తిన్నగా వీరభద్రయ్యని

మీ పాపాయికి ఇవ్వండి కూరగాయలలోని మంచి పుష్టి



ముందుగానే వండిన

# ఫారెక్స్® - వెజ్




## 6 నెలల నుంచి

క్రొత్త ఫారెక్-వెజ్ విటమిన్లు సమృద్ధిగా గల కాయగూరలు - క్యారట్లు, టమోటాలలోని మరియు పెసరపప్పులోని సహజమైన పోషణ గుణములతో కూడినది.
ముందుగానే వండినది. కనుక మీ పాపాయి యొక్క సున్నితమైన జీర్ణశక్తికి అనుకూలమైనది.

**ఫారెక్స్ – పెరుగుదల కోసం రుచికరమైన విధానం.**



ఫారెక్స్ పోషకాహారాల శ్రేణిలో ఇప్పుడు కలవు:
1. పాలతో కూడిన ఫారెక్స్-సిరియల్, 2. ఫారెక్స్-వెజ్, 3. ఫారెక్స్-ఎగ్.

GX/31/173 TEL

కలిశాడు వారం రోజుల తరువాత.

తనకు తానుగానే పరిచయం చేసుకున్నాడు.

తనగురించి పరిచయాన్ని మరింత వివరంగా చెప్పుకున్నాడు.

వీరభద్రయ్యకు కొడుకు ఉద్దేశం తెలును. రామారావుకి యిప్పటికే 'కళ్యాణి'పట్ల లైకింగ్ వుంది. విముఖత, అయిష్టం అసలేలేదు. కాని ఆసంబంధం నబ్బుబిళ్లలా జారిపోయింది. ఏమిటీ జీవితం..రైలు ప్రయాణంలాంటి జీవితంలో ఎంతోమందిని చూడటం, మాట్లాడటం జరుగుతూవుంటుంది. ఎందరో రైల్వేస్టేషనుకు రైళ్లకోసం వస్తారు. అందరికీ రైలులో కూర్చొనేందుకు జాగా దొరకదు. చాలామంది నిలబడే, వేలాడుతూ ప్రయాణంచేస్తారు. వారికి గమ్యం చేరటం ముఖ్యం తెలియని ముఖాల్ని తెలిశాక వదిలిపెట్టటం కష్టమేమరి! ఈ జీవన పోరాటంలో పరిచయస్తులు, స్నేహితులు, అపరిచితులు తారసపడుతూనే వుంటారు. ప్రవాహపువాలు వీలును బట్టి నీరు పొర్లుతూవుంటుంది. నీటికి ప్రవాహాన్ని ఎదిరించే సాహసంవుండదు. అలాగే మనుషులు కూడా...ప్రతిఅడుగు ఎంతోజాగ్రత్తగా వేయవలసిందే. ఏమరుపాటు, పొరపాటు, నిర్లక్ష్యం జరిగినా ఇంతేసంగతులు.

ఆవిధంగా వున్నాయి వీరభద్రయ్య ఆలోచనలు.

రామారావుకి విద్యార్థి దశ స్వర్ణయుగం. అతని జీవితంలోకి వచ్చిన కళ్యాణిని స్వర్ణ సింహాసనం మీద కూర్చోపెట్టాలనుకున్నాడు. కాని అంతటి అదృష్టం చేతిలోనుంచి జారిపోయింది. అది స్వప్నంగా...ఊహగా నిలిచిపోయింది.

కళ్యాణితో పదడుగులు నడిచి జీవన సామ్రాజ్యం స్థాపిద్దామనుకుంటే ఆమెతల్లి అడ్డుపడింది. అంతే రామారావుకి అది ఓ పెద్ద షాక్. గులాబీలచాటున ముల్లుగా వుందామెతల్లి.

వీరభద్రయ్యకు ఏంచెప్పెందుకూ తోచటంలేదు.

కొడుకుతో ముఖాముఖి చర్చించి మాట్లాడాలని వీరభద్రయ్య ఉద్దేశం. కాని అచ్యుతరామయ్య ధోరణి పాతగా, కొత్తగా వుంది. ఉన్నపళంగా చెప్పాలన్నట్లు కనిపిస్తోంది.

ఎన్నో అనుకుంటాము. ఏదో చేద్దామనుకుంటాము. కాని అనుకున్నది, చేద్దామనుకున్నది అమలుజరిగితే అది జీవితంకాదేమో... ఈ జీవితాన్ని నడిపించే అదృశ్యశక్తి తన ఉనికిని బలపరచుకునేందుకే ప్రయత్నిస్తుందని రామారావు జీవితంలో రుజువయింది. జరిగేది, జరిగినది మన మంచికే అని సరిపెట్టుకోవడమే ఎవరైనా చేయగలిగేది.

వీరభద్రయ్య ఆలోచనలు ఆగిపోయాయి.

అచ్యుతరామయ్య గుండె సూపరుఫాస్టు రైలులా కొట్టుకుంటోంది- నిర్ణయం కోసం.

"సరే... ఫొటో ఇచ్చారుగా. మావాడిని అడిగి తమరికి తెలుపుతాను" అన్నాడు వీరభద్రయ్య.

"నా అప్లికేషన్‌కి ప్రాముఖ్యతనివ్వండి. ఒక జిల్లావారం... ఒక తాలూకా వారం. మీకూ నాకూ కేవలం కాలువ అడ్డం. మనం చెరో ఒడ్డునున్న ఊళ్ళల్లో పుట్టాము. మీరూ ఆడపిల్లల వివాహాలు చేశారు. కాబట్టి సాధకబాధకాలు మీకు మరోసారి చెప్పక్కర్లేదు. దయచేసి నన్ను నా కూతురిని ఆశీర్వదించండి" అంటూ చేతులు జోడించాడు అచ్యుతరామయ్య- రాజకీయాన్ని వినయాన్ని మిళితం చేస్తూ.

"సరే" అన్నాడు వీరభద్రయ్య.

వారంరోజుల తరువాత రామారావు తండ్రి దగ్గరకు వెళ్లాడు. తల్లితో, తండ్రితో విడివిడిగా చర్చించాడు.

"ఇందులో నా ప్రమేయం లేదు. నేను నిన్ను ఒత్తిడిచేయను. నీకు అన్నపూర్ణ మనస్ఫూర్తిగా నచ్చితే పెళ్ళి చేసుకో. మేము చేసుకోమన్నామని, చేసుకున్నాననీ అనొద్దు. సంబంధం చూసి, మంచి చెడ్డలు ఆలోచించడమే మా పని" అన్నాడు వీరభద్రయ్య మరోసారి.

రామారావుకి "ఆమె" మరోసారి గుర్తుకొచ్చింది. తనకు 'ఆమె' నుంచి గ్రీన్ సిగ్నల్ లభించినట్లుగా భావించాడు. "సరే... అన్నపూర్ణని చేసుకుంటాను" అన్నాడు తను-కళ్యాణిని ఓసారి గుర్తుచేసుకుంటూ.

నాలుగు నెలల తరువాత వచ్చిన శ్రావణ మాసంలో అన్నపూర్ణ రామారావుకి అర్థాంగి అయింది.



రామారావు పనిచేసే ఆఫీసు చాలాపెద్దది. ఓ ముఖ్యమైన విభాగంలోని సెక్షనుకి సెక్షనాఫీసరు. నిజానికి ఆ సెక్షనులోకి ఎంతోమందిని పోస్టు చేసినా ఎవరికి వారు వారం పదిరోజుల కంటే ఉండేవారుకాదు- అధికారుల కాళ్ళో, చేతులో పట్టుకుని అదీ కుదరకపోతే వారి భార్యలకు గులాములైపోయో... ఇంటిపనులు, వంటింటి పనులు ఇంకా కావాలంటే బాత్‌రూముల్లో పనిచేసి ఆ సెక్షన్ నుంచి తప్పించుకునే వారు.

ఇప్పటికి పది సంవత్సరాలుగా అదే సెక్షనులో కొనసాగుతున్నాడు రామారావు. ఎంతో మంది ఆఫీసర్లు, గుమాస్తాలు, టైపిస్టులు మారారు. ఎందరి మనస్తత్వాలు చదివాడో- రకారకాల ఉద్యోగులు... విభిన్నతత్వాలు... వస్త్రధారణలు... రామారావు స్టడీచేశాడు. తన సెక్షనులో అతిశయం, అహంభావం, డాంబికాలు ప్రదర్శించేవాళ్ళున్నారు. పదకొండుగంటలదాకా సెక్షనుకు రానివాళ్ళు, వచ్చినా పనిచేయనివాళ్ళు, మార్నింగు షోలు, మాట్నీ సినిమాలకు చెక్కేసేవాళ్ళు... తరచు సెలవులు పెట్టే మగవాళ్ళు, ప్రతి ఏడాదీ మెటర్నిటీ సెలవు తీసుకునే ఆడవాళ్ళు, అటెండెన్స్ రిజిస్టర్లో సంతకం చేసి మర్నాడే ముఖాలు చూపించేవాళ్ళు... ఇలా ఎందరినో!

"మీరు ఎక్కడికైనా వెళ్లండి, తిరగండి. కాని చెప్పిమాత్రంపొండి. మీ పనిచేసి నా టేబులు మీద పడేయండి. అది కూడా చేయలేకపోతే, కేవలం జీతాలకోసమే ఆఫీసులకొస్తుంటే- ఆ ఫైల్సు, లెటర్సు నా ముఖాన పారేయండి. నేను తంటాలువడతాను" ఓ ఏడాదిపాటు సెక్షనులోని వాతావరణాన్ని గమనించి ఒకరోజు అన్నాడు రామారావు- ప్రమోషను వచ్చిన కొత్తలో.

అదిగో అప్పట్నుంచి అతను మంచివాడు అయ్యాడు. మంచివాళ్ళకే మంచివాడు అయ్యాడు. ఎందుకని ఆఫీసర్ల తిట్లు, మందలింపులు తనే జీర్ణం చేసుకుని- వాటి సారాన్ని కూడా సెక్షనులోకి బట్వాడా చేయకపోవడం వల్ల.

ఒకరోజు బి-వన్ క్లార్కు పదకొండుగంటలకొచ్చి అటెండెన్సు రిజిస్టరు కోసం రామారావు టేబులు వెతుకుతున్నాడు.

"ఏం నాయనా... తెల్లారి గంటయింది. మన పనులు ఎలా ఉన్నా చేసినా అటెండరు మాత్రం టైముకు తీసుకుపోయి ఆఫీసరు రూములో పడేసి తనపని అప్పటికి, ఆ రోజుకి అయిపోయిందనుకుని చెట్టుకిందకో- కాంటీనుకోపోయి కూర్చుంటాడు"అన్నాడు రామారావు.

బి.వన్ క్లార్కు ఆలోచిస్తున్నాడు- ఏంచేయాలని.

"గదిలోకి వెళ్ళిపెట్టు. ఆఫీసరు మందుకొట్టడానికి వెళ్ళాడు" చెప్పాడు రామారావు.

"గదిలోకెళ్ళి పెట్టడం ఏమిటిసార్... వాడు సవాలక్షప్రశ్నలు వేస్తాడు. ఏదో ఫ్లాష్‌బాక్ చెప్పాల్సివస్తుంది. అటెండెన్సులో "క్రాస్" చేస్తాడు. లేదంటే "ఇంటూ" గుర్తువేస్తాడు. ఏం ఫరవాలేదు. కొత్తరకం రబ్బర్లు వచ్చాయి. ఒకటికొని తెచ్చి దానితో తుడిపేస్తాను. అనుమానంరాదు. సైంటిస్టులు అనంతకోటి పద్ధతుల్ని తమ పరిశోధనలద్వారా ప్రవేశపెడుతున్నారు. ఆ ఖర్చు కూడా ఎందుకంటే- సాయంత్రం కొంపకెళ్ళే ముందు సంతకం బరికేసి వెడతాను. మర్నాడు ఎప్పుడు వచ్చినా ఫరవాలేదు" ఓడిపోయిన వీరుడిలా గీతాసారాన్ని చిలకపలుకుల్లా వర్ణించాడు సదరు బి-వన్ క్లార్కు.

"అటువంటి పని మాత్రం చేయకు- తెలిసిందంటే ముందు నేను యిరుక్కుంటాను... నీకు దయకలిగినప్పుడే ఆఫీసుకురా" రామారావు జవాబిచ్చాడు.

''ఎందుకుసార్ అంతభయం... తప్పుచే సినా రైటుఅని ఎదురునిలిచినప్పుడే ఈ జీవితం సాఫీగా నడుస్తుంది. లేదంటే నత్తనడ కేమరి''

ఒకసారి బి-ఫోర్ గుమాస్తా రామారావు మీద ఎదురుతిరిగాడు- టైముకి రాకపోవడం విష యంలో.

''నేను పదకొండున్నర లోపల రాలేను. నాలుగ్గంటల తరువాత కూర్చోలేను. గంటకో సారి ఓ అరగంట అలా తిరిగొస్తేకాని నామన సు కుదురుగా వుండదు. నేను చిన్నగుమస్తాని. నువ్వు పెద్ద గుమస్తావి. నీ ఖర్మకాలి పరీక్షపా సైన నేరానికి సెక్షనాఫీసరు అయ్యావు. డబ్బా వాయించుకోకు. సొల్లు కబుర్లు చెప్పలేకపోతే కట్టుకున్న పెళ్ళాంకూడా మంచంమీద దు ప్పటి సరిచేయదు'' అన్నాడా బి-ఫోర్ గుమా స్తా. ''చూడు నాయనా... బాబూ... చిట్టితండ్రి... నీకు ఆఫీసరు పిలిచి కవరులో మెమోపెట్టి యిచ్చినప్పుడు, ఆ చిలకపలుకులు అక్షరరూ పంలో రాసివ్వు. అప్పుడు ఫలితం ఆలోచించు. నిన్ను కట్టుకున్న నేరానికి నీపెళ్ళాం 'హలో లక్ష్మణా' అంటూ జీవితమంతా బాధపడు తుంది- ఉద్యోగం వూడబెరికి పంపించినప్పు డు'' రామారావు సౌమ్యంగా చెప్పాడు.

''చూడు మిస్టర్ సెక్షనాఫీసర్... దటీజ్ రామారావ్... నేను అడ్మినిస్ట్రేషన్, ఎకౌంట్స్, వెల్ఫేర్ సెక్షన్లలో పనిచేసి వచ్చాను. కాబట్టి ఆఫీసర్లంటే భయంలేదు. వాళ్ళే నన్ను చూసి భయపడతారు.''

''చిత్తం నాయనా... మీదయ... మాప్రాప్తం''

బి-త్రీ క్లార్కు కూడా ఏం తక్కువ తినలేదు. రామారావుకి తనకన్నా వయసులో చిన్నవారిని ఏకవచన సంబోధన చేసి ''నువ్వు'' అని పిలవటం అలవాటు. అదే పొరపాటు అయింది.

''నువ్వు నన్ను నువ్వు అంటే నేనుకూడా నువ్వు అని సంభోదించవలసి వస్తుంది. గౌ రవం యిచ్చిపుచ్చుకోవటం మంచిది. వయసు తేడాలు ఇంటిదగ్గర... ఇక్కడ కాదు... నేను ఉద్యోగంలో చేరి అయిదేళ్ళయింది. మిగి లిన సర్వీసు పనిచేయకపోయినా ఫరవాలేదు. మీసెక్షనాఫీసర్లు పరీక్షపాసై ఏంచేస్తారు... ఈ పనులు కూడా చేసుకోండి... జీతం దొబ్బుడం లేదూ...''

రామారావుషాక్ తిన్నాడు. ''తప్పయిపో యింది తమ్ముడూ'' అన్నాడు వెంటనే.

''వాట్... నేను నీకు తమ్ముడినా... నీకు నేను యింతలోకువా... నీకులం ఏమిటి, నాకులం ఏమిటి... వరసలు కట్టిపెట్టు... ఈ అన్న- తమ్ముడు వంటి సంబంధాలు నాకు నచ్చవు. అసహ్యం'' బీ-త్రీ క్లార్కు ఆవేశంతో అనేసాడు.

''సార్‌సార్... పొరపాటయిపోయింది. అందుకు ఏశిక్ష విధిస్తార్ నాకు! నాలుగో అంత స్తు నుంచి దూకమంటారా... ఏరైలుకిందో, బస్సుకిందో పడమంటారా... పోనీ నల్లుల మందు ఓ అరకిలో తినేదా... ఏదీ లేదంటే ఉరిపోసుకుని చావనా... మరి తాడు తమరే కొనివ్వాలి... ఎందుకంటే నాదగ్గర డబ్బుల్లేవు. ఎందుకంటే, నేను పనిచేసి జీతం తీసుకుంటా ను. లక్ష్మీదేవి ఎప్పుడూ సోమరిపోతుల్నే వరి స్తుందట'' అన్నాడు రామారావు ఏమీ తొణ క్కుండా.

బీ-త్రీ క్లార్కు ఆశ్చర్యపోయాడు- తనని తిరిగి 'సోమరిపోతు' అని పరోక్షంగా నిందించి నందుకు. ''మీతో వాదన నాకు దండగ. నాకు బుద్ధి, జ్ఞానం వున్నాయి'' అన్నాడు.

''అవును నిజమే... నీకున్నవి నాకు లేకపోబ ట్టే క్రమశిక్షణ, బాధ్యతలతో పనిచేస్తున్నాను. నీకూ యీ కుర్చీలో కూర్చునే రోజువస్తుంది. అప్పుడు నీ ఎదురు కుర్చీల్లోని వాళ్ళు బుద్ధి చెప్తారు.

ఆరోజు తెలిసివస్తుంది. ఈరోజు జేబులో పదిరూపాయలుంటే సరిపోదు. కళ్ళకు రంగు టద్దాలు పెట్టుకోటంతోటే అవలేదు.

స్కూటరు, మోటారుసైకిలు ఎక్కినంతమా త్రాన మనకేదో గౌరవం వచ్చిపడుతుందనుకో కూడదు. ఇంట్లో పెళ్ళాంమీదా, పిల్లలమీదా విరుచుకుపడినట్లుకాదు. నువ్వు నాలుగు దెబ్బ లు నన్నువేయవచ్చు. నేను కనీసం ఒక్కటైనా కొట్టచ్చు. అసలువ్యవహారం అంతవరకూ ఎందుకురావాలి! ఆఫీసుపని చేయకపోయినా ఫరవాలేదు. కాని కట్టుకున్న పెళ్ళానికి చీరకొన లేదనుకో...పూలు తెచ్చివ్వలేదనుకో... సినిమాకు పంపించలేదనుకో...ఏంచేస్తుందో తెలుసా! ను

వ్యకట్టిన పుస్తెలు తాకట్టుపెట్టి తను అనుకు న్నది చేసి తీరుతుంది...నువ్వు నన్ను ఓమాట అన్నావు. అందుకు నేనింత వివరంగా చెప్పవ లసివచ్చింది. నీకింకా ఇటువంటి పాఠాలు వినాలనుంటే-నన్ను తిట్టు...కేకలువే యి...మందలించు...ఫరవాలేదు'' రామారావు గుక్క తిప్పుకోకుండా చెప్పాడు.

అంతే... బీ-త్రి క్లర్కు కళ్ళునీళ్ళతో తిరి గాయి.

**ఆ మర్నాటి**నుంచీ వారిమధ్య స్నేహం చోటుచేసుకుంది.

ఆరోజు రామారావు సెక్షన్లో మరోప్రకటన చేసాడు- ''ఆఫీసు ఒక కుటుంబం. ఉద్యోగు లు ఇక్కడ సభ్యులు. ఒకచోట వున్నప్పుడు కులమతాలు, ధనిక, బీద అంతరాలు వుండ కూడదు. మీపని మీరు చిత్తశుద్ధితో చేస్తే ఎవరికీ తలవంచేపని వుండదు. మాటలుపడే అవకాశం రాదు. ఎవరూ ఎవరికీ గొప్పకాదు. ఉన్నవాడిని చూసి లేనివాడు బాధపడనక్కర్లే దు. లేనివాడిని చూసి ఉన్నవాడు జాలిపడన క్కర్లేదు. ఎవరికుంటే వారు తింటారు. ఇటు వంటి తారతమ్యాలు చూపించటం మంచిదికా దు. గౌరవం ఇచ్చిపుచ్చుకోడంతో పెరుగు తుంది-'' అంటూ ...

అప్పట్నుంచీ రామారావుపట్ల ఉద్యోగుల్లో పేరు, గౌరవం పెరిగాయి. మర్యాద నేర్చుకోసా గారు.

అయితే రోజులు ఎప్పుడూ ఒకేలా వుండవు.

మనుషులు కూడా మారుతుంటారు-స్వత హాగానో, ఇతరులు చెప్పిపెట్టడంవల్లనో...డ బ్బుతో విరోధాలు, కక్షలు పెంచేందుకో...

అందుకు ప్రతీక బీ-సెవెన్‌క్లర్కు. అతను ఎప్పుడూ పనిచేయడు. చేసేవాళ్ళనికూడా చే యనివ్వకుండా తనదగ్గరకు ఫ్రెండ్సుని రప్పించుకుని వారితో రాజకీయాలు, సినిమా లు, కాలేజీ కబుర్లు చెప్తుంటాడు. దానిక్కార ణంగా సెక్షన్లోనేకాదు, పక్క సెక్షన్లల్లోకూడా డిస్ట ర్బెన్సు. కొంతమంది సెక్షనాఫీసర్లు పైఆఫీసర్ల దగ్గరకెళ్ళి రామారావు పట్టించుకోనందున, ఇటువంటివి కలుగుతున్నాయని ఫిర్యాదు చే శారు. అయితే రామారావు ఎంతవరకూ బాధ్యు డు అనేది అధికారులకూ తెలుసుకాబట్టి, చె ప్పుడు మాటల్ని పట్టించుకోడంలేదు. హితు డిగా, స్నేహితుడిగా పలకరిస్తూ ప్రోత్సాహంచూ పించేవాడు.

''నువ్వు సీనియర్‌వి. నీమీద వస్తున్న ఫిర్యా దులు బహుశా నీకు తెలిసేవుంటాయి. నేను స్నేహితుడిగా సాయంచేస్తాను. నా అసమర్థ తగా చాలామంది భావిస్తున్నారు. మనం పని చేస్తూ ఎందుకు మాటలు పడాలి అనవస రంగా...'' అని నాలుగైదుసార్లు చెప్పి చూసాడు రామారావు.

''మన కులాలువేరు. అందుకే నేను నీదగ్గ రపనిచేయను. చేసేవాళ్ళనికూడా చేయనివ్వ ను'' అని స్వగతంలో ఎన్నోసార్లు అనుకున్నా డు బీసెవెన్‌క్లర్కు.

ఇది రామారావుకి తలనొప్పిగా తయార యింది.

ఊరుకుంటుంటే మరీ నెత్తికెక్కసాగాడు బీ-సెవెన్‌క్లార్కు. ఆలస్యం మరింత ఆలస్యానికి తోవ ఏర్పరచింది. పన్నెండుగంటలకొచ్చిన ఆ క్లర్కుతో నవ్వుతూ అన్నాడు ఒకసారి రామారా వు-కాలికున్న డ్రెస్సింగు చూస్తూ ''డ్రెస్సరుకి ఎంత ఇచ్చావేమిటి?''

కోపం రాకపోతుందా?

''ఈ ఆఫీసులో చాలామంది డాక్టర్లకు డబ్బి చ్చి దొంగ సర్టిఫికెట్లు తెచ్చుకుని సెలవులు పెడుతుంటారు. కాని నేను అలాకాదు. నేను పనిచేయకపోయినా నిజం చెప్తాను. మా ఆవిడ బాత్‌రూములో పడితే, ఇంటిపనులు నేనే చేసు కోవాలి కాబట్టి సెలవుపెట్టాను. ఇక నాకాలికి దెబ్బఅంటారా... ఎవడో దొంగముండాకొడుకు స్కూటరు డాష్ ఇచ్చిపోయాడు. అంతేగాని అబద్ధపు డ్రెస్సింగుకాదు. కావాలంటే వూడ తీసి చూపిస్తాను... చూస్తారా'' అంటూ డ్రె స్సింగు విప్పబోయాడు తను.

''సరదాగా అన్నాను, అంత సీరియస్ అవ టందేనికి?''

''సరదాకైనా ఓ పరిమితి వుంటుంది. ఇటు వంటి అభిప్రాయం కలిగాక, నేనిక మీదగ్గర పనిచేయలేను. నన్ను బదిలీచేసే ప్రయత్నం చేయండి'' అన్నాడు బి-సెవెన్ క్లర్కు.

రామారావు మనస్సు చివుక్కుమంది.

"సారీ... ఏమీఅనుకోకు. ఏదో ఉండబట్టలేక, మనను కుదురులేక నోరుజారాను" అని అర్థింపు కోరాడు రామారావు.

నిజానికి బి-సెవెన్ క్లర్కు తలచుకుంటే చేయలేనిది ఏంలేదు. ఏ మంత్రిదగ్గరికైనా తిన్నగా వెళ్ళగలడు. పరపతి లేకుండా ఎలా గైనా రేషనుకార్డునుంచి, సిమెంటుబస్తాల వరకు తెప్పించగలడు. బ్లాకులో టిక్కెట్లమ్మే వారిని పోలీసులు పట్టుకుంటే-తాను పోలీను స్టేషనుకెళ్ళి కనిపిస్తేచాలు-వారికి విముక్తి లభి స్తుంది. పోలీసులు పట్టుకున్న బ్లూఫిలిముని సైతం ఫోనుకాల్సుద్వారా విడిపించగలడు. నిజానికి రామారావు కులం అంటే అతనికి పరమఅసహ్యం, కోపం. అయినా వ్యక్తిగతంగా అతన్ని గౌరవిస్తూ-పరోక్షంగా విమర్శిస్తూ వుంటాడు.

"పోనీ ఇంటికి ఫైల్సు తీనుకెళ్ళి పనిచేయ వచ్చుగా... ఆదివారం ఆఫీసుకొచ్చి రెండుమూ డుగంటలు చేసిపోవచ్చుకదా" రామారావు నాలుగైదుసార్లు మాటలమధ్యలో చెప్పాడు కూడా.

"చూడండి రామారావుగారూ...కొంపలో పనులు చేయవలసివస్తుందని, పెళ్ళాలు తిడుతుంటారని-తప్పించుకునేందుకు ఆఫీ సులకు సెలవురోజుల్లో అటెండవుతుంటారు. పెళ్ళాంతో కబుర్లుచెప్తూ, పిల్లలతో కబుర్లు చెప్తూ వుంటే కలిగే ఆనందం ఆఫీసుల్లో దొరుకు తుందా..." సదరు క్లర్కు జవాబు అది.

ఒక్క విషయంమాత్రం బి-సెవెన్ క్లర్కు గురించి చెప్పాలి. అతను చాలా సిన్సియరు. నిక్కచ్చిగా పనిచేస్తాడు. ఎప్పుడు మూడ్‌వ స్తుందో తనకే తెలియదు. అతన్ని కదిలిస్తే మనిషికాదు. గొప్పవాడినన్న అహంభావం, అతిశయం లేదు. ధనమదం అసలేలేదు. ఒక్కమాటలో ఆదోరకం మనిషి అని చెప్పాలి. అతను ఎవరికీ భయపడడు. ఎవరినీ లెక్కచే యడు. అతను భయపడేది కేవలం భార్యని చూసి. ఆమెకు డబ్బు, కోపం, అతిశయం, గర్వం పుష్కలంగా వున్నాయి. ప్రతి మనిషిని భయపెట్టేవారుంటారేమో...కనీసం పెళ్ళాం ఆ ఛార్జి తీసుకుంటుంది.

రామారావుకి అతన్ని వదులుకోవాలని లేదు.

కాని పైనుంచి అక్షింతలుపడుతూంటే ఎంతకని భరించగలడు ఎంతటివాడైనా...

సరిగ్గా ఆ సమయంలో బీ-సెవెన్‌క్లర్కుకి అమెరికా వెళ్ళే అవకాశం వచ్చింది. అప్పనప ల్లి వెళ్ళటం మానేస్తారుకాని అమెరికా ఎవరు మానతారు?

అప్పుడు రామారావు సెక్షన్లో చేరింది "అ రుణ"

అరుణ యిచ్చిన పోస్టింగార్డరు చూస్తూ కుర్చీ చూపించాడు. "కూర్చో" అని కళ్ళతోనే పలకరించాడు రామారావు.

ఆమె కుర్చీలో పొందికగా కూర్చుంది. ఆమె ముఖంలో ఉద్యోగంవచ్చిన సంతోషం ఏమీకని పించటంలేదు. ఏదో పోగొట్టుకున్న ఫీలింగు స్పష్టంగా కనిపిస్తోంది. రామారావు అటెండెన్స్ రిజిస్టరుతీసి అరుణ పేరు రాసి "సైనుచె య్యి" అన్నాడు.

"సైను" చేయడమంటే అర్థంకాలేదు.

అది గ్రహించిన రామారావు "నీపేరుని పొడిఅక్షరాలతో కలిపి సంతకంచేయడం" అన్నాడు.

ఆమెకు ఏంచేయాలో తెలియటంలేదు.

"పోనీ ముందు కాగితంమీద నేర్చుకొని, తరువాత అటెండెన్స్ రిజిస్టరులో చెయ్యి- ఫర వాలేదు"

అరుణ చటుక్కున ఏడ్చేసింది.

"ఎందుకమ్మా ఏడుస్తున్నావు... ఏమైంది?" అని అనడిగాడతను.

"ఏంలేదుసార్... ఏదో గుర్తుకొచ్చింది"

"ఫరవాలేదు చెప్పమ్మా... ఏం జరిగింది... నీకు తండ్రిలాటివాడిని... నాకు చెప్పు..." సౌమ్యంగా అడిగాడీసారి రామారావు.

'తండ్రి' అన్నమాట వినగానే అరుణకు మరోసారి దుఃఖం ఉబికింది. "నాకు తండ్రి లేదుసార్... నాన్న అని పిలిచి ఆరునెలల యింది... నేను దురదృష్టవంతురాలిని" అరుణ దీనంగా చెప్తోంది.

"ఏంటమ్మా నువ్వు చెబుతున్నది..." రామా రావుకు అర్థంకాలేదు.

"అవునండీ... నాన్న చనిపోయాడు.

ఆయన చేసే ఉద్యోగం నాకొచ్చింది... ఆయన బతికుంటే ఎంత సంతోషించేవారో..''

''పిచ్చిపిల్లా... మీనాన్న బతికుంటే ఈ ఉద్యోగం ఎలా వస్తుంది... వేరే ఉద్యోగం ఏదో రావాలిగాని. ఇంతకీ ఏం చదివావు?'' రామారావు ఆమెను ఓదారుస్తున్నాడు.

''ఇంటరు పాసయ్యేను... నాన్నగారు నాకు యం.యస్సీ దాకా చదువుచెప్పించాలనుకున్నారు''

''చూడు అరుణా... ఇది జీవితం. మనం ఎన్నో అనుకుంటాం కాని జరగవు. తన ఉనికిని గుర్తుచేసేందుకు దేవుడు మనకు పరీక్షలు పెడుతుంటాడు. వాటిని ధైర్యంతో ఎదుర్కునే ధైర్యం తక్కువమందికి ఉంటుంది. ఈ జీవితం అనే రైలుప్రయాణంలో రైలుని నడిపే డ్రైవరుకే సేఫ్టీలేదు. ఆఫ్టరాల్... ప్రయాణీకులమాట చెప్పాలా... కాని నిలకడమీదే అన్నీ ఒడ్డుకు చేరతాయి. కాలం ఇటువంటి ప్రశ్నలకు పరిష్కారం చూపిస్తుంది. నేనున్నంతవరకూ నీకు ఫరవాలేదు. చదువుకేముంది, ఎప్పుడైనా పూర్తిచేసుకోవచ్చు. ఇక ఈ పని అంటావా, నెమ్మదిగా చేయవచ్చు. ముందు నీ దుఃఖాన్నుంచి బయటపడేందుకు ప్రయత్నించు. ఇంతకీ ఎలాపోయారు మీ ఫాదర్? ఏవూరు మీది... నీకు అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు ఎందరు?'' రామారావు అడుగుతున్నాడు.

''నాకు ఒక అన్నయ్య... ఒక అక్క. మా అన్నయ్య అగ్రికల్చర్ డిపార్ట్‌మెంటులో ఉద్యోగం— అరకులోయలో. ఇక మా బావగారు కొత్తపేటలో బాంకులో పనిచేస్తున్నారు. మాది నగరం. అమ్మ ప్రస్తుతం అక్కడే తాతగారింట్లో ఉంటోంది'' అంటూ కళ్ళు తుడుచుకుంది అరుణ.

''ఇక్కడ ఎవరున్నారు?''

''ఉండడానికేం... బోలెడుమంది ఉన్నారు. కాని ఓపూట ఉంచుకుని భోజనంపెట్టేవాళ్ళు మాత్రం ఎవరూ లేరు. ఒక మేనమామ ఉన్నాడు కాని వాళ్ళింటికి వెళ్ళను''

''ఎందుకని?''

''ఎందుకేమిటి... నాకు ముగ్గురు మేనమామలున్నారు. నాన్నపోయినప్పుడు మాత్రం పదోరోజుకు వాళ్ళు వచ్చివెళ్ళారు. అత్తయ్యలు రానేలేదు. అప్పట్నుంచీ యింతవరకూ అత్తయ్యలువచ్చి చూసేందుకు తీరుబడిలేదట. ఉత్తరం సంగతి సరేసరి. బంధుత్వాలు, ఆప్యాయతలు మాటల్లోనేగాని చేతల్లో వుండవని మామయ్యలు నిరూపిస్తున్నారు. ఏం చేస్తున్నామో, ఎలావున్నామో వారికి అక్కర్లేదు సర్... ఎంత డబ్బుంటే ఎందుకుసార్... కష్టంలో ఆదుకోడం చేతకానప్పుడు— ఎందుకు బతకటం'' అరుణ ఆవేశంగా చెప్తోంది. రామారావు ఆమెనే చూస్తున్నాడు.

''మరి ఇప్పుడు ఎక్కణ్నుంచి వస్తున్నట్టు... ఎవరింట్లో వుంటావు?'' అడిగాడతను.

''ఉదయం గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో సామర్లకోటనుంచి వచ్చాను. మా బంధువుల అమ్మాయి స్టేషనుకువచ్చి రిసీవ్‌చేసుకుని ఇంటికి తీసుకెళ్ళింది. తనే ఆఫీసుకు తీసుకువచ్చి దిగబెట్టింది. రెండుమూడురోజులు వాళ్ళింట్లోనే వుండి, రూము దొరికాక మారిపోతాను'' అరుణ చెప్తోంది.

అంతలో కాఫీబోయ్ వచ్చి రెండు కాఫీలు పెట్టాడు.

''వాళ్ళింట్లోనే వుండచ్చుగా... రూము దొరకటం, ఒంటరిగావుండటం అంటే మాటలుకాదు.''

''నిజమేననుకోండి.. కాని మా ఫ్రెండువాళ్ళింట్లో చాలామంది ఉన్నారు. ముఖ్యంగా వాళ్ళ అత్తగారు, మావగారు ఉన్నారు. వాళ్ళు ఏమైనా అనుకోవచ్చు. రెండు మూడు రోజులు అయితే ఫరవాలేదు''

రామారావు ఆలోచిస్తున్నాడు. అరుణని తన యింటికి తీసుకెడితే అన్నపూర్ణ ఏమంటుందో...ఆమెకు తనే కిట్టదు. ఏదో అడిగినపుడల్లా డబ్బు ఇస్తున్నందుకు, ఏంచేసినా నోరు మూసుకుని ఉంటున్నందుకు, తన తిరుగుళ్ళకు చక్రం అడ్డువేయకపోవటం. వల్ల ఎలాగో బతుకు వెడుతోంది. తను ఏంచేసినా ఆమెకు నచ్చదు, పనికిరాదు. ఆమె తరపువాళ్ళు మాత్రం తరచురావటం, వెళ్ళటం- సత్రంగా తయారైంది ఇల్లు. అయినా ప్రయత్నించి చూస్తే ... తనకంత ధైర్యంవుందాని.

''చూద్దాంలే...ఏదో ఒకటి చేద్దాం. అంతగా

దొరక్కపోతే మాఇంట్లో ఉండచ్చు. నేను, మాఆవిడ, మాఅమ్మాయి మాత్రమే ఉంటున్నాం'' అన్నాడు రామారావు.

''థాంక్సు సార్.. ఈ మాత్రం అన్నారు...ఈరోజుల్లో మానవత్వం, మంచి ఇంకా మిగిలి ఉన్నాయంటే, అది మీలాటి సహృదయుల కారణంగానే''

''నువ్వు ఒకపని చేయాలి. మీ మావయ్య ఉన్నాడన్నావుగా. ఒకసారి వెళ్ళి కనిపిస్తే బాగుంటుంది. లేకపోతే ఆయన నెపాన్ని నీమీదే పెట్టచ్చు. ఒకసారి కనబడితే మాటల్లో తెలుస్తుంది'' అన్నాడు రామారావు సలహాగా.

''సారీ సర్... నేను వెళ్ళను. అమ్మ కూడా వెళ్ళద్దనే చెప్పింది. వెడితేనే వాళ్ళు బాధపడతారు. బెంగపెట్టుకుంటారు. మీరు ఏపని చెప్పినా చేస్తాను ఇది మాత్రం చేయలేను'' నిశ్చయంగా చెప్పిందామె.

''సరే...చూద్దాంలే...అదిగో ఆ కుర్చీ నీది. నువ్వు ముందు ఓసారి ఆ పేపర్లు, ఫైళ్ళు చూడు. నేనూ చెప్తాలే...'' రామారావు ఆమెను సీటు దగ్గరకు తీసుకు వెళ్ళాడు.

★ ★ ★

సాయంత్రం ఇంటికెళ్ళినప్పట్నుంచీ అరుణ గురించే ఆలోచించసాగాడు. జీవితం ఎంత చిత్రమైనది! మనుషులు విచిత్రంగా ఎలా మారిపోతున్నారు? అందుకు కారణం డబ్బా... అహంభావమా...పరిస్థితులా..మారుతున్న విలువలా... ఎంతకీ అతనికి పరిష్కారం దొరకలేదు. రామారావు ఆ రాత్రి నిద్రపోయేసరికి పదకొండు గంటలు దాటింది.

కామేశ్వరి చదువు విషయంలో మాత్రం ఏమయింది? తానెంత నచ్చచెప్పాడు! అన్నపూర్ణ వాటిని ఒక్కదెబ్బతో కొట్టిపారేయలేదూ...తాను భార్య మాటవినక ఏంచేయగలిగాడు?

అపుడు కామేశ్వరి ఏడోక్లాసు పాసయింది. ఆ స్కూల్లో అంతవరకే తరగతులున్నాయి. మరి ఎనిమిదో తరగతి ఎక్కడ చదవాలి- అనే సమస్య ఎదురయింది రామారావుకి. కాలికి బలపాలు కట్టుకుని స్కూళ్ళ చుట్టూ తిరిగాడతను- ప్రయోజనం లేకపోయింది.

''ఇంతవరకూ ప్రైవేటు స్కూల్లోనే చదివింది కదా...ఇంగ్లీషు బాగానే వచ్చిందిగా. కామేశ్వరిని ఇంక గవర్నమెంటు స్కూల్లో చేర్పిస్తే బాగుంటుంది. స్కూలు కూడా దగ్గరే. అక్కడ టీచర్లు బాగా చెప్తారని అంటున్నారు. కాలేజీ చదువుకి ప్రైవేటు కాలేజీలో చేర్పిస్తాను'' అన్నాడు రామారావు.

అన్నపూర్ణ విదిలించి కొట్టింది భర్త ప్రతిపాదనని- ''ఇటువంటి పిచ్చి ఆలోచనలు పెట్టుకోవద్దు. గవర్నమెంటు ఆఫీసులో మీరెంత పని చేస్తున్నారో నాకు తెలును. ఇక గవర్నమెంటు స్కూల్లో చదువు గురించి వేరే చెప్పాలా...డొనేషను కట్టకుండా చూడాలనా మీ ఉద్దేశం. డబ్బు లేకపోతే అప్పుచేయండి. అంతేగాని దాని చదువు గవర్నమెంటు స్కూల్లో సాగేందుకు వీలులేదు'' అంటూ.

అప్పట్నించి రామారావు వీధినపడి కనిపించిన ప్రతి స్కూలుకు వెళ్ళి ప్రయత్నించసాగాడు.

ఎనిమిదో తరగతికి ప్రవేశంకోసం రామారావుకి శ్రమ, ఆయాసం తోడయ్యాయి.

ముందుగా కామేశ్వరి చదివిన స్కూలుకే వెళ్ళి హెడ్మిస్ట్రెస్‌ని సలహా అడిగాడు రామారావు.

''ఓపికనిబట్టి స్కూళ్ళు ఉన్నాయి'' చెప్పిందావిడ.

ఓపిక అంటే వంట్లో ఓపిక కాదని, జేబు బరువు అని గ్రహించాడు అతను. ''దగ్గర్లో రెండు మూడు స్కూళ్ళున్నాయిగాని అక్కడ బెంచీలూ, బ్లాక్‌బోర్డులు లేకపోయినా రెండేసి వేలు డొనేషన్లు అడుగుతున్నారు'' అన్నాడు విచారంగా.

హెడ్‌మిస్ట్రెస్ పేపరు వెయిట్‌ని విలాసంగా తిప్పుతూ చెప్పింది ''ఈ రోజుల్లో పెళ్ళి చేసుకోటం పెద్ద శిక్ష, తప్పుగా తయారయింది. పిల్లల్ని కనటం నేరం. వారిని చేర్పించేందుకు స్కూళ్ళ చుట్టూ తిరగడం ఉరిశిక్షకంటే బాధాకరంగా తయారైంది. పిల్లలకు చదువులు, విజ్ఞానం బాగా రావాలంటే నిర్వాహకులు అడిగేది ఇవ్వటంకంటే మరో మార్గం లేదు'' గీతాసారం ఉపదేశించినట్టు చెప్పిందావిడ.

''ఉచితంగా ఎవరూ చేర్చుకోరా?''

''ఎందుకు చేర్చుకోరు? అటువంటి స్కూళ్ళ

ల్లో చదువులు చస్తే చెప్పరు. మేస్టర్ల యిళ్ళల్లో పనిపాటలు చేయవలసి వస్తుంది. ఊరగాయలు, పత్రికలు, టిఫెన్లు రెగ్యులరుగా సరఫరా చేస్తే పై క్లాసులకు గ్యారంటీగా పంపేస్తారు– ఫీజులు రివాజుగా తీసుకుంటూ''

''అసలు మీరే మీ విద్యార్థుల్ని పైస్కూళ్ళల్లో చేర్పించే బాధ్యత తీసుకోవాలి. తల్లిదండ్రులకు తీరుబడి వుండదుగా. పైగా ఆ మంచి చెడ్డలు మాకంటే మీకే బాగా తెలుస్తాయి. మీరంతా ఒకే ఫీల్డులో వున్నారు కాబట్టి'' అన్నాడు రామారావు.

''మా బాధలు, సమస్యలు మాకున్నాయి... ఇవన్నీ కుదిరేవి కావులెండి'' తప్పించుకొందావిడ.

''మీకు సొంత భవనం వుంది. డబ్బు, పలుకుబడి బాగానే వున్నాయి. కొత్త తరగతులు ప్రారంభించవచ్చుగా''.

''రామారావు సలహాకు హెడ్‌మిస్ట్రెస్ నవ్వింది. ఈ స్కూలు ప్రారంభించిన పదిహేనేళ్ళ కాలంలో – ఈ చదువు చెప్పే వ్యాపారంలో ఓ పది లక్షలు సంపాదించింది. ఏదో విధంగా ఫీజులు వసూలు చేస్తూ– పిల్లలకు చదువు వచ్చే విధంగా చేసేది. ఆవిడ భర్త దుబాయ్‌లో పనిచేస్తాడు. ఈ రెండు సంపాదనలు ఆవిడను ధనిక వర్గానికి ఎత్తాయి. రెండేళ్ళకోసారి అమెరికా వెళ్ళి మూడునెలలుండి కాలక్షేపం చేసేది. వేసవి సెలవులు రెండు నెలలు టీచర్లకు జీతాలు యివ్వదు. ఒక్కొక్క టీచర్‌కు నెలకు రెండు వందలు యిచ్చి గాడిద చాకిరీ చేయించుకుంటుంది. ఆఫ్ కోర్స్, ఈ ఫార్ములా నేడు చాలామంది ఫాలో అవుతున్నదే కావచ్చు.

నిజానికి ఆ స్కూలుకు ''ప్రభుత్వ గుర్తింపు'' లేదు.

''అది సంపాదించవచ్చుగా'' అని రామారావు చాలాసార్లు అడిగాడు, ఏం జవాబు చెప్తుందో అని.

''నేను డి.ఇ.ఒ. ఆఫీసు చుట్టూ తిరగలేను. ఆ గుమస్తాగాళ్ళని, ఆఫీసర్లను మేపి లంచాలు యివ్వలేను. ప్రస్తుతం నాకొచ్చే ఆదాయం చాలు'' అని తఫీమని చెప్తూందావిడ.

బుర్రగోక్కున్నాడు రామారావు.

హెడ్‌మిస్ట్రెస్ సలహా ప్రకారం ''గురుకులం విద్యాకేంద్రం'' వెళ్లాడు అతను.

''ఈ విద్యా సంస్థలో విరాళాలు స్వీకరించబడవు. కేవలం చదువు నేర్పేందుకు గాని, అమ్మేందుకు కాదు. దయచేసి విరాళాలు తీసుకోమని వత్తిడి చేయకండి'' అని స్కూలు ఆవరణలో పెద్ద బోర్డుమీద రాసి వుంది.

రామారావు ఆనందంగా చదువుకుని, లోపలకువెళ్ళి ప్రిన్సిపాల్‌ని కలిసాక, తన పని వివరించాడు.

''అయిదువేలు పారితోషకం ఇవ్వాలి'' అని జవాబిచ్చాడు ప్రిన్సిపాల్ తొణక్కుండా – నిర్లక్ష్యంగా.

''మరి బయట నోటీసుబోర్డులో ఏవో సూక్తులు...'' అంటూ చెప్పబోయాడు రామారావు.

ప్రిన్సిపాల్ వగలబడి నవ్వుతూ చెప్పాడు ''ఈ దేశంలో ఈ రోజుల్లో సిద్ధాంతాలు, నీతి సూత్రాలు ఎవరికి కావాలి... ఇది డైలాగుల యుగం... చెప్పేది చేయాలన్న నియమం లేదు. ఎందుకు చేయరు అని అడిగేదెవరు... ఎలా అడగ్గలరు? అలా రాస్తేగాని స్కూళ్లపట్ల క్రేజు, ఇమేజి పెరగవు. ఇదికేవలం ప్రచారంకు ఉపయోగపడే బాణం మాత్రమే. అయిదువేలు యిచ్చి సీటు పొందండి. మా టైము వేస్టు చేయకండి''.

''ఇవ్వకపోతే?''

మరోసారి మందహాసం చేస్తూ చెప్పాడాయన '' ఈ స్కూలు కోసం కంట్రాక్టర్లు, ఇంజనీర్లు, డాక్టర్లు, లాయర్లు, మంత్రులు, నాయకులు, అధికారులు వచ్చిపోతుంటారు. బేరాలాడేందుకు యిది కూరల మార్కెట్టు కాదు''.

రామారావు బయటకొచ్చేసరికి ఓ టీచరు బోర్డుమీద మరోసూక్తి రాస్తోంది ''న్యాయాన్ని ధర్మాన్ని నీతిని, నిజాయితీని రక్షించి కాపాడండి. అవే మనిషికి పెట్టని భూషణాలు''.

అది చదివాక నడవాలనిపించలేదు ముందుకు. ఇటువంటి నీతిసూత్రాలని తాకట్టుపెట్టి చాటుగా భాగోతం ఆడేవారికి ఏ శిక్ష విధించినా తప్పులేదేమో... అయితే శిక్ష విధించబడినా – బయటకు వచ్చేవారు కూడా

ఎందరో...

అవినీతి అంటువ్యాధిగా పెరుగుతోంది.

కేన్సరు కంటే వికృతంగా తయారయింది.

ఎన్నో భయంకరమైన వ్యాధులకు చికిత్స చేసేందుకు వైద్యులున్నారు. కాని ఈ అవినీతిని అంతం చేసేందుకు ఏ మనిషీ కృషి చేయటం లేదేమో... రోజులు యింత అధ్వాన్నంగా తయారవటానికి సమాజంలో అందరూ తమ వంతు బాధ్యతను విస్మరిస్తున్నారేమోనని సందేహం కలగక మానదు. స్వార్థ, స్వప్రయోజనాలే మనుమల్లో ఊపిరి పోస్తున్నాయా? డబ్బుకి విలువ పెరిగి మనుమల్లో తరిగిపోతున్నాయా... ప్లాట్‌ఫారాలమీద సందేశాలేగాని వేదిక దిగిపోయేక "ఏదీ డబ్బు... ఎక్కడ దాచాలి" అనే ఆరాటమే... డబ్బుకి విశ్వరూపాలెన్నో...

మరో స్కూలు ప్రధానోపాధ్యాయుడు యిలా సెలవిచ్చాడు. "మా ధ్యేయం చదువుల సరస్వతిని ఆరాధించటం. మా సంస్థలో విద్య వ్యాపారం కాలేదు. అతి తక్కువగా అంటే, ఓ వెయ్యి రూపాయలు మాత్రం విరాళంగా స్వీకరించదలచాము. ప్రభుత్వ ఉత్తరువుల ప్రకారం సిబ్బందికి జీతాలు చెల్లించే ఆదర్శ సంస్థ మాది. ఏడాది పొడుగునా డబ్బుకు రకరకాల నామకరణం చేసి డబ్బు సంపాదించటం మాకు నచ్చదు. మీ సంతోషం కొద్దీ మా స్కూలుకు బల్లలు, టేబుళ్ళు, ఫ్యానులు, ట్యూబులైట్లు, రేడియోలు, వీడియోలు సమర్పిస్తే నిరాకరించడం మాకు చేతకాదు".

"అయితే మీరు ప్రవేశపరీక్ష పెడతారా?" అనుమానంగా అడిగాడు రామారావు.

"ప్రవేశపరీక్షలు బోగస్ భాగోతం. ఎటూడబ్బుతీసుకుంటున్నప్పుడు ఆ పరీక్ష దేనికి? డబ్బుకోసం ఓ ఫాల్సుదండకం తయారుచేసి, ఇంటర్‌వ్యూలుపెట్టి అంచెలంచెలుగా డబ్బు గుంజడం ఫార్సు కాదా..."

"ఏదో-ఉద్యోగం చేస్తూ జీతంమీదే బతికేవాడిని. నాకు ఉచితంగా సీటు యిప్పించండి" అర్థించాడు రామారావు.

"ఉచితం అనేపదానికి అర్థం లేదు. ఫ్రీగా చేర్చుకుంటున్నారని తెలిస్తే మాకే చిన్నతనం. మీలాటి వాళ్ళుయివ్వబట్టే విరాళాలు శతావతారాలు ఎత్తుతున్నాయి. మీకు తోచింది యివ్వండి, చాలు" అంటూ జవాబిచ్చాడు ప్రధానోపాధ్యాయుడు.

రామారావు అక్కడ్నుంచి మరోస్కూలుకు బయలుదేరాడు.

అసలు ఈ నిర్వాహకులు సీట్లకొచ్చేవారి ముఖాలు యిట్టే పసికడతారేమో...అందుకే రామారావుని చూడగానే యిలా అన్నాడు. "నెలకు మూడొందలు చొప్పున పదినెలలు సంభావన యివ్వండి, చాలు" సదరు ప్రిన్సిపాల్.

"అంటే వాయిదాల్లో డొనేషన్ సౌకర్యం కలిగిస్తున్నారన్న మాట" అనుమానం కలిగింది రామారావుకి. ఎందుకిలా వివిధపేర్లతో దోపిడీ చేస్తున్నట్లు?

ప్రిన్సిపాల్ వివరంగా చెప్పాడు"ఈరోజుల్లో సందుకో స్కూలు, వీధికో డాక్టరు, మనిషికో రాజకీయం, ఊరికో పార్టీ, గంటకో హత్యా రివాజుగా తయారయ్యేయి. ఇంగ్లీమభాషలోని ఏ రెండు మూడు అక్షరాలు కలిపో ఒకపేరు పెడితే తల్లిదండ్రులు, విద్యార్థులు క్యూలో నిలబడతారు-సీట్లకోసం. ఇంగ్లీమబళ్ళో చదివించటం క్రేజు. డొనేషను యివ్వటం నాగరికత. అడగకుండా ముందుకు రావటం వ్యామోహం..."అంటూ.

రామారావు మరికొన్ని స్కూళ్ళు తిరిగాడు. మీరు ఆఫీసునుంచి ఎప్పుడు వస్తారు...ఇంటికొచ్చేక ఏం చేస్తారు...సొంతయిల్లా అద్దెయిల్లా...మీ శ్రీమతి ఎంతవరకు చదివారు...పిల్లలకు ఎన్నిగంటలు శిక్షణ యివ్వగలరు...వంటి ప్రశ్నలు అడిగినవాళ్ళు ఉన్నారు.

ఎక్కడచూసినా డబ్బే...ఎనభైశాతం వచ్చిన విద్యార్థికి యిన్ని తిప్పలుంటే విద్యారంగం ఎప్పుడు బాగుపడుతుంది!

రామారావు యిదంతా అన్నపూర్ణకు పూసగుచ్చినట్లు చెప్తే నిర్లక్ష్యంగా జవాబిచ్చింది "మీకు మాట్లాడ్డంరాదు. ఎలా చదివారు...ఉద్యోగం ఎవరిచ్చారు...ఆఫీసులో పని ఎలా చేస్తున్నారు...స్కూల్లో సీటు సంపాదించడం చేతకానివారు మీరు...సీటు సంపాదించటంకంటే సీటుకొనుక్కోవటంలోనే థ్రిల్లుంది"

నిర్లక్ష్యం, అశ్రద్ధ, సోమరితనం, బద్దకం పెంచుకుంటూ డబ్బు వెదజల్లుతూ తేలిగ్గా పనులు చేయించుకోటం నేర్చుకున్నారు చాలా మంది. చదువులకు ప్రైవేటు విద్యాసంస్థలు కావాలి. కాని ఆ తర్వాత ప్రభుత్వ ఉద్యోగాలే కావాలి. ప్రైవేటు ఉద్యోగాల్లోనయితే పనిచేయాలి. ఏ పిచ్చివేషాలూ అక్కడ కుదరవు. అల్లర్లు, సమ్మెలు అంత తేలిక కాదు. ప్రభుత్వాఫీసుల్లో ఎవరూ పనిచేయకపోయినా అదే నడుస్తుంది.ఏ ఆఫీసరునో, నాయకుడినో ఆశ్రయిస్తే కాలక్షేపం చేసేయవచ్చు. బద్ధకస్తులు, సోమరులు ప్రభుత్వాఫీసుల్లో దత్తులు. శాసనాలు చేసినంత మాత్రాన ఏం జరుగుతోంది? ఎందరిలో చిత్తశుద్ధివుంటోంది? పలుకుబడి, సిఫారసు, ఒత్తిడులు రాజ్యమేలేంతవరకూ ఈ రామాయణం కొనసాగుతుండవలసిందేనా...

చివరికి మూడువేలు యిచ్చి కామేశ్వరిని ఓ ఇంగ్లీషు స్కూల్లోనే చేర్పించాడు రామారావు.

అప్పుడు అన్నపూర్ణ ముఖం చూడాలి...ట్యూబులైటుకంటే ప్రకాశంగా, పున్నమి చంద్రుడికంటే కాంతిగా, నడివేసవిలోని సూర్యుడి ప్రతాపంలా వుంది.

కాని రామారావు మాత్రం పెద్దషాక్‌లో పడిపోయి, చేసిన అప్పులు ఎలా తీర్చాలా అని బెంగపెట్టేసుకున్నాడు.

మరుసటి ఏడాది పెద్దకూతురి వివాహం అనుకోకుండా హటాత్తుగా చేసేశాడు. అదోపెద్ద దెబ్బ. ఎవరిద్వారానో ఓ సంబంధం వచ్చింది. అది అన్నపూర్ణ తరపున వచ్చింది. కుర్రాడు బాంకులో ఉద్యోగం, అతని వాటాకు రెండెకరాల పొలం వస్తుంది. కుర్రాడు బాగుంటాడు. మంచివాడు. చెడు అలవాట్లు లేవు. ఈ రోజుల్లో, ఈ నవీన సాంప్రదాయ సమాజంలో అలాంటి ఈ కుర్రాడు దొరకడం నిజంగా గొప్పే. తల్లిదండ్రులనే మస్కాకొట్టి, చాటుగా గర్ల్‌ఫ్రెండ్సుని వెంటేసుకుని సినిమాలు, షికార్లు కొట్టే ఆధునిక యువకులకు అతీతుడు. చదువు, ఇల్లు, తల్లి-తండ్రి తప్ప మరో ప్రపంచం తెలీని కుర్రాడు. అమ్మాయిని పువ్వుల్లో పెట్టి పూజించకపోయినా నోరెట్టుకుని అరవడు. చేతులతో కొట్టడు. అంతకన్న ఏం కావాలి?

"నీకు నచ్చాడు...అమ్మాయికి నచ్చాడు. ఆడవాళ్ళకి నచ్చేడంటే గొప్ప విశేషం. ఏ మాత్రం కావాలంటున్నాడు" భార్య చెప్పినదంతా విని అడిగాడు రామారావు.

"వాళ్ళు నలభైవేలు అడుగుతున్నారు. ఆమాత్రమైనా యివ్వకపోతే ఏం బాగుంటుంది. అబ్బాయి ఉద్యోగం చూసి ఎగరేసుకుని పోతున్నరోజులు. అతనికో చెల్లెలుంది. ఆమె పెళ్లిచేసేందుకు ముందు ఈ కుర్రాడి పెళ్లిచేస్తున్నారుట."

"దానికీ దీనికీ ఏమిటి సంబంధం?" అమాయకంగా అడిగాడతను.

"ఏం మొగుడండీ మీరు. ఓ ఆడపిల్ల పెళ్లిచేయాలంటే ముందు కొడుకుపెళ్లి చేయాలి. ఆకట్నంతో అమ్మాయిపెళ్ళి చేయాలి. ఇంకా మిగిలిన డబ్బుతో చిల్లరమల్లర అప్పులు తీర్చుకోవద్దూ"

"నాకు తెలియదులే... మరి లాంఛనాలు ఏమైనా యివ్వాలా?"

"దానికేముంది... అబ్బాయికి లేని చెడుఅలవాట్లకు అదనంగా ఓ అయిదారు వేలు యిస్తే లాంఛనాల కింద సరిపెట్టుకుంటారు...

"ఇంతకి పెళ్ళి గుళ్లోనా... రిజిష్ట్రార్ ఆఫీసులోనా?"

"ఏడ్చినట్లుంది తెలివి. ఇది కుర్చీలు—టేబుళ్లు చేసే ప్రేమపెళ్లా రిజిష్ట్రార్ ఆఫీసులో చేసుకోడానికి. ఇంక ఖర్చు తగ్గించుకొనేందుకు గుళ్లల్లో చేస్తారు" అన్నపూర్ణ అంది.

"అయితే మనం ఎక్కడచేస్తే బాగుంటుంది?"

"కమ్యూనిటీ హాల్లో చేస్తాం"

"మరి యీడబ్బంతా ఏ బ్యాంకునుంచి దొంగిలిద్దాం"

అన్నపూర్ణకు కోపంవచ్చింది? "పెళ్లిచేసేవాళ్లు దొంగతనాలు చేస్తున్నారా... ఎల్లాగో చేయాలి"

"అదే... ఏమిటి చేయటం అని నాప్రశ్న"

"పొలం అమ్మేయండి. ఆరైతు శిస్తు పంట యిచ్చిచావటంలేదుగా... వాడికే అమ్మేస్తేసరి. ఆ డబ్బెట్టి పెళ్ళిచేద్దాం"

అదిరిపడ్డాడు రామారావు. "ఇప్పుడు ఆపొలం అమ్మి, యింతకట్నం యిచ్చి పెళ్లిచే

యకపోతేం... ఒకటి రెండేళ్ళ తరువాత చేద్దాం'' అన్నాడు.

''ఇప్పుడు లేనిది అప్పుడు ఎక్కడనుంచి వస్తుంది. అప్పుడైనా పొలం అమ్మవలసిందే కదా? లేదా మీకు కలెక్టరుగా ప్రమోషను వస్తుందా... లేకపోతే మా నాన్న డబ్బుపాత్రలు యిస్తాడనా....'' వెటకారం చేసిందామె.

అన్నపూర్ణని కదిపితే అత్తింటిని వేళ్లతోసహా పెకలిస్తుంది. అప్పుడు ఆ వ్యవహారం ఎక్కడ తేలుతుందో!

''కట్నం తగ్గుతుందేమో అడిగి చూద్దాం'' అన్నాడతను.

''మీకు వ్యవహారం చేతకాకపోతే నోరుమూసుకుని కూర్చోండి. ఇది ఆఫీసుకాదు– కాగితాలు ఏళ్లతరబడి పేరపెట్టడానికి. అవకాశాన్ని వదులుకోకూడదు. డబ్బుకి మొహంచూసుకోకూడదు. మాట్లాడకుండా పొలం అమ్మేసి, ఆడబ్బుతో పెళ్ళి చేద్దాం'' ఆర్డరు జారీచేసింది అన్నపూర్ణ.

ఆ ఆర్డరు అమలుపరచటంకంటే మరేం చేయలేకపోయాడు ఆ మానవుడు.

గుమ్మందగ్గర ఓ బిచ్చగాడు నిలబడి అరుస్తున్నాడు. జేబులోనుంచి పదిపైసలు తీసియిచ్చాడు. వాడు ఆనందంగా వెళ్ళిపోయాడు. అప్పుడు అన్నపూర్ణ భర్త దగ్గరకొచ్చి అడిగింది? ''వాడికి డబ్బులిచ్చారా...'' అని.

''ఇచ్చాను... పదిపైసలు''

''వాడు దొంగపీనుగ... ఏమీ యివ్వకపోతే తిడుతూపోతాడు. అందుకే నేను ఆవెధవకు యివ్వను.''

''పోనీలే... పదిపైసల్లో ఏంపోయింది''

''రోజుకి ఎంతోమంది వస్తూపోతుంటారు, అందరికీ యిస్తూ కూర్చుంటామా– పనులు మానుకుని''

''నోటితో లేదనేకంటే పదిపైసలు యిద్దరికి సరిపెడితే సరి... వాళ్లతిట్లు, శాపనార్థాలు తప్పుతాయి.''

అన్నపూర్ణ ఆమాటకోసమే ఎదురుచూస్తోంది'' పెళ్ళివిషయంలో కూడా మీరింత ఔదార్యం చూపించకూడదూ. వాళ్ళు అడిగిన కట్నం యిచ్చేస్తే మనపిల్ల సుఖపడుతుంది. అల్లుడు మనం చెప్పినట్లు వింటాడు?'' చెప్తోందామె.

''చివరికి వరుళ్లని బిచ్చగాళ్లతో పోలుస్తున్నావన్నమాట. ఎంత చులకనగా మాట్లాడుతున్నావ్...''

''వరుళ్ళు బిచ్చగాళ్లుకాక మరేమిటి... ఎటొచ్చీ వీళ్లు చదువుకొని సంస్కారంతో బిచ్చం అడుగుతున్నారు– కట్నాన్ని. వాళ్ళు గతిలేక, పొట్టకోసం యాచిస్తున్నారు? ఎటొచ్చీ రోడ్డు... ఇల్లు, అంతే తేడా. మీ ఉద్యోగులుమాత్రం బిచ్చగాళ్ళుకాదూ. జీతాలు, డి.ఎ, బోనస్సుల కోసం ప్రభుత్వాన్ని హైక్లాసుగా యాచిస్తూ వీధుల్లో అరవటంలేదూ. ఆమాటకొస్తే నాయకులు ఓట్లకోసం...

అడగందే అమ్మఅయినా ఊరికే పెట్టదన్న సామెత వినలేదా అయినా యిచ్చేవాడి చెయ్యి పైనున్నంతకాలం కిందవున్న చెయ్యి మనం చెప్పినట్లు వింటుంది. ఇది తెలుసుకునే కట్నాలుపోసి వరుళ్లని తేలిగ్గా కొనుక్కుంటున్నారు. ఆడపిల్లల్ని కన్నవాళ్లు. ఆమాటకొస్తే మీరు మాత్రం వెయ్యినూట పదహార్లు కట్నంగా తీనుకోలేదూ..! అన్నపూర్ణ పంచాంగం పఠిస్తోంది.

''నేను మీనాన్నని కట్నంయిమ్మని అడగలేదు. ఆమాటకొస్తే మావాళ్లు కూడా యింతయిమ్మని, యిస్తేగాని వీల్లేదని అనలేదు. మీనాన్న పెద్దగ్రంథకర్త. రాజకీయం నడిపి చక్రంతిప్పాడు. బహుశా పొగాకుకాడలు నమిలే ప్రబుద్ధులకు యీ ఫీల్డులో బాగా నైపుణ్యం వుంటుందేమో. చివరికి ఆడబ్బుచేతిలో పెట్టకుండా నీకు వంటసామానుల కింద అప్పచెప్పాడు. ఊళ్లోవారికి అయిదువేలు యిచ్చినట్లుగా చెప్పుకుంటాడాయన. ఇదేనా ఆ పెద్దమనిషి చేయవలసింది... ఎప్పటికప్పుడు అడగాలనుకుంటాను. కాని, అయిపోయినదాన్ని తవ్వుకోడం ఎందుకు అని వూరుకుంటున్నాను ఛీ.ఛీ'' రామారావు భరించలేకపోతున్నాడు భార్య ధోరణిని.

''మధ్యలో ఆగొడవ యిప్పుడెందుకు'' పుట్టింటివాళ్లు ఏం చేసినా అది గొప్పగా వుంటుంది కాబోలు? అందుకే అన్నపూర్ణ అలా అంది.

రామారావు ఆసంభాషణని పెంచదలచుకోలేదు.

ఓ రెండురోజులు సెలవుపెట్టి వూరికెళ్లి పొలం బేరంపెట్టి వదుల్చుకున్నాడు. ఎనభైవే లు వస్తుందనుకున్నది, అరవైఅయిదు వేలు వచ్చేసరికి గగనమై పోయింది. మొత్తానికి ఆ శ్లేష్మం నుంచి బయటపడినందుకు సంతో షించాడు.



పొలండబ్బు పూర్తిగా పెళ్లికే ఉపయోగించా డు రామారావు. అన్నపూర్ణ, కూతుర్ని కాపురాని కి పంపేటప్పుడు మరో ప్రతిపాదన చేసింది "అమ్మాయికి సారెగా యివ్వాల్సిన సామానులని మిత్తం ఓ అయిదువేలు యిద్దాం" అని.

అప్పుడు రామారావు ప్రావిడెంటుఫండు నుంచి అప్పు తీసుకుని, పెద్దబీరువా... గాను పొయ్యి... డబుల్‌కాట్ మంచాలు... కుక్కరు... సీలింగుఫాను కొని యిచ్చాడు.

అన్నపూర్ణకు అది తృప్తికలిగిస్తే రామారావు కి చెప్పలేని అధైర్యం, బెంగ కలిగింది. ఇక కామేశ్వరిని పంపేందుకు తనవద్ద అమ్మేందుకు ఏం మిగిలిందని?

కొన్ని యిళ్లు చూస్తే ముచ్చటగా వుంటాయి. ఎన్ని సామానులున్నా కనిపించవు. ఎంతో విశాలంగా కనిపిస్తాయి గదులు. ఇది ఆ యింటి యిల్లాలు నేర్పో, సర్దుబాటులోని ప్రత్యే కతో తెలియదు. ఇల్లు చూసి యిల్లాలుని చూడమన్నది యిందుకే కాబోలు.

రామారావు పది నిమిషాల క్రితం ఆఫీసు నుంచి వచ్చాడు. అతనిలో అలసట, బడలిక ఇంకా తగ్గలేదు. రిలాక్సింగ్ కోసం కాసేపు మంచంమీద పడుకోవడం అలవాటు. మంచా నికి ఎదురుగా అలమారా వుంది. దానికి నాలుగు ర్యాక్‌లు ఉన్నాయి. అలమారాకు పైభాగంలో "పెద్ద అటక" వుంది. దానిమీద చెత్తా చెదారంతో పాటు ఖాళీ హార్లిక్సు, బూస్టు, మాల్టోవా సీసాలు పాతికపైనే వుంటాయి. మరో పదిసీసాల్ని ఆ మధ్య అటక మీద స్థిర నివాసంగా వున్న ఎలకలు పగలకొ ట్టాయి- కిందకు పడేసి. అప్పుడు అన్నపూర్ణకి కోపం వచ్చింది.

"మీకు లక్షసార్లు చెప్పాను. ఆ ఎలకలకు మందు పెట్టి చంపండి అని. వాటిగోలతో రాత్రిళ్లు నిద్రపట్టటంలేదు. పప్పుల డబ్బాల మూతలు కూడా తీసేసి తినేస్తున్నాయి. మీది కుంభకర్ణ నిద్ర. మెలుకువ రాదు. ఓసారి అటకెక్కి చూడండి, ఎన్ని సబ్బు ముక్కలు న్నాయో..." కనీసం వారానికి ఏడెనిమిదిసార్లు ఆ విధంగా అనటం అలవాటు ఆమెకు.

"నేను జీవహింస చేయను. నేను గాంధేయ వాదిని. ఎలకలకు మందుపెడితే, అవి ఆ మూతులతో డబ్బాలు తెరిచి పప్పులు తిన్నా యనుకో, ఆ పప్పులు వుపయోగించే మనం ముందు టపా కట్టేస్తాం" అని చెప్తుంటాడు రామారావు.

"మీరు యిలాగే చూస్తూ కూర్చోండి. ఎప్పు డో మనల్ని కూడా తినేస్తాయి. ఆ ఎలకలమీద మీకింత జాలి, దయ వుంటే పక్కలో పడుకోపె ట్టుకోండి. జీవహింస, భూతదయ ఏమిటీ కా లంలో కూడా... ఇంకా నయం, ఏ కళనున్నారో, దోమలకు మందుతెచ్చి, స్ప్రే చేశారు. లేకపోతే **అవే** కుట్టి చంపేవి" అంటూ పురాణంలోకి వెళ్లి మరో అధ్యాయాన్ని వల్లించడం కూడా ఆమెకు అలవాటే.

"కొంపలో నువ్వు ఏంచేస్తున్నట్లు... వాళ్ల కొంపలకీ వీళ్లకొంపలకి తిరిగి సొల్లు కబుర్లు చెప్పకతపోతే ఏం? కడుపు నిండేనా కాలు నిండేనా! ఆడబ్బాలు, సీసాలు అమ్మేయ చ్చుగా అటక ఖాళీగానైనా వుంటుంది" అని చెప్పటం రామారావుకి మామూలే.

"ఇది నలభై రెండోసారి యిలా చెప్పటం. వాటిని అటక మీదనుంచి కింద తగలేస్తే, ఎవడికైనా పిలిచి అమ్మేస్తాను. మీరు చేస్తారని, పట్టించుకుంటారని నేననుకుంటున్నాను.మీకు ఆఫీసు తప్ప మరో ఆలోచన వుండదు. సెలవు రోజుల్లో ఆ డొక్కు సైకిలు మీద తిరగడం బలాదూరుగా... అందరూ యిలాగే వుంటు

న్నారా.. మీరు ఎవరికో చేయటం లేదు. మీ యింటిని దిద్దుకుంటున్నారు. ఆ ఎదురింటా యన్ని పక్కింటాయన్ని చూడండి, పెళ్లాలు కష్టపడిపోతారని సెలవు రోజుల్లోనే కాదు మిగి లిన రోజుల్లో కూడా బియ్యం ఏరుతూనో, యిల్లు తుడుస్తునో, బట్టలుతుకుతూనో, పక్కబట్టలు ఎండలో ఆరేస్తూనో వుంటారు. మీరు పూచికపు ల్లకూడా తీసి బయట పారేయరు" అన్నపూర్ణ నోటినుంచి పేలే మరో డైలాగు అది.

"ననవసరంగా రెచ్చగొట్టకు. నేను యిటు వంటి పనులు చేయను. నువ్వు చెప్పే మొగు ళ్లు ఆడంగి మొగుళ్లు. మూతిమీద మీసం వుండి, పాంటు-షర్టు వేసుకున్న వాడుకూడా మగాడంటే నేనొప్పుకోను. అటు ఆఫీసులోనూ పనిచేయక యిటు పెళ్లాన్ని రసికతతో మురి పించలేనివాళ్లు చేసే పనులు-నువ్వు చెప్పేవా ళ్లు. ఆ ముండాకొడుకులు పెళ్లిచూపులు అంటూ పదేపదే కాఫీ టిఫిన్లు కొట్టేసి అంది నంతవరకూ కట్నాలు రాబట్టుకొని పెళ్లాడిన జాతిగాళ్లు. మరినేనో, చెప్పక్కర్లేదు. పుట్టింటి కి పంపి అది తీసుకురా, యిది తీసుకురా అని నేను ఎప్పుడూ అనలేదే... నువ్వే మీవాళ్లు పిలవక పోయినా పోతుంటావు. అక్కడికెళ్లినా ఖర్చుకూడా నాదే. పళ్లు తోముకోడానికి పేస్టు, తలకు రాసుకునేందుకు కొబ్బరినూనె, యిక స్నానానికి బట్టలకు సబ్బులు తీసుకుపోతావు. ఇంకా నయం, అక్కడే తిండి ఖర్చు కూడా నన్నివ్వమనలేదు. ఈ మాత్రం దానికి అక్కడికే వెళ్లి రైళ్లు, బస్సులు, రిక్షాలు, బళ్లు పోషించడం దేనికి! అయినా ఏటా పుట్టింటికి పోయే ఆడదాన్ని ఎక్కడా చూడలేదు. నీకు మొగుడు, పిల్లలు, యిల్లు అవసరంలేదు. హాయిగా ఏ ఏటిగట్టు వాడినో పెళ్లి చేసుకుంటే, దారి ఖర్చులు తప్పేవి. ఎందుకు పెళ్లి చేసు కుంటారో".

"మీకు ఆ డైలాగు తప్ప మరో డైలాగు చె ప్పటం రాదా... ఎంతసేపూ మావాళ్ళని దె ప్పటం తప్ప మరొకటి చేతకాదు. ఏం మనిషో..."

"నీకూ ఆ డైలాగు తప్పితే మరొకటి రాదు. ఎస్సెల్సీ పాసయ్యావన్నాడు మీనాన్న. కాని నీకు అక్షరాలు రావు. ఏదో మీ నాన్న టీచరుకా బట్టి పైక్లాసులకు తోసేసారు..."

"ఇంతకీ అటక ఎక్కి తీస్తున్నట్లా లేదా..."

"నువ్వే ఎక్కి తీసుకో"

"నేను ఎక్కటం ఏమిటండీ... ఎవరైనా చూ స్తే నవ్వుతారు. మీరైతే యిట్టే ఎక్కి తీస్తారు. అది సులువా నేను చేయటం సులువా" అన్నపూర్ణ కూడా అదే జోరులో చెప్తోంది.

"నీ బొంద. ఎవరైనా చూస్తుండగా ఎక్కుతా రేమిటి... అయినా ప్రతిదీ యిలా అరటిపండు వలచి నోటిలోపెట్టినట్లు చెప్పాలా... బుర్ర ఉప యోగించడం రాదు, అసలుంటేకదా"

ఆలోచనలకు అంతరాయంగా, కామేశ్వరి వచ్చి తల్లి కొన్న స్టీలు డబ్బాలు తండ్రికి చూపించింది.

రామారావు వాటివైపు చికాకుగా చూసి అన్నాడు, "ఎంతసేపూ ఇనపముక్కలు, చీర లు కొన్నవి చూపించడం తప్ప మొగుడి పీనుగకి మంచినీళ్ళు, కాఫీ యివ్వటం లేదు. ఇరవై ఏళ్ళనుంచి నీతో కాపురంచేయడం నాకే ఆశ్చర్యంగా వుంది"

కామేశ్వరి డబ్బాలు మంచంమీద పెట్టి వంటింట్లోకి వెళ్ళింది. "నీకు మీ నాన్నచేత నన్ను తిట్టించడం సరదా. ఇప్పుడెందుకు చూపించావు" అంటూ మంచినీళ్ళగ్లాసు కూతురికి అందించింది అన్నపూర్ణ.

"అవసరం లేదు... కాఫీ తీసుకురా" అన్నా డు రామారావు.

అన్నపూర్ణ కాఫీ తెచ్చింది "మీకు యింటికి రాగానే కోపం వస్తుందా... బయట ఏం వెలగబె డుతున్నారో" అంటూ.

"కోపం కాకపోతే ఏమిటి, ప్రతి ఇనపముక్కా కొనటమే... నీలాంటి ఆడవాళ్ళుండబట్టే వ్యా పారాన్ని మూడు లక్షలు ఆరుకోట్లుగా చేసు కుంటున్నారు వ్యాపారులు" అంటూ కాఫీగ్లా సు అందుకున్నాడు రామారావు.

"కొంపలోకి అవసరమైనవి కొనటం తప్పా"

"నీబొంద. ఈ కొంపలోవున్న సామాన్లతో ఓ దుకాణం తెరవచ్చు. పదిమంది ఆడపిల్లలకు పెళ్ళిచేసి వారికి సారెగా యివ్వచ్చు. పెట్టుకోడా నికి చోటులేదు. షాపులో వుండే బదులు యింటికి చేర్చటమే- ఏదో కారణంతో"

"ఇంతకీ ఎలావున్నాయి డబ్బాలు... ఏమా త్రం రేటువుంటాయి?" అన్నపూర్ణ బుజ్జ

గింపుగా అడిగింది.

''ఇంతకీ హైకమాండువారు ఏం నిర్ణయించారు'' శారు... నాతో నీకు ప్రమేయంలేదుగా... ఒక వేళ చెప్పినా పట్టించుకోటం అసలే లేదు. వినేవారికి చెప్పినా అందం చందం'' అంటూ కాఫీగ్లాసు భార్యచేతికందించాడు అతను.

''ఈవేళ పాతపేపర్లు, డబ్బాలు అమ్మేశాను'' అంది అన్నపూర్ణ స్టీలు డబ్బాలకేసి చూస్తూ.

''డబ్బుకి బదులు ఈ డబ్బాలు తీసుకున్నావా... నీకు ప్రభుత్వం సన్మానంచేసి 'స్టీలుశ్రీ' బిరుదివ్వాలి'' రామారావు వెటకారంగా అన్నాడు.

కామేశ్వరి తల్లికేసి చూస్తూ ఏదో చెప్పబోయింది.

''ఇంతకీ వీటి ధర చెప్పలేదు'' మరోసారి అడిగింది అన్నపూర్ణ.

''పదిహేను యిరవై రూపాయలుండచ్చు ఒక్కొక్కటి'' అన్నాడతను.

''మిమ్మల్ని చూస్తే ఊరికినే తీసుకెళ్ళమంటారు. అసలు మీకు ధరలు, నాణ్యం తెలిస్తేగా... అయినా మిమ్మల్ని అడగటం నాదే తప్పు'' చిరుకోపంగా అంది తను.

''ఒక్కటి మాత్రం నిజం. ఏ వ్యాపారస్తుడైనా ఉచితంగా, ఏదీ చవగ్గా యివ్వడు. అందులో ఆడవాళ్ళ బేరం మహాగొప్పగా వుంటుంది. వాడు పదిరూపాయలు చెప్తే ఓ పదిపైసలు తగ్గించి అడుగుతారు. మీ వాలకం పసికట్టి మాటవరసకి 'కిట్టదు' అని ఓ డైలాగు పారేసి కొంచెంసేపాగి, 'ఇంకేంకావాలి' అని అడుగుతూనే ఓసారి మూలిగి- తామేదో నష్టం భరిస్తున్నట్టు, బేరం వదులుకోడం యిష్టంలేనట్లు- కష్టమర్ల శ్రేయస్సే తమ లక్ష్యమని వీరపోజుపెట్టి పాక్‌చేస్తాడు. మీరింత వయ్యారంగా ఆ శాల్తీలని కొంపకు తీసుకువచ్చి చుట్టుపక్కల అమ్మలక్కలకు చూపించి మీరేదో చవగ్గా కొనేసినట్టుగా ఫీలవుతూ, వారి మెహర్బానీ కబుర్లకు పొంగిపోతూ కాఫీకి బదులు మంచినీళ్ళు తాగేసి స్వగతంతో స్వర్గలోక విహారాలు చేసేయటం... ఇలా వుంటాయి మీ బజారులు, షాపింగులు'' గుక్కతిప్పుకోకుండా చెప్పాడు రామారావు.

''మీ నాన్నకు ఓ చెంబుడు మంచి నీళ్ళు తీసుకురావే..నోరెండిపోయింది పాపం...ఎవరు రాసిచ్చారు ఈ డైలాగుని'' కామేశ్వరి వైపు చూసి అంది అన్నపూర్ణ.

''లేదు నాన్నా...పాత పేపర్లు, డబ్బాలు, సీసాలు అమ్మేస్తే నలభై ఒక్క రూపాయలు వస్తే - ఆ డబ్బెట్టి ఈ స్టీలు డబ్బాలు కొంది...డబ్బు నీకు చూపిస్తే ఖర్చు చేసేస్తావని అమ్మయిలా చేసింది'' అంటూ కామేశ్వరి అసలు విషయం చెప్పింది.

''నేను ఖర్చు చేసేస్తానా...జీతం తెచ్చాక ఎవరి చేతిలో పెడుతున్నాను....కొంపలోకి సామాన్లు ఎవరు తెస్తున్నారు...బాకీలు ఎవరు తీరుస్తున్నారు...చివరికి సైకిలు పంచరుకి-గాలి కొట్టించేందుకు...గెడ్డం గీసుకునేందుకు బ్లేడు, సినిమాకు ఏ శివరాత్రినాడో వెడితే-డబ్బులు ఎవరిస్తున్నారు నాకు! మొదటినుంచి నా చేత్తో ఖర్చుచేస్తూ వుంటే ఈపాటికి రెండు మూడు లక్షలు దాచకపోయేవాడిని...పేనుకి పెత్తనం యిస్తే తెగ గొరిగి పారేసిందట...ఆడపెత్తనం యిలాగే ఏడుస్తుంది. ఇంట్లో వున్న పనికిరాని వస్తువులకే పదిహేను యిరవైవేలు ఖర్చయింది. వాటిని చూసి ఎవడూ రూపాయి అప్పు యివ్వడు. అవి పాడవుతాయని వాడటం మానేయటం...ఎందుకీ గొప్పలు! ఎవరిని ఉద్ధరించేందుకు?''

అన్నపూర్ణ డబ్బాలు తీసుకొని బీరువాలో పెట్టేసింది. ''మీకు తెలియదు... చెప్తే విని అర్థం చేసుకోరు. కొనటం చేతకాదు. కొంటే హర్షించరు. మీకు చూపించటం నాది బుద్ధిపొరపాటు'' అంటూ విసుక్కుంది.

''అవున్లే... నేను నీకు పనికిరాను. నేనంటే గిట్టను. నేను చెప్పింది వినకపోగా నువ్వు చెప్పింది నేను వినాలి. అంతగా నేను పనికిరాకపోతే మీ పుట్టింటికి ఫో, మీ నాన్న పోషిస్తాడు. లేదంటే ముగ్గురన్నయ్యలున్నారుగా...వాళ్ళు బాగా చూస్తారు. అంతెందుకు- మీరెండో అన్నయ్య ఈ వూళ్ళోనే వున్నాడుగా...ఎన్నిసార్లు వాళ్ళింటికెడితే కాఫీ నీళ్ళు యిచ్చాడని! ఇలా వున్నాయి మీ అక్కా చెల్లెళ్ళ సయోధ్యలు-పొత్తులు. మీ అన్నయ్యకు ఏ టైములో మూడ్‌వస్తుందో దేవుడికే తెలియాలి. మూడ్ వస్తే

అయిదు నిముషాలు మాట్లాడతాడు. లేకపోతే వళ్ళు కొరుకుతూ దేశాన్నీ ధరలనీ, ఆఫీసుల్నీ తిట్టిపోస్తాడు'' రామారావు కోపాన్ని అణుచుకోలేకపోయాడు.

''మధ్యలో వాళ్ళ గొడవ దేనికీ'' అన్నపూర్ణ మాట వుంచుకోలేకపోయింది. పుట్టింటి అభిమానంకదా మరి!

''సరే... అది వదిలేసి అసలు సంగతి చెప్పు. ఎలా కొన్నావు ఈ డబ్బాలు...ఇవ్వెందుకు అనవసరంగా'' సౌమ్యంగా అన్నాడతను.

అన్నపూర్ణ జవాబు చెప్పలేదు.

చెప్పాలనిపించలేదు-భర్త అర్థం చేసుకోడని.

''అయినా యింత తక్కువ ధరకు పేపర్లు-డబ్బాలు ఎందుకు అమ్మినట్లు?'' అని అడిగాడు తను వెంటనే.

''మరి ఏంచేసేదీ...ఎప్పటికీ ధర కుదరకపోతే. రోడ్డు మీద తిరిగేవాళ్ళని పిలవటం...చూపించటం...ధర కుదరక, తూకం నచ్చక లోపల పెట్టటం...ఇప్పటికే నలుగురైదుగురు కొన్ని పేపర్లు, డబ్బాలు, సీసాలు ఫ్రీగా తీసుకుపోయారు. లేవని చెప్పడం నాకు చేతకాదు. దానికితోడు మీ ఫ్రెండ్సు-ఎవరూ, ఎలుకలు... వాటిగోల ఒకటి! అందుకే ఎంతో కొంత అని వదిలించివడేసాను'' గర్వంగా చెప్పింది.

''ఏడ్చినట్లుంది నీ తెలివి. మొన్నటికి మొన్న శుభ్రమైన కరివేపాకు చెట్టుని పదిహేను రూపాయలకు అమ్మేసావు. అంతకుముందు నలభై రూపాయలు యిస్తానన్నదాన్ని పొమ్మని. ఎక్కువ ధర వస్తుందని ఆశపడ్డావు. మొదటికే మోసపోయి కూర్చున్నావు. నువ్వు చేసిన పనికి చెట్టుకు పురుగుపడుతోందని, ఆకు ముదిరిపోతోందని సమర్థించుకున్నావు. నేనే ఆ ధరకు యిచ్చేయమంటే యిస్తావా! అలాగే ఆ మధ్య పదిపాంట్లు, ఎనిమిది షర్టులు, ఆరు చీరలు, నాలుగు లుంగీలు, రెండు లంగాలు యిచ్చి పది లీటర్లు పట్టే స్టీలు గిన్నె తీసుకున్నావు. నీకెంత తోస్తే అంతేగాని చెప్పింది చేయవు. ఆలోచించే పని అసలే లేదు. ఏమన్నా అంటే నాకే ఏమీ తెలియదంటావు. నువ్వు చేసే పనులు నీకే గొప్పగా వుంటాయి. వాటిని మీ హైకమాండులోని మహిళామణులు శెభాష్ అని మెచ్చుకోడం...రేపు ఎక్కువ ధర వస్తుందని ఆశపడేముందు ఈవేళ్టి ధర, నిన్నటి ధర గురించి కూడా ఆలోచించాలి. ఇప్పుడు ఈ పేపర్ల విషయంలో ఇరవై తొమ్మిది రూపాయలు నష్టం... ఛీ..ఛీ...'' అంటూ కోపగించుకున్నాడు రామారావు.

భర్త ధోరణి తెలుసుకాబట్టి అన్నపూర్ణ నోరెత్తలేదు. కూతురివైపు గుర్రుగా చూసింది- తండ్రి చేత ఏదోవిధంగా తిట్లు తిట్టించాలన్న వుద్దేశం వున్నట్లుగా.

''ఇప్పటికైనా ఎలుకలమందు కొనుక్కురండి- లేకపోతే అవి మనల్ని బతకనీయవు'' అన్నపూర్ణ నచ్చచెప్పబోయింది.

''ఎందుకూ...నీకు అడ్డు తగుల్తున్నానని నాకు పెడ్తావా?'' మరోసారి మండిపడ్డాడు రామారావు.

ఇరవైతొమ్మిది రూపాయలు ఎటూ నష్టమే. ఇప్పుడు ఈ ఎలుకల సంహారంకోసం మరి కొంత ఖర్చు...జీవహింసను, భూతదయను కాసేపు పక్కకుపెట్టి ఆ మందుకొనటం కంటే మరో గత్యంతరం రామారావుకి కనిపించలేదు.

మొదట్నుంచీ అన్నపూర్ణ తను చేసే పనులకు అడ్డు తగులుతూనేవుంది. అసలు తామిద్దరికీ జాతకాలు కుదరలేదేమో...అచ్యుతరామయ్య కూతుర్ని వదిలించుకోడానికి ఈ విషయంలో కూడా డిప్లమాసీ ప్లే చేసివుంటాడనిపించింది. నిజానికి ఈ పేపర్ల అమ్మకం విషయంలో అవి అలా తన దగ్గర ఏడెనిమిది నెలల్నుంచీ పడివున్నాయి. అంతకాలం నుంచి చెమ్మలోపడి వుండటం వల్ల అవి మెత్తగా, చిరిగిపోయేలా వున్నాయి. అక్కడికీ ఎండలో పెట్టాడుకూడా. వాటిని ఎలాగైనా అమ్మాలి...ఎలాగ! వీధిలోకొచ్చేవాళ్ళు రేటు బాగానే యిస్తారు కాని తప్పుడు తూకం వుంటుంది. షాపువాళ్ళు సరిగా తూచినా రేటు తక్కువ...దానికితోడు అక్కడదాకా తీసుకెళ్ళేందుకు రిక్షాకు అదనపు ఖర్చు ఒకటి.

వీధిలో ఎవరిదో పేపర్లు కొనేవారి గొంతు వినిపిస్తే రామారావు వాడిని పిలిచాడు ఓసారి.

''పేపర్లు ఎలా కొంటున్నావు?'' అడిగాడు రామారావు.

"తెలుగు పేపర్లు కిలో రెండురూపాయలు. ఇంగ్లీషు అయితే రెండున్నర సార్" చెప్పాడు పేపర్లవాడు.

"పేపర్లలో కూడా భాషా భేదం వుందా ఏమిటి...నువ్వు ఏ రాజకీయ పార్టీకి చెందుతావు" బేరంకుదిరేదికాదని నవ్వుతూ అడిగాడు రామారావు.

వాడు జవాబు చెప్పకుండా- "ఇంటింటికి తిరిగి ఓ పావలా డబ్బులకోసం ఇంతశ్రమ పడాలిసార్" అన్నాడు వాడు.

"ఈరోజుల్లో పదిపైసలకూ, పావలాకూ ఎవడూ వ్యాపారం చేయడు. రూపాయిపెట్టి పేపరుకొంటే కనీసం నెల చందాలో నాలుగో వంతయినా రాకపోతే ఎలాగ" రామారావుకి చికాకు కలిగింది.

"మీ ధర చెప్పండి"

"నేను ప్రత్యేకంగా యివ్వటం ఏమిటి...అందరూ యిచ్చే ధర నువ్వు యివ్వాలి"

"అదేసార్...ఎలా యిమ్మంటారు?"

"భాషాభేదం లేకుండా పేపర్లన్నీ తీసుకోవాలి. కిలో మూడు రూపాయిలకయితే యిస్తాను"

"బోణీ బేరం సార్...మరోపావలా కట్టుకోండి"

"ఇంటింటికీ బోణీ బేరం ఏమిటి"

పేపర్లవాడు బుట్టవైపు చూపిస్తూ- "చూడండిసార్...బుట్ట ఖాళీగానే వుందికదా...మీదే బోణీ సార్..." అన్నాడు.

"ఎప్పటికప్పుడు అమ్మేస్తుంటే బుట్ట ఖాళీగా వుండక నిండుగా వుంటుందా"

"అదేంలేదుసార్... పేపర్లు తీసుకురండి"

అంతలో లోపల్నుంచి అన్నపూర్ణ పిలిచింది.

"కిలో నాలుగు రూపాయలు అడగండి. మొన్ననే ఎదురింటివాళ్ళు పాతిక కిలోలు అమ్మేరు" అందామె భర్తతో.

బయటకురాగానే పేపర్లవాడితో ఆ మాటే చెప్పాడు-

"నిజమేసార్...వ్యాపారంలో నిన్నటి ధర ఈ రోజుండదు. నేటి ధర రేపుండదు. మనుమల జీవితంలాగే పేపర్ల రేటు మారిపోతూ వుంటుంది" అన్నాడు పేపర్లవాడు.

రామారావు అదిరిపడ్డాడు. "ఏం చదువుకున్నావు?" అని అడిగాడు వెంటనే.

"ఎందుకొచ్చిన చదువుసార్" నిర్లిప్తంగా అన్నాడు వాడు.

"ఫరవాలేదు... చెప్పు"

"ఎం.ఎ చదివాను, ఏంలాభం? ఉద్యోగం రాలేదు. కన్నవాళ్ళని పోషించాలి కదా...ఈ వ్యవస్థలో న్యాయం, ధర్మం లేదుసార్...ఇక్కడ గాడిదలకే విలువ. ఏ అర్హతలూ, చదువూ లేనివాళ్ళు పాలిస్తున్నంతకాలం ఉద్యోగాలకు కరువేసార్... పైగా వాళ్ళు కోట్లు సంపాదిస్తారు-ప్రజాసేవ పేరుతో. ఎం.ఎ. చదివినందుకు కనీసం అటెండరు ఉద్యోగం రాకపోతే ఎలా సార్, అక్కడ కూడా పోటీయే కదా...కులం, మతం, భాష, డబ్బు...ఇవన్నీ అడ్డుగోడలేకదా...ఎక్కడ చూసినా ప్రతిదీ అమ్మకమే సార్...పార్టీ టికెట్లు, మంత్రి పదవులు, ఉద్యోగాలు, వరుళ్ళు యిలా ఎన్నోకదా...మాఫ్రెండు పదివేలుపెట్టి అటెండరు పోస్టు కొనుక్కున్నాడుట" అంటూ కళ్ళు తుడుచుకున్నాడు పేపర్లవాడు.

రామారావుకి వాడిమీద జాలి కలిగింది. ఇంక ఏ మాత్రం ఆలస్యం చేయకుండా ఆ ధరకే యిచ్చేయాలనుకున్నాడు.

"హార్లిక్సు, బూస్టు, మాల్టోవా సీసాలు ఎంతేమిటి" అడిగాడు రామారావు.

"ఇరవై పైసలు" చెప్పాడు వాడు.

రామారావుకి ఆశ్చర్యమేసింది.

"అంతే సార్ కొన్ని వస్తువులు. అమ్మబోతే అడవి, కొనబోతే కొరివి. సిమెంటు ధర ఎంత సార్...మరి ఖాళీ సంచిఖరీదు అర్ధరూపాయి, ముప్పావలా వుంటుంది- ఇలా ఎన్నో చెప్పచ్చు" పేపర్లవాడు చెప్తున్నాడు.

రామారావు లోపలికివెళ్ళి పేపర్లు, సీసాలు, డబ్బాలు తెచ్చి ముందుపెట్టాడు.

"పేపర్లు మూడు రూపాయలు. సీసాలు పదిహేను పైసలు. డబ్బాలు యిరవై పైసలు- అంతేసార్" వాటికేసి చూస్తూ చెప్పాడు నిశ్చయంగా వాడు.

లోపలకు ఎలా తీసుకెళ్ళాలి మళ్ళీ- అను

కుంటూ ఒప్పుకున్నాడు రామారావు.

బుట్టలోనుంచి త్రాసు, తూకపురాళ్ళు తీసాడు.

"ఏమిటయ్యా ఆ త్రాసు...కర్రకు తాళ్ళు కట్టి, రేకు పళ్ళేలు బిగిస్తే త్రాసు అవుతుందా" అన్నాడు చికాగ్గా రామారావు, గవర్నమెంటు త్రాసు ఏమైందని అడుగుతూ.

"ఏ త్రాసు అయినా ఒకటే. తూకంలో పొరపాటు వుండదు. ఓ పావలా అడిగితీసుకో వాలిగాని మోసం చేస్తే ఏంవస్తుంది! ఆ సంపాదన ఎలా వంటబడుతుంది..." పేపర్ల వాడు వేదాంతధోరణిలో చెప్పసాగాడు.

పేపర్లు ఇరవైకిలోలు వున్నాయి. అన్నింటికీ ధర కట్టి అరవైతొమ్మిది రూపాయల ఏభైపైస లు. మరో అర్ధరూపాయి తీసేస్తూ మొత్తం డెబ్బయ్ రూపాయలు ఇచ్చి అన్నీ బుట్టలో వేసుకున్నాడు పేపర్లవాడు.

రామారావుకి తూకంమీద అనుమానంగా వుంది. "మరో అయిదు రూపాయలు ఇచ్చేయ్" అన్నాడందుకే.

"లేదుసార్... సరియైన తూకం... చెప్పిన ధర నా దగ్గర. మీకు అనుమానంగా వుంటే తీసేసుకోండి- పరవాలేదు" అంటూ తీయబో యాడు పేపర్లవాడు.

అన్నపూర్ణ రామారావుని మళ్ళీ పిలిచింది- "వాడికి అంతపొగరేమిటి... బోలెడు మంది వస్తారు... తీసేసుకోండి... వాడుకాకపోతే వాడి బాబు ఇంకొకడు" అని సలహా ఇచ్చింది ఆమె.

పేపర్లవాడు వాటిని అక్కడ పడేసి డబ్బు



గుంజుకుని వెళ్ళిపోయాడు. "మంచిదిసార్... మీరు నష్టపోకండి" అంటూ.

అరగంట తరువాత మరొకడొచ్చాడు. ధరకు కుదరలేదు. ఇలా సాయంత్రం అయ్యే సరికి ఎనమండుగురు వచ్చి రకరకాల తూకాలు, ధరలు చెప్పి వెళ్ళిపోయారు.

ఇలా పదిహేనురోజుల గడిచాయి. రోజూ ఇద్దరూ ముగ్గురూ వచ్చి తిరుగుటపాలో దయ చేసేవాళ్ళు.

కొంపనుంచి ఈ పేపర్లకు – సీసాలు, డబ్బాలకు మోక్షం ఎప్పుడో అని, రామారావుతో పాటు అన్నపూర్ణ కూడా అనుకునేది. లోపల పెట్టటం... బయటకు తీయటంతో శ్రమ, విసుకు, కోపం. ఆ టైములోనే అయిదు సీసాలు పగిలిపోయాయి. ఎదురింటివాళ్ళొచ్చి నూనె తెచ్చుకునేందుకు మూడు డబ్బాలు, అల మారా ర్యాకుల్లో వేసుకునేందుకు పక్కింటావిడ ఓ అరడజను పేపర్లు తీసుకుపోయారు.

మరి తన పెత్తనం ఈ విషయంలో ఏమయింది! మగతనం, పెద్దరికం, వయసు, అనుభవం అన్నపూర్ణ ఏర్పరుస్తున్న చితిలో బూడిదయిపోతూనే వుంది...

ఎందుకొచ్చిన బతుకు... ఎవరికోసం బతకాలి... ఎవడిక్కావాలి ఈ శ్రమ... ఎందుకీ ఆరాటం... తాపత్రయం... కట్టుకున్న పెళ్ళామే తననిలా గడ్డిపోచగా చేస్తున్నప్పుడు?

రామారావుని అనుభవం, ఆలోచనలు బాధిస్తున్నాయి.



"ఇచ్చుట పూర్వాపరాలు, జాతకం, వాస్తు, శుభముహూర్తములు చూడబడును" అని వ్రాసివున్న బోర్డు చూసి ఆగాడు రామారావు. నిజానికి ఆ దారివెంట ఎన్నోసార్లు తాను వెళ్ళినా ఎప్పుడూ ఈ బోర్డు చూడలేదు. బహుశా గిరాకీలు లేకపోవడంతో బోర్డు కట్టవలసిన పరిస్థితి ఏర్పడిందేమో – అనుకున్నాడు అతను. రామారావుకి జాతకం, జ్యోతిషం పట్ల మొదట్లో అంతగా నమ్మకంలేదు. అయితే నమ్మకం కలిగేలా కొన్ని పరిస్థితులు ఏర్పడ్డాయి. విజయవాడలో తాముండే ఇంటిలో ఓ వాటాలో అద్దెకుండేవారు ఓ పంతులుగారు. ఆయన్ని అంతా పంతులుగారని పిలుస్తారు. అరవైఏళ్ళుంటాయి. గచ్చకాయలా మెరిసే గుండు... విశాలమైన నుదుటి భాగాన విభూతి రేఖలు. మధ్యలో కుంకుమబొట్టు. రోజుకు ఏడెనిమిదిసార్లు స్నానం... ఏడెనిమిది దేవాలయాల్లో కుంకుమ పూజలు, అభిషేకాలు, చేసి ఏడెనిమిది వందలు సంపాదిస్తారు. నాయకులు, మంత్రులు, అధికారులు విజయవాడ వచ్చినపుడు కనిపించి వెడుతుంటారు. ఆయనకు రాజకీయంగా బాగా పలుకుబడి వుంది. నలుగురు కొడుకులకు మంచి ఉద్యోగాలు, ఇద్దరమ్మాయిలకు మెడిసిన్ సీట్లు సంపాదించాడు. హైదరాబాద్‌లో ఖాళీ స్థలం కూడా వుంది.

"రామారావ్... ఈ రోజు నువ్వు ఎక్కడికీ వెళ్ళద్దు... పోస్టుమాన్ వచ్చే టైముకి ఇంట్లో వుండు" అన్నారు పంతులుగారు ఓరోజున.

రామారావు వినిపించుకోలేదు, పట్టించుకోలేదు. ఆయనే మళ్ళీ పిలిచి మరీ చెప్పారు- "ఇంట్లోనే వుండు... పోస్టుమాన్ శుభవార్త మోసుకువస్తాడు" అంటూ.

తనకు శుభవార్త ఏమిటి... అప్పుడేనా... అయినా దేశంలో లక్షల సంఖ్యలో నిరుద్యోగులున్నారు - ఏళ్ళతరబడి ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజిల చుట్టుతిరుగుతూ.. తనకి ఉద్యోగం అంతతేలిగ్గా, త్వరగా వస్తే ఏముందింక? అప్పటికి డిగ్రీ పూర్తి చేసి ఏడాది మాత్రమే అయింది. రామారావు పోస్టుమాన్ వచ్చే టైముకి ఇంట్లోలేదు. అంటే పంతులుగారు చెప్పిన మాటను ఖాతరు చేయలేదు.

సాయంత్రం ఇంటికిరాగానే చెప్పింది తల్లి – పోస్టుమాన్ తెచ్చిన రిజిస్టర్డు పోస్టు విషయం.

రామారావు ఆశ్చర్యపోయాడు...

మర్నాడు ఇంట్లోనే వున్నాడు.

పోస్టుమాన్ అప్పాయింటుమెంట్ ఆర్డరు మోసుకువచ్చాడు రిజిస్టర్డు పోస్టులో. రామారావు ఆనందానికి అవధులు లేకపోయాయి...

రెండోసారి పంతులుగారు గుడికెడుతూ అన్నారు- "రామారావ్... ప్రైవు హయ్యరు పరీక్షకు ఫీజుకట్టేవా?" అని.

"లేదండీ... ప్రాక్టీసు సరిగాలేదు. ఫీజుకట్టడం కూడా ఎందుకు... ఎటూపోయేపరీక్షే కదా..." చెప్పాడు రామారావు.

"నువ్వు మూర్ఖుడివి. ప్యాసవటం, ఫెయిలవడం నీచేతిలోలేదు. నీనుదుటమీద ఎప్పుడో రాసివుంచాడు బ్రహ్మ. పరీక్షలు పాసయినవాళ్ళంతా కృషిచేసి కాలేదు. వాళ్ళు పోటుగాళ్ళు కూడా కారు. ఎవరి అదృష్టం వారిది. నామాట విని ఫీజుకట్టు. నువ్వు తప్పకుండా పాసవుతావు" అన్నారు పంతులుగారు.

అన్యమనస్కంగానే ఫీజు కట్టాడు.

అలా అని ప్రాక్టీసు పెంచలేదు.

అలాగే పరీక్షకెళ్ళాడు.

అదృష్టం... పదిమందికి ఇద్దరు పాసయ్యారు. అందులో రామారావ్ ఒకడు. మిగిలిన ఎనమండుగురు మూడునాలుగుసార్లు పరీక్షలకెళ్ళినవాళ్ళే...

మూడోసారి... "నీకు రెండునెలల్లో వివాహం అవుతుంది" అన్నారు.

ఎగిరి గంతేశాడు రామారావు. తాను కళ్యాణిని పెళ్ళిచేసుకోబోతున్నాడన్నమాట!

"అయితే నీకళ్యాణం మీరనుకునే కళ్యాణితో జరుగదు"

ఖంగుతిన్నాడు రామారావు.

"పదిమంది నుంచీ మెప్పుపొందే యిల్లాలు నీకొస్తుంది. నలుగురికీ అన్నం పెట్టే పేరుగల - బహుశా 'అన్నపూర్ణ' పేరుగల అమ్మాయి నీభార్య అవుతుంది. ఇంతవరకూ వున్న నీజాతకం ఆమె రాకతో పూర్తిగా మారిపోతుంది" అన్నారు పంతులుగారు.

ఓవైపు కోపం, విచారం, బెంగ.

మరోవైపు ఆనందం... అయితే ఎంతోసేపు ఆమాటలని పట్టించుకోలేదు రామారావు.

మొత్తానికి అన్నపూర్ణ అతనికి ఇల్లాలు అయింది.

నాలుగోసారి అన్నారు పంతులుగారు- "నీకు వారంపదిరోజుల్లో ట్రాన్సఫరు అవుతుంది" అని.

అంతే పదమూడోరోజుకి రామారావుని నగరానికి బదిలీచేశారు అధికారులు.

అప్పట్నుంచీ రామారావుకి జాతకం, జ్యోతిషంపట్ల నమ్మకం పెరిగింది. అయితే కొందరు ఖచ్చితంగా చెప్పగలరు. మరికొందరు చెప్పలేరు అనుకుంటూ ఉంటాడు.

ఇప్పుడు రామారావుకి ఆ బోర్డు చూడగానే గతం ఆవిధంగా గుర్తుకొచ్చింది. అతను లోపలకు అడుగుపెట్టాడు. కుర్చీల్లో ఆరుగురు కూర్చుని తమవంతుకోసం ఎదురుచూస్తున్నారు. టీపాయిమీద పేపర్లు, వారపత్రికలు వున్నాయి - కాలక్షేపం నిమిత్తం కాబోలు.

సిద్ధాంతిగారు లోపల వున్నట్లుగా తెలుస్తోంది.

అయిదు నిమిషాల తరువాత ఆయన ఎందుకో బయటకు వచ్చారు. ఓసారి మిగిలిన వారివైపు చూసి రామారావుని ఉద్దేశిస్తూ అన్నారు- "అరగంట ఆలస్యం అవుతుంది. ఈలోగా వేరేపని ఏదైనా వుంటే చూసుకురండి" అని.

"ఫరవాలేదు... కూర్చుంటాను. ఎటూ ఆదివారమేకదా" అంటూ ఓ వారపత్రిక అందుకుని పేజీలు తిప్పసాగాడు రామారావు.

సిద్ధాంతిగారు లోపలకు వెళ్ళిపోయాడు.

ఆయనకు డెబ్బయ్ ఏళ్ళుంటాయి. పసుపుపచ్చని శరీరఛాయ. వడిలిన శరీరం. గుండ్రటి బొట్టు, చుట్టూ గంధం... చత్వారపు కళ్లజోడు... మూడో నాలుగో వూడిన పళ్ళు...

అతనికి ఆ క్షణంలో విజయవాడ పంతులుగారు గుర్తుకొచ్చారు. నిజానికి రామారావు విజయవాడవెళ్ళి ఆయన్ని కలవాలనుకున్నాడు. కాని ఆయన రెండేళ్ళ క్రితమే ఢిల్లీలో వున్న కొడుకు దగ్గరకు వెళ్ళిపోయారని తెలిసింది.

సిద్ధాంతిగారిని చూడగానే అనుకున్నాడు రామారావు- "ఈ వయసులో యీ యనకెందుకింత తాపత్రయం"

పత్రికల, పేపర్లమధ్య అతనికి విసుగు, చికాకు కలగలేదు.

"మీకు ఆలస్యం అయింది కాబోలు" అంటూ వరండాలోకొచ్చారు ఆయన – నలభై నిమిషాల తరువాత.

"ఫరవాలేదు" అన్నాడు రామారావు.

"మీ పేరు, ఉద్యోగం, మకాంల గురించి చెప్తారా?" అన్నింటికీ జవాబులు చెప్పాడు.

"ఇంతకీ మీరొచ్చినవని" అని అడిగారాయన.

"నేనింకా యముడి పిలుపుకి ఎన్నాళ్ళు ఎదురుచూడాలి"

సిద్ధాంతిగారు ఆశ్చర్యపోయారు. ఈవిధమైన విషయాలకోసం ఎవరూ రారు. పెళ్ళి, ఉద్యోగం, సంసారం, పిల్లలు, ఆరోగ్యం మొదలైన వాటికే ఎక్కువమంది వస్తుంటారు... కాని ఈయన ఇలా అడుగుతున్నాడేమిటి అనుకున్నారాయన. ఇలా అడిగేందుకు ఏదో బలమైన కారణం వుంటుంది. ఇతను పిరికివాడా, పరాజితుడా అని ఒక్షణం ఆలోచనలో పడ్డారు సిద్ధాంతిగారు.

"ఈ వయసుకే యింతవైరాగ్యమా" అన్నారాయన.

రామారావు ఎటోచూస్తూ ఆలోచిస్తున్నాడు.

"మంచిపనికైనా, చెడుపనికైనా బాగా ఆలోచించాలి. ఇంతకీ యిలా ఎందుకు అడుగుతున్నారు మీరు"

"ఏం ప్రశ్నసార్ అది... ఎందుకు బతకాలి... భవిష్యత్తు నాకు చీకటిగా కనిపిస్తుంది. నేను లేకపోతేనే బాగుంటుందేమో... మనిషి విలువ బతికుండగా ఎవరూ గుర్తించరు..."

సిద్ధాంతిగారు నవ్వేశారు– నవ్వుం దట్టిస్తూ.

"చూడండి రావుగారూ... మనిషి అన్నవాడు, తనకోసం ఎప్పుడూ ఆలోచించకూడదు. ఎదుటివారికోసం ఆలోచించాలి. అయితే నూటికి నూరుశాతం కూడా స్వార్థంతోనే ఆలోచిస్తారు. అందుకే యీ సమాజం యిలా కుళ్ళిపోతోంది. మనుషుల ఆలోచనలు వెర్రితలలు వేస్తున్నాయి. మనుషుల ఉద్దేశాలు, క్షణక్షణానికీ మారిపోతున్నాయి. నావిషయమే చూడండి. నాకు నలుగురు కొడుకులు. అయిదుగురు కూతుళ్ళు. మొత్తంమీద పాతికదాకా మనవలు, మనవరాళ్ళు వున్నారు. నాకొడుకులు మాగురించి ఆలోచించరు, పట్టించుకోరు. వారు, వారిపెళ్ళాలు, పిల్లలు, సరదాలు, ఖర్చులు తప్పిస్తే ఏమీ పట్టించుకోరు. వాళ్ళు దుబారాగా తగలేసే డబ్బుని మాకు యిచ్చినా మా ముసలిప్రాణాలు బతకగలవు. కాని మేము వారిదగ్గరుండాలిట... అదెలా కుదురుతుంది... అందుకే ఈ వృత్తిలో బతుకుతున్నాను. మనిషికి బాధ్యత, క్రమశిక్షణ, సంస్కారం, గౌరవం, మర్యాద, మంచీ గురించి మొదట తెలిసుండాలి. అదిలేనినాడు ఎంత చదివినా, ఎంత డబ్బున్నా వృధానే" సిద్ధాంతిగారు ఆవేశంగా చెప్తున్నారు. రామారావు మౌనంగా వింటున్నాడు.

"ఎటువంటి ఒడుదుడుకులనైనా ఎదిరించే ఆత్మస్థయిర్యం మనిషికి వుండాలి. కష్టాలు, యిబ్బందులు, సమస్యలు లేకపోతే అది జీవితం కాలేదు. ఇంతకీ మీకొచ్చిన కష్టం, యిబ్బంది ఏమిటో" మరోసారి నవ్వుం దట్టించారు సిద్ధాంతిగారు.

"ఆర్థికసమస్య..." చెప్పాడు రామారావు.

ఆయన రామారావు కళ్ళల్లోకి సూటిగా చూసి చెప్పారు-

"మీకు అందమైన భార్య, రత్నాల్లాంటి ఇద్దరు కూతుళ్ళున్నారు. మీ భార్య మీమాట వినాలని మీరనుకొంటారు. కాని మీ భార్య తన మాట ప్రకారం అంతా జరగాలనుకుంటుంది- ఇదేనా మీసమస్య"

ఆశ్చర్యపోయాడు రామారావు.

"అవును... నూటికి తొంభైమంది భర్తలు ఇలాగే అనుకుంటారు. ఎందుకో తెలుసా, ఇది పురుషప్రపంచం... తమ ఆధిక్యతని ప్రదర్శించుకోవాలనే ప్రయత్నిస్తారు. కాని మీలాగే మీ భార్యలూ ఆలోచిస్తారు కదా... సంసార రథం నడక ఇలాగే వుంటుంది" వేదాంతధోరణిలోనే చెప్పారాయన.

అందుకే మీ కొడుకులు మిమ్మల్ని పట్టించుకోటం మానేశారు- అనుకున్నాడు రామారావు.

"నా భవిష్యత్తు ఎలా వుంటుందో తెలుసుకోవాలని మీ దగ్గరకు వచ్చాను" అన్నాడు రామారావు నిశ్చయంగా.

మరోసారి అతని కళ్ళల్లోకి చూశారు సిద్ధాంతిగారు. "మీది మహారాజ జాతకం...

మీకు ఏ లోటూ వుండదు'' అన్నారాయన.

ఖంగుతిన్నాడు రామారావు. అతనికి వెంటనే అన్నపూర్ణ గుర్తుకొచ్చింది. ఆమెమీద కోపం, కసి, ద్వేషం కలిగాయి.

''ఏంజాతకమో ఏమిటో... ఎంత ఆదాయం వచ్చినా అప్పులు తప్ప తృప్తి, ఆనందం మిగలటంలేదు. ఎప్పటికి విముక్తి, మోక్షం కలుగుతుందో తమరు సెలవివ్వాలి'' అర్థించాడు అతను.

సిద్ధాంతిగారు రామారావు కుడిచేతిని తీసుకుని అరచేతి రేఖలను పరిశీలనగా చూస్తూ చెప్పారు- ''మీ ఆర్థికస్థితి అప్పుడప్పుడు నత్తనడక నడుస్తుంది. మీ కుటుంబసభ్యులకోసం తరచు విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. వివాహాది, శుభకార్యాలంటే మీకూ, మీ శ్రీమతికీ ఎంతోసరదా. అందుకు విరివిగా ఖర్చులు చేస్తారు. అనుకూలమైన వాతావరణం ఎప్పుడూ మీ శ్రీమతి ద్వారానే లభిస్తుంది. తొందరపాటు మీకు తగదు. శ్రమ, ఖర్చులు హెచ్చుగా వున్నా ఆందోళనపడనవసరంలేదు. ఉన్నత స్థాయి వ్యక్తుల ఆదరణ, సాయం, సహకారం లభిస్తూ వుంటుంది. మీ శ్రీమతి ప్రమేయంతో మీ కుటుంబపరిస్థితులు ఎప్పుడూ ప్రోత్సాహకరంగా నెరవేరుతూ వుంటాయి.... ఏదోవిధంగా మీకు డబ్బు అందుతూ వుండటంవల్ల- తగినట్టుగానే ఖర్చులు పెరుగుతూ వుంటాయి. ఏ పరిస్థితుల్లోనూ మీ శ్రీమతిపట్ల విముఖత, చికాకు, కోపం ప్రదర్శించడం మంచిదికాదు''

''ఏమండీ... నా ప్రమేయం ఏమీ వుండదా... వుండనవసరం లేదా... మొగుడంటే డబ్బు సప్లయిచేసేందుకేనా... ఏమిటి మీరు చెప్పేది...'' రామారావుకు కోపం వచ్చింది.

''చూడండి... మీ ఆవేశానికి కారణం లేకపోలేదు. కాని యిది అన్ని కుటుంబాల్లోనూ వుండేదే... మీరు బయటపడ్డారు. మిగిలినవాళ్ళు కడుపులోనే దాచుకుంటారు''.

రామారావుకి ఆ జవాబు తృప్తికరంగా తోచలేదు.

''ఏవో సమస్యలు, యిబ్బందులు ఎప్పుడూ వెంటాడుతూనే వుంటాయి. వస్తువాహనాదులు సమకూర్చుకోటంవల్ల మీ స్టేటస్సు పెరిగి మిమ్మల్ని అందరూ గుర్తిస్తారు. తలపెట్టుకున్న పనులు ఏవో ఆటంకాలతో నెమ్మదిగా ప్రారంభం అయినా, చివరికి గెలుపు సాధిస్తారు. చేతిలోని డబ్బుని పొదుపుగా వాడుకోవాలన్న ఆలోచన మంచిదే. కాని మీకా అవకాశాన్ని మీ శ్రీమతి రానివ్వదు. ఆమె దుబారా చేస్తోందని మీరనుకుంటే అది కేవలం మీ అపోహమాత్రమే... నలుగురిలో మీ పలుకుబడి పెరుగుతుంది. మీ మనస్సుకు, ఆలోచనలకు ఉత్సాహాన్నీ ఆనందాన్నీ తృప్తిని కలిగించే వాతావరణం మీ చేతుల్లోనే వుంది. విజయం ఎప్పుడూ మిమ్మల్ని వరిస్తూ వుంటుంది. తాత్కాలికంగా ఆవేశాన్ని ఆగ్రహాన్ని రేపినా... జన్మతః శని మీకు ఎప్పుడూ లాభం చేకూర్చుతూ వుంటాడు. అత్యంత శుభప్రదమైన వాతావరణాన్ని శని ఎప్పుడూ మీ శ్రీమతిద్వారా చేకూరుస్తూ వుంటాడు. ఆదాయంలో అభివృద్ధి, అందరికీ ఆరోగ్యం, అవసరాల్లో ఆదుకునే ఆప్తులు మీకు నీడలా వెంటాడుతూ వుంటారు. ఇంతకంటే ఎవరికైనా ఏంకావాలి... మంచిరోజులు ఎప్పుడూ మీవే... కాబట్టి వెళ్ళిరండి... గుడ్ లక్'' అంటూ ముగించారు సిద్ధాంతిగారు.

రామారావు జేబులోనుంచి పాతికరూపాయలు తీసి ఆయన చేతిలో పెట్టి నమస్కరించారు. సిద్ధాంతిగారి ఆశీర్వాదం పొందగానే అక్కడనుండి వెళ్ళిపోయాడు- ఆయన చెప్పిన విషయాలు మననం చేసుకుంటూ.

★ ★ ★

ఏ ముహూర్తాన అన్నపూర్ణకు గొలుసు చేయించాడో, తరచు అది బాంకు కెళ్ళి వస్తూనే వుంది- అప్పుకోసం. నిజానికి అది అతను చేయించాలనుకోలేదు. వందేళ్ళక్రితం సహకార సంఘం వాళ్ళు కొత్తగా అప్పులు మంజూరుచేశారు. రామారావుని ఓ స్నేహితుడువచ్చి అప్పుతీసుకోమన్నాడు. ఇద్దరూ సంతకం చేసి తీసుకోవటంవల్ల గొడవేమీ వుండదు. అయితే రామారావు మాత్రం అప్పుతీసుకొని- వెంటనే బంగారు దుకాణంకెళ్ళి అన్నపూర్ణకు గొలుసు చేయించేశాడు. అదే ఆమెని సంతోషపెట్టే విషయం. ఆ విషయంలో తప్పించి ఆమె అతనితో మరే విషయాల్లోనూ ఏకీభవించదు. అయితే యిప్పటికే పదిహేను పదహారు వేలు

దాకా అప్పు సంపాదించాడు- ఆ గొలుసు పుణ్యమా అని. అదే లేకపోతే అంత తేలిగ్గా అప్పు దొరకదని అతనికి తెలుసు. మూడువేల రూపాయలతో చేయించిన గొలుసు పదహారు వేలదాకా అప్పు సంపాదించిపెట్టింది అంటే అదికేవలం బంగారం ధర విపరీతంగా పెరిగి పోవటమే... ఇప్పుడా వస్తువు ధర పన్నెండు వేలుంటుంది.

ఈసారి కూడా బాంకులో పెట్టి రెండువేలు తెచ్చాడు రామారావు. "ఇదిగో డబ్బు... ఏంచేస్తావో నీ యిష్టం" అని అన్నపూర్ణ చేతిలో పెట్టాడు.

"నేనేదో అనవసరంగా ఖర్చు చేసి దుబారాగా వున్నాననా మీ ఉద్దేశం... ఏంచేసినా ఈ కొంపలోకే కదా.. మీరు చేయరు.. నేను చేస్తే కోపం అక్షింతలు.. ఏం మనుములో" అంది అన్నపూర్ణ.

అయితే అన్నపూర్ణ పొరుపడలేకే అప్పుచేసిన విషయం తనకూ తెలుసు. "ఇంతకీ సరుకుల జాబితా పూర్తయిందా?" అడిగాడు కొంచెం సేపయ్యాక.

"నాదెప్పుడూ ఆలస్యం వుండదు. ఇదిగో లిస్టు... నిన్ననే రాసి వుంచాను" అంటూ సరుకుల జాబితాను భర్తకు అందించింది.

రామారావు కాగితాన్ని జాగ్రత్తగా పరిశీలించాడు. "కాగితంలో రెండోవైపు కొద్దిగా కాళీగా వుంది... ఏమైనా రాయాలేమో గుర్తుచేసుకొని ఆ కాళీ భర్తీచేసేస్తే సరి... ఇంతకీ తెచ్చిన డబ్బు ఈ జాబితాకు సరిపోతుందో లేదో..." అన్నాడు.

భర్త ధోరణి తెలుసు .కాబట్టి మాట్లాడలేదు అన్నపూర్ణ.

"ఇంతకీ డబ్బాలు శుభ్రంగా కడిగి ఆరపెట్టావా.. సంచులు సిద్ధం చేసావా లేక ఊరుమీదకు బయలుదేరాలా- అరువుకోసం..మనకు ఆ టైముకు కాని ఏదీ గుర్తుకురాదు" అన్నాడు వెటకారంగా.

"డబ్బాలు కడిగేందుకు నీళ్ళుంటేగా... బావి ఎప్పుడో ఎండిపోయింది. కుళాయి నీళ్ళు సరిపోవటంలేదు. కాలనీలో అందరూ బోరింగులు వేయించుకుంటుంటే మీరు ఏమీ పట్టించుకోరు... ఇప్పటికి నాలుగుసార్లు లోతు తీయించారు. అయినా నీళ్లుండటంలేదు. పోనీ బోరింగ్ వేయించరాదూ" అంది అన్నపూర్ణ మరింతగా సాగదీస్తూ.

"నీకు రానురాను చాదస్తం ఎక్కువయిపోతోంది. మీ అన్నయ్య లాగే నీళ్లగోల ఎక్కువయింది. ఆ మానవుడికి రెండుటాంకుల నీళ్లున్నా ఎప్పుడూ నీళ్ల కరువే... పోనీ వున్న నీళ్లయినా వాడతాడా అంటే- చూసిచూసి లెక్కపెట్టి మరీ టాంకు దగ్గరికెడతాడు. ఓ బిందెడు నీళ్లు వాడేసరికి గుండె చేత్తోపట్టుకొని 'అయ్యబాబోయ్' అంటాడు. నువ్వు సరేసరి.. అసలు మీ ఆడవాళ్ల కారణంగానే నీళ్ల సమస్య ఎక్కువయి పోతోంది. ఇకపోతే మనం చేసే తప్పుడు పనులు వల్లే వరుణుడు వర్షించడం మానేశాడు. ఇక సూర్యుడు తనప్రతాపాన్ని మరింతగా విజృంభిస్తూ భూదేవిని కాల్చేస్తున్నాడు- ఫలితంగా నూతులు, చెరువులు ఎండిపోతున్నాయి. కలికాలం అంటే యిదే..." వీరలెవెల్లో అన్నాడు రామారావు.

"అసలు మిమ్మల్ని కదిలించడం నాదే తప్పు... ఎక్కడో మొదలుపెట్టి మరెక్కడో ఆపుతారు. మీకూ ప్రతిపక్షనాయకులుకూ తేడా ఏమీలేదు. అర్థంపర్థం లేకుండా వాగుతారు. టైమవుతోంది, ఇకబయలుదేరుదాం బట్టలు వేసుకోండి" అంది అన్నపూర్ణ.

ఇద్దరూ బజారుకి బయలుదేరారు.

ఈ ప్రయాణం ఏటా ఉండేదే.. వప్పులు కొనేందెకు.. ఇది రామారావుకి నచ్చదు. ఈ వ్యవహారానికి పెట్టుబడి ముందే పెట్టాలి. అందుకు తాను అప్పుచేయాలి. దానికి వడ్డీ చెల్లించాలి. ఎప్పటికప్పుడు నెలనెలా కొనటంలో సౌలభ్యం వుంది. పొదుపుగా వాడటమే కాదు, జాగ్రత్తగా చూసుకుంటాము. దుబారా వుండదు. ఎన్నోసార్లు యిలా చెప్పిచూశాడు. కాని పోటీగా. ఏదో పెళ్లయిన కొన్నేళ్లు చెప్పిన మాట నాది తను తరువాత సినియారిటీ పెరిగి పెర్మనెన్సీ డిక్లేరు అవటంతో ప్రభుత్వోద్యోగుల్లా నోరుపెంచుకోవటం మొదలు పెట్టింది. ఫ్రెండ్సు పెరిగారు. పద్ధతులు-అలవాట్లు మారాయి. భేషజం, అతిశయం, అహంభావం, నాగరికత, నవీనం రంగరించుకొని, జీర్ణించుకొన్న స్నేహితురాళ్లద్వారా అన్నపూర్ణ ధోరణిలో మార్పు కలిగింది.

"ఎందుకీ శ్రమ..బజారుకెళ్లటం... ధరలు విచారణ చేయటం... ఇంటికి ఆ మూటలని ఆటోల మీద చేర్చటం... బాగుచేయటం... ఎండపెట్టటం... డబ్బాల్లో పోయటం... అప్పుడప్పుడు వాటిని తిరిగి ఎండలో వుంచటం... శ్రమ, కష్టంకదా... హాయిగా ఏ నెల కానెల లిస్టు రాసి మన కిరాణాషాపు వాడికి లిస్టు ఇచ్చేస్తే- వాడు కొంపలో తెచ్చి పడేస్తాడు కదా... ఈ కొత్త పద్ధతి ఏమిటి, నీకూ నాకూ గొడవ కూడానూ..." అని కూడా మందలించేవాడు ఏటా ప్రయాణం గురించి ప్రస్తావించేటప్పుడు.

"మన షాపువాడు రేట్లు ఎక్కువ వేస్తున్నాడు... దానికి తోడు ధరలు రోజూ పెరిగిపోతున్నాయి... ఒక్కసారి తెచ్చుకుంటే సరిపోతుంది కదా..." అనేది అన్నపూర్ణ.

"నీమోహం... ధరలు పెరగటం ఆర్థికసూత్రం. ధరలతోపాటు జీతాలు పెరుగుతున్నాయికదా... ఆమాటకొస్తే ధరలు పెరుగుతున్నాయి అని ఎవరు నోళ్ళు కట్టుకుంటున్నారని...ఎల్లాగోకొంటున్నారుకదా... డొనేషన్లు, కట్నాలు, లంచాలు పెరుగుతున్నాయనే వారే ఓ స్టెప్పు ముందుకు వేసి ప్రోత్సహిస్తున్నారు. ఎవరికివారు పోటీపడి, గొప్పగా ఖర్చుచేసి సమాజంలో తమ యిమేజిని పెంచుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. ప్రదర్శించుకుంటున్నారు. ఎవరూ డబ్బుకోసం బాధపడటంలేదు... ఇదంతా కేవలం ఫార్సు... పేదరికం మనదేశంలో లేదు. కేవలం నాయకుల నోళ్లల్లోనే వుంది. సినిమాహాళ్లు, బట్టల షాపులు, రేసు కోర్సులు, హొటళ్లు, క్లబ్బులు ఎప్పుడూ నిండిపోతున్నాయి... ఇదంతా మనకు మనం సృష్టించుకున్న వలయం..." రామారావు కూడా ఏమీ తీసిపోనట్లుగా మాట్లాడతాడు.

అన్నపూర్ణ చెవులు ఆ సంభాషణకి అలవాటుపడిపోయింది.

"అప్పు తెచ్చినపైకానికి చెల్లించే వడ్డీని కూడా లెక్కలోకి తీసుకుంటే- పెరుగుతున్న ధరలకు సరిపోతుంది. ఇక మనకు అదనంగా మిగిలేది శ్రమ, కష్టమూ.. చాకిరీ.."

"ఏమైనాసరే... కొనాల్సిందే" అని అన్నపూర్ణ కొట్టిపారేస్తే ఆ మానవుడికి మరో గత్యంతరం వుంటుందా?

అటువంటి పరిస్థితుల్లో అతను గొలుసు తాకట్టు పెట్టి డబ్బుతెస్తుంటాడు. అది విడిపించేందుకు మరోచోట అప్పుచేస్తాడు... ఇది వారిమధ్య అనుబంధం... స్నేహం...

రామారావు ఈ అనుభవంలో ఏదీ కొత్తదనం, తేడా గమనించలేదు. చుట్టాల తాకిడి, దుబారా, ఎలుకలగోల, పురుగుపడుతుండటం, అందుకు ఏవో మందులు ఉపయోగించటం జరుగుతూనే వుంది. ప్రభుత్వం ఉద్యోగులకు జీతాలు పెంచబోతోంది అని తెలిసేసరికి ఉద్యోగులకు కొత్త అవసరాలు, కోరికలు, అలవాట్లు గుర్తు కొచ్చినట్టుగా - అన్నపూర్ణకు కూడా డబ్బాల్లో పప్పులు నిండుగా కనపడేసరికి ఏదో చేయాలనిపించడం జరిగేది. నిజానికి ఉద్యోగులు తమ కొచ్చే జీతాల్లో కుటుంబం జరుగుబాటుకు ఎంతఖర్చు చేస్తున్నారు. అంటే ఆరవైశాతం కూడా వుండదేమో... మిగిలినది స్టేటస్సు కోసం... దుబారా అనే చెప్పాల్సి వుంటుంది. డొనేషన్లు, ఫీజులు, పుస్తకాల నిమిత్తం ఖర్చు వేలల్లో వుంటుంది... అందుకు అప్పులు చేయాల్సిందే... గవర్నమెంటు స్కూళ్ళు, కాలేజీల్లో చేర్పిస్తే మంచిదికదా అంటే అక్కడ చదువులు చెప్పరట... అవును మరి, ఆఫీసుల్లో ఉద్యోగులు పనిచేస్తున్నారా... అక్కడ కూడా అంతే...చదువు ప్రవేటు విద్యాసంస్థల్లోనూ, ఉద్యోగాలకు ప్రభుత్వమూ కావాలి... ఏమిటిదంతా

అవిధంగా ఆ దంపతులు మధ్య ఘర్షణ... అంతర్యుద్ధం... చివరికి రామారావు, అన్నపూర్ణ బజారుకి కదిలారు- ఎప్పటిలాగే...ఏడెనిమిది షాపుల్లో ధరలు, నాణ్యత పరిశీలించారు. ఒక వస్తువు ఒకచోట తక్కువ మరొకటి ఎక్కువగా వుండటం వ్యాపార సూత్రం... ఇదే కష్టమర్లని ఆకర్షిస్తాయి...

చివరకు ఓ షాపులో స్థిరపడ్డారు...

అన్నపూర్ణ జాబితాని షాపు యజమానికిచ్చింది.

వారికి కూల్‌డ్రింక్స్ వచ్చాయి. అందుకు పొంగిపోయింది అన్నపూర్ణ. అభినందనగా భర్తవైపు చూసింది.

"దీన్నే తడిగుడ్డతో గొంతుకోయటమంటారు. ఈ డ్రింకుల ఖర్చుకూడా మన వస్తువుల్లో చేరుస్తాడు వ్యాపారస్తుడు. వ్యాపారం, ప్రజాసేవ చేస్తున్నా అది ఎదుట వారికోసం కానేకాదు... స్వార్ధం, స్వప్రయోజనం, స్వలాభం కోసమే ఈ లక్షల పెట్టుబడికి మూలకారణం... ప్రజలు పిచ్చివాళ్ళు కాబట్టి యిటువంటి ఆకర్షణాలకు లొంగిపోతూవుంటారు. నీలాంటివాళ్ళు 'మంచివాడుగా' భావిస్తారు" అన్నట్లుగా భార్యవైపు చూసాడు రామారావు.

నలభై నిముషాలకు మూటలు సిద్ధమయ్యాయి.

షాపులో కుర్రాడు ఆటోలని పిలిచాడు.

సరుకుల జాబితాలో ధరలు వేసి ఇచ్చాక రామారావు డబ్బు చెల్లించి బయటకు వచ్చాడు. షాపుయజమాని "నమస్కారం" చేశాడు. అన్నపూర్ణ పొంగిపోయింది. రామారావు మాత్రం ప్రతి నమస్కారం చేయలేదు- నమస్కారం వెనుక మస్కా పాలిష్షుంటుందని అతని నమ్మకం... చిరునవ్వునే ప్రతి నమస్కారంగా వదిలాడు...

ఆటోలు ఇంటివైపు బయలుదేరాయి.

ఆ ఆదివారం రామారావు పప్పుల మూటలు డాబామీదకు చేర్చాడు- ఎండ పెట్టేందుకు సాయంత్రం మళ్ళీ దించడం దాంతో కాళ్ళు, చేతులు నొప్పులు...ఆయాసం...

"నాలుగు రోజులు ఎండబెడితే, ఆ తరువాత డబ్బాల్లో పోసి అటకమీదకు చేర్చవచ్చు" మేడంగారు సెలవిచ్చారు.

"అంటే ఈ ఎక్సర్‌సైజు మరో మూడురోజులు చేయాలన్నమాట" అంటూ చిరాకు పడ్డాడు రామారావు.

ఆ మర్నాడు కూడా శెలవురోజే.

"సినిమాకు వెడదాం" అంటూ వచ్చింది కామేశ్వరి పప్పులు పైకి చేర్చగానే.

రామారావు గతుక్కుమన్నాడు. టీవీలో నెలకు పదహారు సినిమాలు, మరిన్ని సీరియల్స్ చూస్తూ, వీడియో అద్దెకు తెచ్చి మరికొన్ని సినిమాలు చూస్తూ... మళ్ళీ సినిమాహాల్లో సినిమా చూడటం ఏమిటి... డబ్బు దండగ... పైగా ఏ సినిమా చూసినా ఏముందని గొప్పతనం... ఫైట్లు, స్టెప్పులు, ధనుర్వాతం రోగుల గంతుల్లాంటి డాన్సులు, ముద్దులు, కౌగిలింతలు, రేప్‌లు, డబుల్ మీనింగు పాటలు-మాటలు...! కథాపాడా... అంటూనే ప్రేక్షకులు పరుగెట్టుకెళ్ళి చూస్తున్నారు. విమర్శించేవాళ్ళే నిజమైన మహారాజ పోషకులేమో... సినిమాలు వస్తున్నాయి... చూస్తున్నాం..రామారావు కూతురుకి నచ్చచెప్పే ప్రయత్నం చేశాడు. కాని ఎదురుగా అన్నపూర్ణ కనిపించింది.

"నీకీవేళ వీణ క్లాసు లేదా?" అన్నాడు తప్పించుకునే ప్రయత్నంగా.

"ఈవేళ టీచరు రానంది" చెప్పింది కామేశ్వరి.

రామారావుకి కోపం వచ్చింది- "అసలే నెలకు పది క్లాసులు- అందుకు వంద రూపాయలు ఫీజు... వీటిల్లోనే గైరుహాజరు... సొంతపనులు... వీణ కొనమన్నదని రెండువేలకు టెండరు సిద్ధం చేసివుంచాక... ఏమిటిదంతా... "వీణ, సంగీతం, డాన్సు వచ్చునని అన్నంతమాత్రాన ఎవడూ ఊరికే పెళ్లాడడు. ఈ పెట్టుబడి వృధాకాదా".. అన్నాడు రామారావు.

"ఏమిటండీ... మీరొక్కరే పెళ్ళిచేసుకుని, పిల్లల్ని కంటున్నట్టు మాట్లాడుతున్నారు... సినిమాలు చూడక్కర్లేదా..." అంది అన్నపూర్ణ కోపంగా.

"చూడొచ్చు... అసలు తిండిమానేస్తే రోజూ మూడాటలు కూడా చూడొచ్చు... ఎవరు కాదంటారు..."

కామేశ్వరి తల్లివైపు చూసింది.

"మరి డాబామీద పప్పులు ఆరబోశాము కదా" అన్నాడు రామారావు ఏదో గుర్తుకొచ్చినట్లుగా! సినిమా ప్రయాణం ఆపేందుకు ఆ అడ్డు బాగా పనికొస్తుందనుకున్నాడు.

"వాటికి మనం కాపలా వుండక్కర్లేదు... పక్క-వాటావారికి చెప్పి వెళ్లచ్చు..." అంది అన్నపూర్ణ.

"మరి సినిమా చూసొచ్చేక ఈ మూటలని క్రిందకు చేర్చాలికదా"

"ఫరవాలేదు చేర్చచ్చు" అంది కామేశ్వరి.

ముగ్గురూ ఒంటిగంటకు సినిమాకు బయలుదేరారు.

సినిమా మధ్యలో నాలుగ్గంటలకు కరెంటు పోగా, పదినిముషాలు ఆగి జనరేటర్ సాయంతో మిగిలిన భాగం పూర్తిచేశారు.

"సినిమా వదిలేసరికి అయిదు ఇరవై అయింది. ఈలోగా జనం బయటకు వెళ్ళే వీలులేకుండా హెూరున...గాలి...వాన.... ఎలా పడితే అలా వుంది. రామారావు ఆలోచన డాబామీద ఆరపెట్టిన పప్పుల మీద వుంది. ఎలా ఉందో అక్కడ?

"ఈ నగరంలో వానలని నమ్మకూడదు. పక్కవీధిలోనే చినుకులు పడవు. వారికి ఈ వానగురించి ఈ వీధివాడు చెప్పేవరకు తెలియదు". భర్త భయాన్ని గ్రహించినట్లుగా అంది అన్నపూర్ణ.

రామారావు ఆకాశంవైపు చూశాడు. నల్లటి మేఘాలు దట్టంగా జట్లుగా పరుగెడుతున్నాయి. ఇది వడగళ్లవానగా మారినా మారవచ్చు.

నేలమీద చిన్నచిన్న మంచుముక్కలు బంతుల్లా ఎగిరెగిరిపడుతున్నాయి కూడాను. చీకటి వెలుగుని కమ్మేసింది.

"మన ఇంటిదగ్గర ఇలాగే వర్షం వుంటే" భార్యవైపు చూస్తూ అన్నాడు రామారావు.

"కాసేపు నోరుమూద్దురూ...ఏదో సామెత చెప్పినట్లుగా...పక్కవాళ్ళకు చెప్పాంకదా...అంతగాఅయితే వాళ్ళు జాగ్రత్తచేస్తారు. వాళ్ళు బయటకువెళ్ళినప్పుడు మనం వాళ్ళబట్టలు తీయడంలేదూ...కుళాయినీళ్ళు పట్టడంలేదూ...పాలపాకెట్లు తీసివ్వటంలేదూ...చాకలి తెచ్చినబట్టలు తీసుకోటంలేదూ..." అన్నపూర్ణే బదులిచ్చింది.

"ఆపనులూ ఈపనులూ ఒకటేనా...ఆమూటలు కిందకుచేర్చటం మాటలా...అయినా ఎక్కడపెడతారు. తాళంచెవి ఇచ్చేవా...హఠాత్తుగా వచ్చేసిందే...పేపర్లు, రేడియో, టీవీ.లో ఈవిషయం ప్రస్తావించలేదే..." రామారావుకి భయంగా ఉంది.

దగ్గరిళ్ళవాళ్ళు వానలోనే తడుస్తూవెడుతున్నారు. థియేటరు ఆవరణ నీళ్ళతో నిండిపోయింది. రిక్షాలు, ఆటోలు కనుచూపుమేరలో కనిపించటంలేదు. అన్నపూర్ణకి ధైర్యంగావున్నా రామారావుకి మాత్రం భయంగాఉంది. గాలి, వాన పోటీపడుతున్నాయి. కరెంటు ఎప్పుడొస్తుందో...

టైము ఆరున్నరదాటింది.

అలసిపోయిన వరుణుడు, వాయుదేవుడు ఊపిరికోసంకాబోలు సద్దుమణిగారు.

ముగ్గురూ బస్టాప్‌చేరారు.

సిటీబస్సులు ఒకటీ అరా వస్తున్నాయి. రోడ్డుమీద నీళ్ళు సముద్రంపొంగినట్లుగా ప్రవహిస్తున్నాయి.

మరో అరగంటకు ఇల్లుచేరారు.

రామారావు హడావిడిగా డాబామీదకు పరుగెత్తాడు...డాబా శుభ్రంగాఉంది. ఆరపెట్టిన గోతాములుకూడా లేవు, గాలికి ఎగిరిపోయాయి. వానధాటికి పప్పులన్నీ తూములగుండా డ్రైనేజీలోకి ప్రవహించాయి...రామారావు షాక్‌తిన్నాడు. అన్నపూర్ణకి భయంవేసింది...భర్త రియాక్షను ముందేతెలుసు...రెండువేల రూపాయలు నీటిపాలు...అప్పుమిగిలింది...అతని కళ్ళ ముందు బ్యాంకులో కట్టవలసిన సొమ్ము-వడ్డీ కనిపిస్తున్నాయి.

రామారావు భార్యమీద మండిపడ్డాడు. విరుచుకుపడ్డాడు. కసితీరాతిట్టాడు. తిట్టినతిట్టు తిట్టకుండా కొత్తతిట్లకోసం చూసాడు. కామేశ్వరికి తండ్రికోపం మరోసారి కనపడింది.

ఎప్పుడో నిద్రపోయారు ఆ త్రిమూర్తులు.

★ ★ ★

మామూలుగానే తెల్లవారింది.

రామారావు యధాలాపంగానే నూతిదగ్గరకెళ్ళాడు— ముఖం కడుగుతూ ఆశ్చర్యపోవటం అతని వంతయింది.

రెండునెలలక్రితం ఎండిపోయిన బావి ఇప్పుడు నీళ్ళతో నిండివుంది. అప్పుడు ఆబావిని పూడ్చివేయాలో పూడికతీయించాలో అర్థంకాక అలాగేవుంచాడు. బోరింగు వేయించేఆలోచన అతనికి లేనేలేదు. అదివేలల్లో అయ్యేపని! ఎటూతోచని పరిస్థితిలో బావిని పట్టించుకోలేదు...కాని ఇప్పుడు గంగాదేవి నూతిలో కాపురంపెట్టింది...ముప్పయ్అడుగుల నూతిలో ఎంతలేదన్నా ఇరవైఅడుగులు ఉంటాయి నీళ్ళు.

అన్నపూర్ణకు భర్తని చూడటం భయంగా

వుంది. ఎంతవర్షం పడిందో ఆమె గ్రహిస్తోంది...

డబ్బుకావాలంటే అప్పుయిస్తారు. కరెంటు పోతే కిరసనాయిలుతో దీపం పెట్టుకోవచ్చు. కాని నీళ్ళులేకపోతే ఎలాగ! ఎవరిస్తారు నీళ్ళు! ఈనీటిసమస్య అంటువ్యాధిలా పట్టుకుంది. అందరికీ తలనొప్పిగా తయారయింది. సృష్టిలో ఋతుక్రమం మారిందేమో అన్నట్లుగా...భగవంతుడి లీలలు ఎన్నో...కాస్త తుంపర పడితేనే తిట్టుకునే మనస్తత్వం మనది! ఎంత ఎండనైనా భరించవచ్చునేమో... తాత్కాలికంగా ఇబ్బందిపెట్టే ఈవానలు ప్రకృతి ప్రసాదించిన జలాశయాలు... సూర్యుడి ప్రతాపాన్ని తట్టుకోలేక భూమాతా ఎండిపోయింది. ఫలితంగా పశుగ్రాసం కొరవడింది... ఇప్పుడు ఈవానతో మరికొంతకాలం ప్రజలు, పశువులు దప్పిక తీర్చుకోవచ్చు...

రామారావు అన్నపూర్ణవైపు చూశాడు.

పెట్టుబడి నష్టమైనందుకు కలిగినకోపం-బాధ ఇప్పుడు భర్తలో కనిపించలేదామెకు. బావినిండానీళ్ళున్నాయన్న ఆనందం, సంతోషం రామారావు కళ్ళల్లో కనిపించింది. ఎన్నోనెలల తరువాత నూతిలో బాల్చీవేసి నీళ్ళుతోడే అవకాశంగా భావించింది.

రామారావు భార్యతో అన్నాడు- "కోర్టులో కేసుపోయినా 'లా' తెలిసింది. అలాగే వప్పులు వానకు కొట్టుకుపోయినా బావిలో బోలెడు నీళ్ళొచ్చాయి...మళ్ళీ అప్పుచేసి నీకోరిక తీర్చుస్తాను."

కామేశ్వరి తండ్రివైపు ఆశ్చర్యంగా చూసింది.



వినుగుచెందిన విక్రమార్కుడు శవాన్ని భుజానవేసుకుని చెట్టెక్కి ఏంచేశాడోకాని, నాలుగోసారి ఓ కొత్త డ్రైక్లీనింగు షాపుకి కామేశ్వరి నీలం అంచు ఎర్రపట్టుపరికిణీ సంచిలోపెట్టుకుని బయలుదేరాడు రామారావు. ఆ పరికిణీ వయసు ఏడాదే. ధర అయిదువందలు. ఇంతవరకూ మూడునాలుగుసార్లకంటే ధరించలేదు ఆమె. ఆమధ్య ఎదురింటివారి అమ్మాయి పెళ్ళికి వెడుతూ తీసుకెళ్ళింది. తిరిగి యిస్తూ "సారీ ఆంటీ... పరికిణీమీద నూనె మరకలు పడ్డాయి. డ్రైక్లీనింగ్‌కి వేసిస్తాను. ఎలా పడ్డాయో తెలియదు" అంది. ఎదుటివారి వస్తువుమీద ఎవరికైనా ఎందుకని జాగ్రత్తవుంటుంది. ఈ విషయం తెలిసి అన్నపూర్ణని కేకలేసాడు రామారావు- "ఎవరైనా పట్టుబట్టలు, బంగారు నగలు అరువుయిస్తారా- చూశావుగా ఇప్పుడు ఏం జరిగిందో... ఇచ్చినదానికి ఓసారి తూర్పుకి తిరిగి దణ్ణంపెట్టి నువ్వులు-నీళ్ళు దానమిస్తే సరి" అంటూ.

"ఇస్తే ఏమయిందండీ... అరిగిపోతుందా, కరిగిపోతుందా" అంది అన్నపూర్ణ.

"ఏమీపోదు... జేబులో డబ్బేగా పోయేది. అయినా యింత ధరపెట్టికొని యితరులకివ్వటంలో అర్థంలేదు. పొరపాటయినా అది మనకు నష్టం కలిగించలేదా... ఇప్పుడా మరకలు పోకపోతే ఏంచేయాలి?"

"ఆనోటిని కాస్త కట్టిపెట్టండి... మీచేతులతో ఏదీ కొనాలని వుండదు. పోనీ కొంటే సవాలక్ష వ్యాఖ్యానాలు... అందుకే యిలా మరకలు పడ్డాయి. ఏడుస్తూ వ్యవసాయం చేస్తే కాడి విరిగిందట... అలావుంది మీతీరు" అన్నపూర్ణ గొంతులో మార్పులేదు.

కామేశ్వరి మాత్రం రెండుమూడు రోజులు ఏడుస్తూ కూర్చుంది. అక్కడికీ యివ్వద్దని ఆరోజే తల్లితో చెప్పింది. కాని అన్నపూర్ణ పట్టించుకోకుండా ఎదురింటివారి అమ్మాయి అడగ్గానే యిచ్చేసింది.

ఆ ఒక్కనెలలోనే మూడుచోట్ల వాషింగుకిచ్చాడు రామారావు. ముప్పయ్‌రూపాయలు వదిలాయికాని మరకలు మాత్రం పోలేదు. ముచ్చటపడి కొనుక్కున్న పరికిణిని చూస్తుంటే కామేశ్వరికి గుండె చెరువయిపోతోంది.

"అణన్నర డ్రైక్లీనింగు షాపుల్లో యిస్తే మరక

లు పోవు. పదిరూపాయలు ఎక్కువయినా మంచి షాపులో యివ్వండి'' అంటూ నాలుగో సారి చెప్పింది అన్నపూర్ణ.

అప్పుడు రామారావుకి కోపం నషాళానికి ఎక్కింది. ''పిచ్చిపిచ్చిగా అరవకు. నేనేం చేసినా ఆలోచించే చేస్తాను. ఆ షాపువాళ్ళు డబ్బుతీసుకుని సరిగా వాష్ చేయకపోతే అణ న్నర షాపులకిందే లెక్కా... అయినా అడిగినవాళ్ళందరికీ దానాలు చేయడానికి మంత్రిపదవులూ, పార్టీ టిక్కెట్లూనా! డబ్బూపోయి శనిపట్టినట్లుగా అయింది''

''మీసంగతి నాకు తెలియదా... చవకబారుగా ఏంవస్తుందాని చూస్తారు. ఈసారి వాష్ వెల్ డ్రైక్లీనర్సులో యివ్వండి. వాళ్ళు డబ్బు ఎక్కువ తీసుకున్నా శుభ్రంగా, నీట్‌గా వాష్‌చేస్తారుట. ఆషాపులోకి పట్టుగుడ్డలే ఎక్కువగా వస్తుంటాయిట... మనకాలనీలో చాలామంది చెప్పారు'' అని ఉచిత సలహాపారేసింది అన్నపూర్ణ.

రామారావు మరోసారి విసుగుచెందిన విక్రమార్కుడి అవతారం ధరించాడు. వాష్‌వెల్ డ్రైక్లీనర్స్ నగరంలో పెద్దషాపు. ఛార్జీలు ఎక్కువైనా ఎవరూ లెక్కచేయకుండా వెడుతుంటారు. అచ్చటి సిబ్బంది నిర్లక్ష్యంగా, విసుగ్గా మాట్లాడినా- ఈ సోకాల్డు వైట్‌కాలర్డు పెర్సన్సు టేకిట్ ఈజీ లెవెల్లో సర్దుకుపోతారు.

టైము పదిగంటలు అయింది.

ప్రొప్రయిటరు దేవుడికి దీపంవెలిగించాడు. అగరబత్తులు వెలిగించి హారతి కర్పూరం కూడా హారతి యిచ్చాడు. ఫానువేసి కాష్ కౌంటరులో కూర్చున్నాడు.

రామారావు పట్టుపరికిణీ ప్రొప్రయిటరుకిచ్చాడు.

లుంగచుట్టి లోపలకు విసిరేసాడు ప్రొప్రయిటరు.

రామారావు మనసు చివుక్కుమంది ''ఒసారిలా యివ్వండి'' అన్నాడు. బోయ్ తెచ్చి యిచ్చాడు.

''పరికిణీ మీద ఈ నూనె మరకలు పోతాయా'' అని అడిగాడు.

''మీరు ప్రత్యేకించి చెప్పక్కర్లేదుసార్... వర్కుషాపుకి పంపేముందు మేము అన్నీ చెక్ చేసి-అవసరమైన వాటి విషయంలో స్పెషల్‌గా నోట్‌రాసి కేర్ తీసుకోమని చెప్తాము'' అన్నాడు ప్రొప్రయిటరు బిల్లుపుస్తకం తీస్తూ.

''ఇంతకీ ఆ మరకలు పోతాయా? ఇప్పటికి మూడుసార్లు వాష్‌చేయించాను. ఫలితంలేక పోయింది''

''ఇటువంటి మరకల విషయంలో గ్యారంటీ వుండదు. కెమికల్సు ఉపయోగించి చూస్తాము. మాప్రయత్నలోపం ఏమీ వుండదు. మూడునాలుగు సార్లు మాకే ఇచ్చి చూడండి... అప్పటికి పూర్తిగా పోవచ్చు'' చెప్పాడు ప్రొప్రయిటరు గర్వంగా నవ్వుతూ.

''దాని ఖరీదు అయిదు వందలు'' చెప్పాడు రామారావు.

''అయిదొందలయినా అయిదురూపాయలయినా మాకు ఒకటేసార్... నలభై ఏళ్ళనుంచి మా షాపు ఇలా నిలబడగలిగిందంటే అది మా పనితనం, ప్రత్యేకత అని గొప్పగా చెప్పుకోనవసరంలేదు... మీరు నిశ్చింతగా వుండండి''

రామారావు ఆలోచనలో పడ్డాడు ఇవ్వాలా వద్దా అని. ఆ విషయమే అడిగాడు షాపు యజమాని.

''మరకలు పోకపోతే ఎందుకు వాష్ చేయించటం... డబ్బు దండగ'' చికాగ్గా అన్నాడు రామారావు.

ప్రొప్రయిటరు నవ్వేశాడు- ''మనిషి జీవితానికే గ్యారంటీలేదు. అటువంటిది ఆఫ్టరాల్ మనిషి తయారుచేసే బట్టలకు ఏమిటి గ్యారంటీ... సిరా, మట్టి మరకలు అయితే ఎలాగైనా పోగొట్టవచ్చు... ఈ నూనె మరకలు ఎలా సార్! అంతా కల్తీనేకదా... అయినా ప్రయత్నించకుండా ఎలా చెప్పేది?''

''అప్పుడు పోతాయా?''

''పోతాయిసార్.''

''ఒకవేళ పోలేదనుకోండి... ఏంచేయాలి?''

''డైయింగు చేయిస్తే సరి'' తేలిగ్గా అనేశాడు ప్రొప్రయిటరు. రామారావుకి భార్యమీద కోపంగా వుంది. తాను ఎన్నోసార్లు చెప్పాడు- ఇంత ధరపెట్టి పట్టు బట్టలు కొనవద్దని, రోజూ ధరించేందుకువయోగపడవని, వాష్ చేయడం కష్టమని, చిరుగుపడితే బాధనీ, జరీని

# మీ బిడ్డల భవిష్యత్తును గురించికాక
# మీ ఆరాటం వేరేముంటుంది!



# మార్గదర్శి

మీ బిడ్డల భవిష్యత్తు తీర్చిదిద్దడానికి తలపెట్టే ప్రయత్నంలో ఆచితూచి అడుగువేయాలి. అందుకు లాభప్రదమైన సంస్థలో మీ డబ్బు పెట్టుబడి పెట్టండి. మీరు నిశ్చింతగా ఎంచుకోదగ్గ సంస్థ మార్గదర్శి ఒక్కటే.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధతకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 5000 | 50 | 2,50,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పియన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూరోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావ్‌పేట, ఏలూరు.
- ఆర్.ఆర్.స్ట్రీట్, నెల్లూరు.

**డబ్బుకోసమేనా మీ చింత!**
**మార్గదర్శి ఉన్నది మీ చెంత!!**

మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు:
ఆబిద్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

లవదని... ఆ ధరతో నాజూగ్గా అందంగా వుండే గుడ్డలు కొనుక్కోమనీ అన్నపూర్ణ వింటుందా... (ప్రొప్రయిటరు బిల్లు రాశాడు)

"పదహారురూపాయలా" బిల్లువైపు చూస్తూ అడిగాడు రామారావు.

"అవునుసార్... మాదగ్గర అంతా స్పెషలైజుడు వాషింగు. మాషాపు ఎక్స్‌పర్ట్స్. పైగా ఫారిను మెషీన్లు... మేము పేరున్న కంపెనీ తయారీల కెమికల్స్, పౌడర్లు వాడతాము. ఇదంతా మావాషింగు చూసేక మీరే తెలుసుకుంటారు" అని బిల్లు చింపి ఇచ్చాడు ప్రొప్రయిటరు.

రామారావు బిల్లు తీసుకుని వెళ్ళిపోయాడు.

అయిదోరోజు షాపుకెళ్ళాడు రామారావు.

షాపులో కుర్రాడు పరికిణీవున్న ప్యాకెట్టు డెలివరీ చేశాడు. రామారావు పరికిణీ బయటకుతీసి మరకలు పరిశీలించాడు. తేడా లేదు.

"ఏమిటి... మరకలు పోలేదు" అని అడిగాడు వెంటనే.

"ఎంతో ట్రైచేసాం సార్... ఈ ఒక్కదానికే మూడు గంటలుపట్టింది. పైగా మాకు నలభై రూపాయలు ఖర్చుఅయింది. అయితే బిల్లులో రాసిందే తీసుకుంటున్నాం. ఏం చేస్తాం... వ్యాపారంలో అప్పుడప్పుడు ఇటువంటి ఎదురుదెబ్బలు తప్పవు. కష్టమర్ల తృప్తే మాకు ముఖ్యం" అంటూ పాక్‌చేసిచ్చాడు ప్రొప్రయిటరు.

"మరి దీనిగతి ఏమిటి... మరో నాలుగైదుసార్లు మీ షాపుని దర్శించాలా?" వెటకారంగా అన్నాడు రామారావు.

"మరో రెండుసార్లు యివ్వండి... అప్పటికీ పోకపోతే డైయింగు చేయించండి... ముప్పయ్ రూపాయలు అవుతుంది. కొత్త పరికిణీలా మెరిసిపోతుంది... అయినా యిప్పట్నుంచే ఎందుకు భయం..." నచ్చచెప్తున్న ధోరణిలో చెప్పాడు ప్రొప్రయిటరు.

రామారావుకి మరోసారి భయం— కంగారు పట్టుకుంది.

డ్రైక్లీనింగు అంటే ఖరీదైనది. ఏవస్తువైనా కావాలనుకోడంలో తప్పలేదు. కాని దాన్ని పదికాలాలపాటు కాపాడుకోడంలోనే తెలివి, నేర్పు వుండాలి. అన్నపూర్ణ మూడేళ్ళక్రితం కొన్న పట్టుచీర— పదిహేనొందలుపెట్టి కొన్నది— పెట్టెలోపడి కుంభకర్ణుడి నిద్రపోతోంది— దానిమీదకూడా ఏవో మరకలుపడటంతో.

రెండునెలల తరువాత అన్నపూర్ణ, కామేశ్వరి పెళ్ళికి వెళ్ళారు. రెండురోజుల తర్వాత తిరిగివచ్చారు. ఆ రోజు సాయంత్రం వారు వచ్చీరాగానే చూసినవి పట్టు పరికిణీ... పట్టుచీర. మరింత ఆశ్చర్యపరచింది. వాటిమీద మరకలు లేకపోవడమే...

"ఏ షాపులో యిచ్చారు" కళ్ళు పెద్దవిచేసుకుని అడిగింది అన్నపూర్ణ, కామేశ్వరివైపు చూస్తూ.

"హొటల్లో అడ్డమైన గడ్డిపెట్టి కష్టమర్లని దోపిడిచేస్తున్నవాళ్ళున్నారు. ఫలితంగా న్యాయం, నీతి మరుగునపడిపోతున్నాయి. డబ్బే మనుషులని శాసిస్తోంది" అన్నాడు రామారావు.

"ఈ నుత్తి రోజూవుండేదే... ఇంతకీ అసలు విషయం ఏమిటి?" అడిగింది అన్నపూర్ణ.

"పాలకులకు ప్రజల సమస్యలు పరిష్కరించడం కష్టమేమీకాదు. కాని పట్టించుకోరు. పట్టించుకుంటే తమ ఉనికి, పోస్టు ఏంకావాలి. అలాగే డాక్టర్లు పేషంట్లను పదిసార్లు తిప్పించుకుని ఏవో మందులిచ్చి పంపేస్తారు తమ ఫీజులకోసం. కాబట్టి సమాజంలో ఎవరికివారు ఎదుటివాడిని దోపిడీచేసేందుకే ప్రయత్నిస్తున్నారు. చిత్తశుద్ధితో వ్యవహరించటం లేదేమోననిపిస్తుంది"

భర్త ధోరణికి అడ్డుపడింది అన్నపూర్ణ "బి.పి. పెరిగిందా" అని ప్రశ్నించింది.

"వాష్‌వెల్ డ్రైక్లీనర్స్ వంటివి ఎన్నోవున్నాయి. కాని వాళ్ళు నిజంగా శుభ్రపరిస్తే— వారి దగ్గరికెవరు వెడతారు! పదిసార్లు తిప్పించుకోవాలంటే కొన్ని పక్కదారులుపట్టి, మాటకారితనంతో వ్యవహరించాలి" చెప్పాడు రామారావు.

"నిజంగానే మీకు బి.పి. పెరిగింది... వెళ్ళి డాక్టరుని సంప్రదించండి" అంది అన్నపూర్ణ చికాకు ప్రదర్శిస్తూ.

"అవును... నాది బి.పి.వాగుడే. నీలాటివాళ్ళు వందలు, వేలు తగలేసి బట్టల షాపులను పోషిస్తుంటే, నాలాటి బి.పి. మొగుళ్ళు డ్రైక్లీన

ర్సు చుట్టూ కుక్కల్లా తిరిగి వాషింగుఛార్జీల నిమిత్తం డబ్బు తగలేస్తూ వుంటారు...'' అన్నా డతను మరింత చికాగ్గా.

అన్నపూర్ణకు భర్తధోరణి కొత్తకాదుగా...

రామారావు ''క్లీన్‌వెల్'' వాషింగు పొడరు తెచ్చి భార్యకు చూపించాడు ''ఇదే మీ బట్ట లని శుభ్రపరచింది'' అంటూ.

''ఎంత?''

''నలభైరూపాయలు— అరకిలో ప్యాకెట్''

''ఎందుకు కొన్నారు- యింత ధరపెట్టి''

''బుద్ధిలేక...'' అన్నాడు అతను.

''అది కనిపిస్తూనేవుంది'' అంది అన్నపూ ర్ణ.

ఆ వ్యవహారం అలాముగిసింది.

అయితే, ఓ విషయం అప్పటికే దాచాడు రామారావు. ఇంట్లోదాచిపెట్టిన ఏడెనిమిదిర కాల బట్టలసబ్బు ముక్కలను తురిమి, కొద్దిగా బ్లీచింగు పొడరు, నీలిమందు కలిపి ''కిచిడీ'' చేసాడు. ఆ పొడరే యిలా ఉపయోగించాడు

★ ★ ★

ఒకరోజు—

రామారావు ఇంటికొచ్చేనరికి ఏడున్నర యింది. ఆఫీసులో ఏదో పార్టీవుంటే ఉండిపో యాడు. ఇంటికొస్తుంటే దారిలో ఓ ఫ్రెండు కనిపించి ఓ అరగంట ''క్లాసు'' తీసుకున్నా డు. ఇంకా కొంచెంసేపు కాలక్షేపం చేద్దామను కున్నాడు కాని ఇంటిదగ్గర అన్నపూర్ణకు భయ పడి బయలుదేరాడు. ఆమెకు అన్నీ అనుమా నాలే. ఓ పట్టాన నమ్మదు. నమ్మకంచాటున ఊహకందని సందేహాలు.

గేటుతీసి లోపలకువచ్చి సైకిలు స్టాండువే సాడు రామారావు. తలుపుతీసి బయటకొ చ్చింది కామేశ్వరి. మామూలుగా అయితే కామే శ్వరికి వెనకాల నిలబడివుంటుంది అన్నపూర్ణ. ''అయిందా ఆఫీసువని... కొంపలకందరూ దయచేసారా... మీరింక ఇంటికెళ్ళిపోండి, మేము కిటికీలు మూసి, కరెంటు ఆఫ్‌చేయాలి అన్నారా నైట్‌వాచ్‌మన్లు!'' అంటూ నిజానికి అది పలకరింపుకాదు కేవలం ఎత్తిపొడుపు.

కాని ఇప్పుడు అన్నపూర్ణ కనిపించలేదు.

పైగా కామేశ్వరి ముఖంలో ఏదో విచారం కనిపించింది.

''మీ అమ్మలేదా... ఆవిడగారికింకా నుత్తికొ ట్టడం పూర్తికాలేదులావుంది. ఈ వేళ డైరీలో ఇంకా కొన్ని ఇళ్ళు మిగిలిపోయాయి కాబో లు...'' అంటూ లోపలికొచ్చాడు రామారావు.

''మంచినీళ్ళు కావాలా?'' అంటూ అడి గింది కామేశ్వరి.

''వద్దులే'' అంటూ వంచెకోసం చూడసాగా డు అతను.

పెరట్లోనుంచి తెచ్చి ఇచ్చింది తను.

''పెరట్లోనుంచి బట్టలు కూడా లోపల పె ట్టేంత తీరుబడిలేదా ఆ రాణీగారికి'' అంటూ విసుక్కున్నాడు— వంచె అందుకుంటూ.

కామేశ్వరి కాఫీ, టిఫిను తెచ్చి ఇచ్చింది.

''ఇప్పుడు మీ అమ్మ ఎవరింట్లో నుత్తికొడు తూ ఉంటుంది'' టిఫినుచేస్తూ అన్నాడు రామారావు.

''అమ్మ నరసాపురం వెళ్ళింది''

రామారావుకు ఉప్మాగొంతులో అడ్డుపడింది.

''ఏమిటి... ఊరెళ్ళిందా... ఎందుకు...''

''వాళ్ళ మామయ్య పోయాడుట... పెద్దమ్మ వాళ్ళకి టెలిగ్రాం వస్తే ఇక్కడకొచ్చి చె ప్పిందట పెద్దమ్మ... వెంటనే ఇద్దరూ బయలు దేరి వెళ్ళారుట...'' కామేశ్వరి చెప్తోంది.

''అంటే నీకూ తెలియదా?''

''నాకు ఈవేళ ప్రైవేటుక్లాసుంటే ఇంటికొ చ్చేనరికి ఆలస్యం అయింది. ఆంటీ తా ళంచెవి ఇచ్చి ఇలా అని చెప్పారు''

రామారావు ఆలోచిస్తున్నాడు. ఎందుకింత తొందరపడింది తను! కనీసం మొగుడుతో నైనా చెప్పనవసరంలేదా... అయినా వీళ్ళు నరసాపురం వెళ్ళేసరికి ఏటైమవుతుందో... అంతవరకూ శవాన్ని ఉంచుతారా... వీళ్ళుచే సేదీ, ఉద్ధరించేదేముంటుంది! ఊరికే అటెండెన్సు వేయించుకొనేదేకాక మరే ముంటుంది! పదోరోజునాటికి వెళ్ళచ్చుకదా...

''మళ్ళీ ఎప్పుడొస్తానందిట?'' అడిగాడు రామారావు.

''పదకొండోరోజు అయ్యేక వస్తుందిట''

''మరి మీ మామయ్యకూడా వెళ్ళాడా?''

''లేదు... సెలవులేదుట... పైగా వాళ్ళకుక్క



పిల్లకు విరోచనాలుట.వారంరోజులపాటు ఆసుపత్రికి తీసుకెళ్ళి మందు ఇప్పించాలిట...''

''నువ్వు వాళ్ళింటికెళ్ళావా?'' అడిగాడు రామారావు.

''వెళ్ళాను, అత్తయ్య చెప్పింది''

''ఇంకా ఏమైనా చెప్పిందా మీ అత్తయ్య... వాళ్ళు ఎప్పుడు వెడతారు''

''బహుశా వెళ్ళకపోవచ్చునట... మామయ్య రిజర్వేషనులేకుండా ప్రయాణం చేయలేడుట... పదోరోజుకైనా రిజర్వేషన్ దొరికితే వెళ్ళాలనుకుంటున్నాడుట. అదైనా సెలవు దొరికి— అవ్వు లభిస్తే...'' కామేశ్వరి చెప్తోంది.

అంటే చివరిఘడియల్లో తనకు రిజర్వేషను కూడా దొరకాలన్నమాట... భలేవాడే... రామారావు ఆలోచిస్తున్నాడు. అన్నపూర్ణకిదేం పట్టదు. మొగుడు, పిల్లలు, ఇల్లు ఏమీ అవసరంలేదు. కనీసం చెప్పడంకూడా చేయదు... ఆమె దృష్టి ఎప్పుడూ 'అటే'గాని 'ఇటు' ఉండదు. ఏవిషయం తెలిసినా, చెప్పినా టెలిగ్రాం వచ్చినా ప్రయాణం అవుతుంది. ఇంకేమీ ఆలోచించదు. డబ్బు గురించి అసలే పట్టించుకోదు. డబ్బులేకపోయినా అప్పుచేసి మరీ బయలుదేరుతుంది. సరిగ్గా ఈ విషయంలోనే ఆ దంపతులిద్దరూ ఘర్షణపడుతుంటారు.

"దేవుడు మనకు ఆలోచనాశక్తి ఇచ్చాడు.



అంతోఇంతో చదువుకున్నాం. ముందూవెనుకా ఆలోచించాలి. ఏది అవసరం, ఎంతవరకూ అవసరం అనికూడా బేరీజు వేసుకోవాలి. తెలీక పోతే చెప్పినట్లు చేయాలి. లేదంటే ఎదుటివా రినిచూసి నడచుకోవాలి'' అని ఎన్నోసార్లు చెప్పాడు రామారావు.

"మీరు నోరుమూసుకొని కూర్చోండి. మీరు ఇటువంటి విషయాల్లో తలదూర్చకండి. నాకు మీకంటే బాగానే తెలుసు'' అంటూ కేసు కొట్టేస్తుందామె తపీమని.

ఆ మానవుడి నోటికి పెద్ద తాళం పడు తుంది వెంటనే.

రామారావుకి హఠాత్తుగా ఏదో గుర్తుక చ్చింది. అంతే... బీరువాదగ్గరకెళ్లాడు అప్పుతె చ్చిన డబ్బులో ఏమాత్రం మిగిల్చిందోనని భయంపట్టుకుంది. అతను నాలుగురోజుల క్రితం ప్రావిడెంటుఫండులోనుంచి మూడువే లు అప్పుతెచ్చాడు. అందులో వెయ్యిరూపాయ లు ఎవరికో అప్పుతీర్చాలి. మిగిలిన రెండువే లుపెట్టి కొంపకు రంగులు వేయించాలని ఉద్దేశం. కొంపకట్టి పదేళ్ళుదాటింది. ఇంతవ రకూ రంగులమాట దేవుడెరుగు-కనీసం సు న్నంకూడా వేయించలేదు. కాలనీలో చాలా మంది తనతోపాటు ఇళ్ళుకట్టినవాళ్ళు మూడు నాలుగుసార్లు డిస్టెంపర్లు వేయించారు. మొద టిఅంతస్తు కూడా వేసినవాళ్ళూ వున్నారు. కాని తనఇల్లు అలాగే మిగిలిపోయింది. చిన్నచిన్న పనులుకూడా కొన్ని మిగిలిపోయివున్నాయి.

ఇలా ఎందుకు జరుగుతోంది!

ఎవరు దీనికి బాధ్యులు!

తనా...అన్నపూర్ణా...గ్రహచారమా? తన పొదుపరితనం ఆమెదృష్టిలో పిసినారిగా... చె ప్పబడుతోందా? అనవసరపు ప్రయాణాలు...ప నికిరాని భేషజాలకారణంగా అన్నపూర్ణ ఎందుకు అంతంత ఖర్చుచేస్తోంది...తన జీవితం ఇలాగే తెల్లవారవలసిందేనా...

ఎందుకీజీవితం...

ఎందుకీ దిక్కుమాలినబతుకు...

ఎవరిని ఉద్ధరించాలని...

ఒకరూపాయి ఖర్చుచేయటం చాలాక ష్టం...రూపాయికి విలువలేకపోవచ్చు. కాని ఆ రూపాయి చాటున ఎంతోకష్టం వుంది, శ్రమ వుంది...చెమట కరుగుతుంది...ఆయాసం కలుగుతుంది. ఖర్చుపెట్టే చేతికీ, సంపాదించే చేతికీ ఎందుకింత వ్యత్యాసం? అన్నపూర్ణ తన అన్నయ్యల్లాగా భవిష్యత్తుగురించి ఎందుకు ఆలోచించదు! ఒకతల్లితండ్రికి పుట్టిన పిల్లల్లో ఏమిటా తేడాలు...ఏమిటీ భేదం...

బీరువాలో వున్న డబ్బు లెక్కపెట్టాడు. అందులో అయిదువందలు తక్కువవుంది. అంతే... అన్నపూర్ణ కళ్ళు ఈ డబ్బుమీద పడ్డాయన్నమాట...తను హతాశుడయ్యాడు.

కామేశ్వరి వంటకుపక్రమిస్తోంటే వారించా డు రామారావు- "నేను చేస్తాలే...నువ్వు చదువు కో'' అంటూ.

"ఎంతసేపు నాన్నా...ఓగంటేకదా'' అంది తను.

రామారావు మాట్లాడలేదు. మంచంమీదవ డుకుని పైకప్పువైపు చూస్తున్నాడు. గోడలకు అక్కడక్కడ బూజు వేలాడుతోంది. సిమెంటు గోడలు నల్లబారివున్నాయి. మసకబారి పాత రంగుని పులుముకున్నట్లుగా వుంది. తాను పుట్టి నరకంలోపడ్డాడా...చదివి పాతాళంలోకి కుంగిపోయాడా...పెళ్ళిచేసుకుని కష్టాలని కోరి తెచ్చుకున్నాడా...'ఆమె'ను పొందలేక అన్నపూ ర్ణని గతిలేక పెళ్ళాడేడా...ఈ దాంపత్యజీవితం ఇంత ఘోరంగా వుంటుందనుకుంటే ముందే మరోవిధంగా జాగ్రత్తపడేవాడేమో...

నగరజీవితం...పెరిగేధరలు...అదుపులేని ఖర్చులు...వచ్చేపోయేవాళ్ళు... వారికి తిండీతి ప్పలు...బహుమతులు...రామారావుని అప్పుల జీవితానికి దగ్గరచేర్చింది.

టైము ఎనిమిదిగంటలయింది.

కామేశ్వరి తండ్రిని భోజనానికి పిల్చింది.

ఈ నగరానికి రాకుండా వుండవల సింది-అని ఎన్నోసార్లు అనుకునేవాడు రామా రావు. ఈ విషయంలో అన్నపూర్ణనికూడా సంప్ర దించినా ప్రయోజనం లేకపోయింది. "మా రెండో అన్నయ్య వున్నాడక్కడ. రెండో అక్క కూడా వుంది. వాళ్ళున్నారని మానాన్న కూడా అక్కడికే ట్రాన్సఫరుచేయించుకోమంటున్నా డు. మనకే అవసరంవున్నా వాళ్ళు చూస్తారు'' అంది ఆరోజు ట్రాన్సఫరు వచ్చినపుడు. అంతే... భార్యమాటకు విలువనిచ్చాడు రామా రావు.

అయితే గడిచేరోజులు వాస్తవాన్ని ఒక్కొక్కటే బయటపెట్టసాగాయి. అన్నపూర్ణ అనుకున్నంత సీదాసాదా మనిషికాడు వాళ్ళ రెండోఅన్నయ్య.. తనఇంటికి ఎవరొచ్చినా ముఖం సీరియస్సుచేసుకోడం...కాఫీఖర్చు అవుతుందని, పిల్లల చదువు డిస్టర్బు అవుతుందని, భార్య కుట్టుపనులకు అంతరాయం కలుగుతోందని ఇంట్లోకూర్చుంటే బాగుండదని రకరకాల పద్ధతులద్వారా వ్యతిరేకత చూపించసాగాడు. తాను వాళ్ళింటికి వెళ్ళకపోతే వాళ్ళూఅది గ్రహించి, తన ఇంటికి రారని ఓ కొత్త మంత్రాన్ని తరచు మాటల్లో ప్రయోగించేవాడు.

ఈ విషయాలని మరింత వివరంగా భార్యకు అర్థమయ్యేలా చెప్పేవాడు రామారావు.

"వాడి పద్ధతి అంతే. అదేం పట్టించుకోవద్దు" అని కేసు కొట్టిపారేసేది అన్నపూర్ణ తరచు.

'నీ ఖర్మ- నువ్వే తెలుసుకుంటావు' అని వూరుకునేవాడు అతను. ఆమెకూడా అన్నయ్య వుద్దేశం గ్రహించినా పైకి ఏమీ చెప్పలేకపోయేది. ఇకవాళ్ళ రెండోఅక్క కాస్త నయం. పదిపదిహేను రోజులకోసారివచ్చి చెల్లెలు యోగక్షేమాలు విచారణచేసి ఓగంట కూర్చుని వెళ్ళేది. ఎటూ చెల్లెలు ఇంటికి దగ్గర్లోనే అన్నగారిల్లు అని-వాళ్ళింటికి వెళ్ళేది తను. అదికూడా ఇష్టంలేని సదరు అన్నగారు "ఈ బస్సుల్లో ఎలా ప్రయాణంచేస్తున్నారే...రద్దీగావుండవూ. టైముకు వస్తాయా ...మధ్యలో ఆగిపోవూ...ఇలా ఇంట్లో కూర్చున్నంత హాయి, సుఖం కొంపలచుట్టూ తిరిగితే ఏంవస్తుంది? అందుకేనేను ఎవరింటికీ వెళ్ళకుండా ఈ తువ్వాలు కట్టుకుని పడుకుంటాను -ఫాను, లైటు తీసేసి" అనేవాడు.

"ఏమ్మా వదినా...అన్నయ్య అలాఅంటాడేమిటి! నువ్వు వారం వారం బాంకుకాలనీకి వెడుతుంటావుగా...మరి నీకు చికాకు, డబ్బుఖర్చు, కోపం రావటంలేదా" అనేది తను.

అంతే-వదినగారి గొంతు మూగబోయేది.

కళ్ళకు బ్రేకులు పడేవి.

ఆ రెండోఅక్క ఎవరినీ మాట్లాడనివ్వదు. మాటకుమాట బదులు ఇస్తుంది. అలావుండకపోతే ఈరోజులు మనకు తాటాకులు కట్టేస్తాయి అని ఆమె ఉద్దేశం.

అయినా అన్నపూర్ణ గ్రహించలేదు ఈ గీతాసారాన్ని. ఎదుటవారి దృష్టిలో తను గొప్పగా వుండాలనేది ఆమె అభిప్రాయం. అయితే ఊదరగొట్టేకబుర్లు, పొగడ్తలు కేవలం అవసరార్థం అని మాత్రం అర్థంచేసుకోదు. కాలంతోపాటు మారుతున్న మనుషుల తత్వాలని, ఉద్దేశాలని గ్రహించదు. ఈవిషయంలో రామారావుని గడ్డిపోచగా తీసిపారేసేది. అతని చదువు, అనుభవం ఈవిడ గుర్తించదు. తనవంతం నెగ్గాలనేదే ఆమె ఉబలాటం. కాలనీలో వున్న ఫ్రెండ్సుఇంటికి వెళ్ళి-వాళ్ళింట్లో వుండే ఖరీదైన వస్తువులు చూసి తానుకూడా అవన్నీ సమకూర్చుకోవాలని, అందుకు భర్తని పీడించి కొనేవరకూ వూరుకునేదికాదు. ఆ పిచ్చి మానవుడు, ఎలాగో తంటాలుపడి అవి బజారునుంచి కొంపకు బట్వాడా చేసేవాడు- ఈవిడ ఏడుపులు, పెడబొబ్బలు, కన్నీళ్ళు భరించలేక.

"మీకు జీతం ఎంతవస్తుంది. ఇంక్రిమెంటు ఎంత. కరువుభత్యం ఎన్నినెలలకోసారి ఇస్తారు" అని కొత్తలోనే అడగటం ప్రారంభించింది అన్నపూర్ణ.

"ఇలా ఎవరు అడగమన్నారు" రామారావు ప్రశ్న.

"ఒకరు అడగమనటం ఏమిటి...తెలుసుకోటం మంచిదికాదా?" అన్నపూర్ణ మళ్ళీ ప్రశ్నించేది.

"అవును... నిజమే. తెలుసుకోటం చాలా మంచిది. ఎందుకంటే ఏరోజు ఎలా వుంటుందో... నువ్వు తెలివిగా అడిగినా, అమాయకంగా అడిగినా చెప్పాల్సిందే"

"అయితే చెప్పండి"

"నువ్వు నిజాయితీ, చిత్తశుద్ధితో అడిగి వుంటే నా సమాధానం ఒక్కటే. జీతంలో బేసిక్ పే, కరువుభత్యం, నగర భత్తెం, ఇంటి అద్దె వుంటాయి. ఇంక మినహాయింపుల్లో ప్రావిడెంట్ ఫండు చందా, అందునుంచి అప్పుతీసుకున్నందుకు మినహాయింపు, ఇంటినిర్మాణానికిచ్చిన అప్పు వాయిదా, సైకిలు-పండగ అడ్వాన్సుల వాయిదాలు, సహకార సంఘంవాళ్ళిచ్చిన అప్పుతాలూకు మినహా

యింపులు వుంటాయి. ఈ విషయంలో మీనా న్న మా ఆఫీసుకువచ్చి, ఓ ఫ్రెండుద్వారా ఈ వివరాలు ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనేవు న్నాడు... ఆయన నీకు చెప్తున్నాడనుకున్నానే'' హెచ్చరికగా చెప్పాడు రామారావు.

''ఎందుకంత ఉలుకు... అడిగినంతమా త్రాన ఏంపోయింది?''

''సంసారంలో కావలసింది నమ్మకం. మొ గుడికి పెళ్ళాంమీద, పెళ్ళానికి మొగుడిమీదా విశ్వాసంవుండాలి. అదిలేనప్పుడు అను మానం, సందేహాలతో కాపురం సరిగావుండ దు'' అనికూడా చెప్పేవాడు తను.

కాని అన్నపూర్ణమాత్రం ఓ చెవితోవిన్నదా న్ని రెండో చెవిద్వారా వదిలేసేది— దేవుడు రెండుచెవులు యిచ్చింది అందుకే అన్న ట్లుగా. మూడునాలుగు రోజులకోసారైనా ఆ దంపతులమధ్య ఈవిషయంలో ఘర్షణ జరి గేది. ఎడమొగం, పెడమొగం మామూలే.

''మీకు అంటకట్టాడు మానాన్న- ఇంతోటి మగాడు ప్రపంచంలో ఎక్కడా దొరకనట్టు... మిమ్మల్ని కట్టుకుని ఏం బావుకున్నానని— సినిమాలు, షికార్లు మొహంవాచివుండటమే''

అంటూ అన్నపూర్ణ ముక్కు చీదుతూండేది.

''మనిషికి తృప్తి చాలా ముఖ్యం. అదిలేన ప్పుడు ఎంతచేసినా ఒకటే. నేనంతకంటే చే యలేను. ఒకవేళ చేసేవాడు ఉంటే చే యించుకో... నాకభ్యంతరం లేదు. నేనేమీ అను కోను. నీకేలేనప్పుడు నాకెందుకు'' రామారావు నిశ్చయంగా జవాబిచ్చేవాడు.

దుబారా ముందుపుట్టి అన్నపూర్ణ తర్వాత పుట్టిందేమో... భేషజాలు నేర్చుకునే తనకు పెళ్ళామయిందేమో... మొగుణ్ని లొంగదీసు కుని కాపురం ఎలాచేయాలి— అని ముందు స్టడీచేసి ఆతర్వాత ప్రాక్టికల్స్‌కోసం తనని పెళ్ళాడిందేమో...

ఒకసారి అన్నపూర్ణకు పెళ్ళి శుభలేఖవ చ్చింది— వాళ్ళ బాబాయి కూతురి వివాహాని కి.

''ఎప్పుడు ప్రయాణం?'' అడిగింది అన్న పూర్ణ రెండోరోజున.

''దేనికి'' అర్థంకాలేదు రామారావుకి.

''అయ్యోరామ... మీరెక్కడ మతిమరుపు మొగుడండీ... మా బాబాయి శుభలేఖ పంపే డుగా...''

''అయితే మీ అన్నయ్య, అక్క వెడుతు న్నారా?''

''మా అన్నయ్యకు ఆఫీసులో ఇన్‌స్పెక్షను వుందిట... మా అక్కయ్య ఆడపడుచు కూతు రు పెద్దమనిషయిందట... ఆ వేడుకవుందిట''

''అయితే ఈ ఊళ్ళో మీ బాబాయికివున్న బంధువుల్లో ఎవరు వెడుతున్నారు?''

''వాళ్ళతో నాకేంపని''

''మరి నువ్వు ఒంటరిగా వెడతావా?''

''వెడతాను... భయమా! ఇక్కడ రైలెక్కి విజయనగరంలో దిగటమేగా''

''ఇది వేసవికాలం... రైళ్ళు రద్దీగా వుంటాయి. రిజర్వేషను లేనిదే ప్రయాణం చేయడం కష్టం... ఒంటరిగా ఆడవాళ్ళు తిరిగే రోజులుకావు'' నచ్చచెప్పాడు రామారావు.

''ఇంతకీ వెళ్ళటం వుందా లేదా''

''లేదు... నువ్వు వెళ్ళలేవు''

''మీరు డబ్బు మనుమలు... మంచీ మర్యాద లేనివాళ్ళు. డబ్బుకోసం చూస్తుంటే బంధుత్వాలు, రాకపోకలు మంటలో కలిసిపో తాయి. నేను అప్పుచేసైనా వెడతాను'' నిశ్చ యంగా అంది అన్నపూర్ణ.

రామారావు నాలుగొందలు ఎక్కడో తెచ్చి అన్నపూర్ణని పెళ్ళికి పంపేడు. ఆమె పదిరోజు లుండివచ్చింది.

''పెళ్ళి బాగా జరిగిందా... ఎవరెవరు వచ్చారు... ఏం బహుమతులు యిచ్చారు... ఇన్నిరోజులు ఎందుకున్నట్లు?''- వంటి ప్రశ్న లు రామారావు అడగలేదు. అతనికిష్టంవుండ దు. ఒకవేళ అడిగినా అన్నపూర్ణ గొప్పగా చెప్తుంది.

అచ్యుతరామయ్యకు కూతురి గురించి తర చూ ఉత్తరంద్వారా తెలుపుతూవుండేవాడు. ఆయన పెద్ద డిప్లమేట్ కాబట్టి ఇటువంటి విషయాల్లో అంతగా ప్రమేయం, ఆసక్తి చూ పించేవాడు కాదు. తన పెళ్ళాన్నే అదుపుచే యలేనివాడు— కన్నకూతురుని ఎలా వారించగలడు. వింటుందా?

కామేశ్వరి తండ్రిని భోజనానికి పిలిచింది. ఇంట్లో అద్దెకున్నవాళ్ళు హటాత్తుగా ఖాళీచే

యటంతో రామారావుకంటే ఎక్కువగా బెంగపె ట్టుకున్నది అన్నపూర్ణే అని చెప్పాలి. దాదాపు నెలరోజుల్నుంచి నోరు కట్టేసినట్లుగా ఉంది. తిట్టేనోరు, తిరిగేకాలు కుదురుగా ఉండాలంటే వాటికి అనుక్షణం పని ఉండాలి మరి.

"మీకేం పట్టనట్లు వూరుకుంటారేం... యిల్లు ఖాళీఅయి నెల అవుతోంది. ఎవరికైనా చెప్పటమో, టు-లెట్ బోర్డు పెట్టటమో చే యండి- ఊరికే ఉంచితే ఎలా తెలుస్తుంది" అంటూ విరుచుకుపడింది అన్నపూర్ణ ఒక రోజు.

"ఎందుకు చెప్పాలి... ఖాళీగా ఉంటే నష్టం ఏమిటి.. మనమే వాడుకుందాం. విశాలంగా ఉంటుంది" అన్నాడు రామారావు.

"ఏడ్చినట్లుంది మీసలహా.. మిమ్మల్ని ఏవి షయంలోనైనా సలహా అడిగితే యింతే సంగ తులు. అద్దెలేకపోతే ఎలా బతకడం...ఖర్చులు ఎలా"

"ఇప్పుడు ఆ అద్దెలేదని ఏం ఆగింది... మనఖర్చులు తగ్గేయా"

"ఇదిగో... మీకు తెలియకపోతే నోరుమూసు క్కూర్చోండి. అంతేగాని యిలా అడ్డంగా మాట్లాడకండి. నేనడిగేది ఏమిటి, మీరు చె ప్పేది ఏమిటి... బట్టతలకు మోకాలుకు సామ్యం ఏమిటి"

"నువ్వు ముందర ఆనోరు తగ్గించుకో.. నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది. నోరు పెంచుకోటంవల్ల కోపం, ఆయాసం పెరుగు తుంది. బి.పి.కూడా హెచ్చుతుంది. కొంపలో మొగుడిమీదా, పిల్లలమీదా అరిచినట్లు ఇత రులమీద అరిస్తే ఎవరూరుకుంటారు! నెమ్మ దిగా ఉండాలి. అది ఆరోగ్యం. అంతేగాని నోరుందికదా అని వీధినపడిపోవటం ఏమిటి..."

"ఇప్పుడు మీనోరు పెరుగుతోంది. నేనంటు న్నదేమిటి, మీరు చెప్పేదేమిటి..."

"ఈమాత్రం అర్థంచేసుకోగలిగితే నేను నీకు మొగుణ్ని ఎలా అవుతాను... నీ ఆటలు ఎలాసాగుతాయి... పనిమనుషుల మీద నోరు చేసుకుంటావు. అంతే, ఎవరూ పదిహేనురో జుల కంటే ఉండటంలేదు. పాలప్యాకెట్టు మీద మట్టిమరకలుంటే పాలు తెచ్చేవాడు ఏంచేస్తాడు... వాడు ప్యాకెట్టులు కడిగి యివ్వా లనా... అలాగే పాలవ్యాను ఆలస్యంగా వస్తే యింటికి ప్యాకెట్టు ఆలస్యంగా వస్తుంది. ఈ మాత్రంకూడా అర్థం చేసుకోకపోతే ఎలా! పని వాళ్ళమీద అరుస్తే వాళ్ళూరుకుంటారా... అయినా- పనిచేయించుకోనేందుకు నేర్పు, లౌక్యం కావాలి. ఇప్పుడుఅద్దెకున్నవాళ్ళమీద పోట్లాడేవు. ఎన్నాళ్ళని భరిస్తుంది ఆ యిల్లా లు! అక్కడికీ నాముఖం చూసి యీరెండేళ్ళూ ఉన్నారు... మననోరు బయటకు తెలిస్తే. ఎవ రూ అద్దెకు రారు. ఆ యింటి యిల్లాలు గయ్యాళిది, పోట్లాడుతుందనీ చెప్పుకుంటా రు. ఎన్నోసార్లు చెప్పేను.. ఇప్పుడు ఎవరూ రాకపోయేసరికి బెంబేలుపడిపోతున్నావు... చే సినదానికి అనుభవించటమే..." కసినంతా మాటల్లో సౌమ్యంగానే చూపించాడు రామా రావు.

అన్నపూర్ణ వంటింట్లోకెళ్ళి పంచదార కలి పిన నీళ్ళు తెచ్చి భర్తకిస్తూ- "ఇవి చాలా... ఉప్పునీళ్ళుతాగుతారా... అవైతే గొంతు సాఫీగా ఉండి నాలుక చెప్పినట్లు తిరిగి బాగా మాట్లా డుతుంది..." వెటకారంగా అంది.

"నీనోరు ముందు నానోరుఎంత!"

"ఇంతకి టు-లెట్ బోర్డు పెడతారా పె ట్టరా?" గద్దించి అడిగింది ఆమె.

"టు-లెట్ బోర్డులు పెట్టేరోజులు పోయాయి. ఆగొడ్డు మంచిదైతే అవుళ్ళోనే అమ్ముడవుతుంది అన్నట్లు- మన ప్రతాపం ప్రపంచానికి తెలుసు కాబట్టే- నిజంగా అద్దెకి ల్లు కావలసినవాళ్ళు కూడా యిటువైపు చూసి చూడనట్టుగా పోయి మరో యిల్లు చూసు కుంటున్నారు"

"ఇందాకణ్నుంచి చూస్తున్నాను, చెవికోసిన మేకలా అరుస్తున్నారు... వాళ్ళు నూతిదగ్గర చేపలు కడిగి, ఆపొలుసులు అక్కడేపారేస్తారు. ఆ సందు చూడండి, ఎంతసహ్యంగా ఉందో... ఇంక మొక్కల్లోనే తలదువ్వుకున్న జుట్టుని ఉండలుచుట్టి పడేస్తారు... లెట్రిన్ చూస్తే డోకు వస్తుంది. గోడలనిండా బూజే... గోడలమీద కాటుక మరకలు, తిలకంచారలు... వాళ్ళ సొంత యిల్లు అయితే యిలాగే ఉంచు కుంటారా... శుభ్రంగా ఉంచుకోమని చెప్పటం నేరమూ, తప్పూనా... అటువంటి వాళ్ళకి యిల్లు ఎందుకు, ప్లాటుఫారంమీద ఉండ

చ్చుగా... రోడ్లమీద బోలెడు చెట్లున్నాయి... అద్దెకూడా దండగ ఎందుకు... మీ గుమస్తాలు పనిచేయకపోతే, మీరు యిలాగే చూస్తూ కూర్చుంటారా... శుచి, శుభ్రం లేకపోతే ఎలాగ! అన్నం తింటున్నారా, గడ్డితింటున్నారా...'' అన్నపూర్ణకు కోపం వచ్చింది.

''అన్నపూర్ణా... నీకు ప్రపంచం గురించి తెలీదు. ఈరోజుల్లో ఎవరినీ ఏమీ అనకూడదు. వెధవని కూడా ఏమండీ అయ్యగారూ అని పిలిచి స్తోత్రపురాణం విప్పాలి. నోరు చేసుకుంటే ఎవడూ ఊరుకోడు. ఆఫీసుల్లో గుమస్తాలేకాదు, వారి పైఅధికార్లు కూడా పనిచేస్తారనా.. పనిచేస్తే ఎలాగ! హక్కులు కోసం పోరాడాలంటే బాధ్యతలు మరచిపోయి చెట్లకింద అరవాలి. ఆరోజులు, ఆ మనుషులు, ఆ కాలం యిప్పుడు ఎక్కడ! అదీకాకుండా అద్దెకుండేవాళ్ళు- అద్దెయిస్తున్నాం అనే హెూదాని ప్రదర్శిస్తారు. కాబట్టి వారిది పైచేయిగా భావిస్తారు. అంతేగాని యజమానికి అణిగిమణిగి ఉండరు. ఫ్లాటు నెంబరు ఇరవై ఆరులో ఏంజరిగింది. యజమానిని రోడ్డుమీద పడేసి కొట్టేడు, ఇంట్లో ఉన్నతను. ఎవరైనా కల్పించుకుని నోరెత్తారా... దౌర్జన్యం, హింసా ప్రవృత్తి నీడల్లో బతికేవాళ్ళే చాలామంది! నలభైనెంబరింట్లో ఏంజరిగింది, అద్దెకుండే మనిషి తన కోళ్ళుకోసి ఆ రక్తాన్ని గోడలకు డిస్టెంపరుగా రాసిపోలేదూ... అయ్యా బాబూ అని బ్రతిమాలించుకోవాలసినకాలం... అయినా ఎంత చెప్పినా నీకు అర్థంకాదు. అరవటం తప్ప ఏమీ తెలీదు''

''మీకింక బుద్ధిరాదండీ... ఇల్లు కట్టుకున్నా యజమాని ధోరణిలో మాట్లాడరు. మీరు యిల్లు కట్టడం ఏమిటి... నా జాతకంలో రాసిపెట్టి ఉంది కాబట్టి ఏదో ఈమాత్రమైనా కట్టగలిగేరు...''

''ఇంకేం మాట్లాడమంటావు'' రామారావుకి అర్థంకాలేదు. ''మొన్న ఖాళీచేసిన వాళ్ళు- ఇంట్లోకొచ్చేప్పుడు ఆటోలో వచ్చారు. వెళ్ళేప్పుడు లారీ సామాన్లతో వెళ్ళారు. ఎలా కొన్నారు- ఆ సామానులన్నీ... మనకు అద్దె తక్కువయిచ్చి... ఆడబ్బుతో ఎన్నో సామాన్లు కొన్నారు. కరెంటు కూడా విపరీతంగా కాలుస్తూవుండేవారు... మూడుసీలింగు ఫ్యానులు, టీవీ, రేడియో, టేపురికార్డర్, వాటర్‌హీటరు, వాషింగు మెషీన్, ఎయిర్‌కూలర్- యిన్ని వస్తువులకు ఉపయోగిస్తూ ముప్పైరూపాయలు కరెంటు మాత్రమే అవుతుందా... మీకు నోరులేదు. మీటరు ఏదో పాడుచేసి ఉంటారు. నేను మాట్లాడితే నానోరు నొక్కేస్తారు... నోరిచ్చింది అరిచేందుకే... అంతేగాని గొణుక్కోడానికి కాదు'' నిశ్చయంగా చెప్పింది అన్నపూర్ణ.

ఇంతజరిగినా ఆమెలో మార్పు లేదని గ్రహించాడు రామారావు. ఆ మనిషి యింక మారదేమో...

అంతలో కామేశ్వరి ''టు-లెట్'' బోర్డు రాసి తెచ్చింది. ''కిటికీకి తగిలించు నాన్నా నీచేతులతో'' అంటూ వచ్చింది.

''నరేలే... ఇస్తూ యిస్తూ మీనాన్నా చేతికే యిస్తున్నావా ఆబోర్డుని...'' అంటూ లాక్కుంది అన్నపూర్ణ.

''నిజమమ్మా... నాచేయి మంచిదికాదమ్మా. ఈ చేత్తో ఏంచేసినా కలిసిరావటంలేదమ్మా... ఈ చేత్తో టీవీస్టాండు కొన్నాను. తుప్పుపట్టి తగులడింది. టేపురికార్డరు కొన్నాను. నెలతిరిగేనరికి రిపేరుకెళ్ళింది. మీ అమ్మకు చీర కొన్నాను వెలిసిపోయింది... బీరువాకొన్నాను. రంగు వెలిసిపోయింది. మీ అమ్మ ఖర్చుపెడుతుంది కాబట్టి— నంసారం ఇలాగైనా ఉంది. నాకా అదృష్టం, యోగంలేదమ్మా... ఈ ప్రపంచాన్ని నడిపించేదీ నూర్యచంద్రులైతే— ఈ నంసార రథాన్ని నడిపిస్తున్నది మాత్రం మీ అమ్మ. నేను పెళ్ళాంచాటు మొగుడినన్నా ఆడంగి మొగుడినన్నా సిగ్గుపడను. ఆ భేషజం నాకొద్దు. మీ అమ్మకు ఆ బోర్డు ఇచ్చేయి'' అన్నాడు రామారావు నొచ్చుకుంటూ.

అన్నపూర్ణ ఆబోర్డుని కిటికీకి కట్టింది.

ఓగంట తరువాత—

ఇల్లు చూసుకునేందుకు ఓ పోలీసు కానిస్టేబులు వచ్చాడు. ''నాభార్య జనరల్ ఆసుపత్రిలో నర్సుగా పనిచేస్తోంది- మాకిద్దరు పిల్లలు'' అంటూ చెప్పసాగాడు.

కామేశ్వరి తల్లిని లోపలకు పిలిచింది- ''అమ్మా, ఇల్లు పోలీసులకు, మునిసిపాలిటీవాళ్ళకు ఇస్తే లేనిపోని గొడవలు. ఎక్కడో ఒకచోట ఇరికించేస్తారు. ఆ తరువాత పీక్కోలేక

చావాలి... ఆలోచించు. నాన్న ఓసారి వాళ్ళాఫీసులో ఒకాయనకు జరిగిన అనుభవాన్ని చెప్పారు కదా, మరిచిపోయావా'' అని చెప్పింది.

అన్నపూర్ణ సరేనంటూ వెళ్ళింది. "మావారు అడ్వాన్సు తీసుకున్నారుట... నేనప్పుడు గుళ్ళోకెడితే మా అమ్మాయికి చెప్పివెళ్ళారుట...'' అందామె.

"సారీ... ఎందుకైనా మంచిది ఆ బోర్డు తీసెయ్యండి'' అంటూ ఆ పోలీసు కానిస్టేబులు వెళ్ళిపోయాడు.

అరగంట తరువాత ఓ యువకుడు వచ్చాడు. "నేను, మా ఆవిడ మాత్రమే ఉంటాం. నేను సేల్స్ కంపెనీలో పనిచేస్తున్నాను. అద్దె ఏడవతేదీన ఇస్తాను- మాకు ఆరోజు జీతాలు ఇస్తారు. అప్పుడప్పుడు గెస్టులు వస్తారు.'' అని చెప్పాడు.

అన్నపూర్ణ కామేశ్వరితో కలిసి లోపలకెళ్ళింది. "అమ్మా... గవర్నమెంటు ఉద్యోగి అయితే ఫస్టుతేదీకల్లా అద్దె ఇస్తాడు. ప్రైవేటు కంపెనీలో జీతాలు ఎప్పుడిస్తారో... ఎంతిస్తారో... ఎంత ఏడిపిస్తారో... ఏడోతారీకుదాకా పాలకు, కిరాణా, చిల్లరబాకీలు తీర్చకుండా ఎలాగ... వద్దమ్మా ఇతనికి ఇవ్వద్దు...'' అని కామేశ్వరి మళ్ళీ కల్పించుకుంది.

"ఏవిటే నీవుద్దేశం... మీనాన్న చెప్పమన్నారా ఇలాగ... ఏదో ఒకటి చెప్తున్నావు, ఏమిటి ఉద్దేశం...'' అన్నపూర్ణకు కోపం వచ్చింది.

"సరే నీఇష్టం... మనం ఇల్లు ఇచ్చేది అద్దెకోసం. వాళ్ళు ఊరికే ఉన్నారనుకో, అప్పుడు ఇల్లు ఇచ్చి లాభం ఏమిటి... బాగా ఆలోచించు''

అన్నపూర్ణ ఏమనుకుందో, "మొదటి తేదీన అద్దె ఇస్తేనే ఇవ్వగలము'' అంది.

అతను వెళ్ళిపోయాడు.

రామారావు ఆఫీసునుంచి ఇంటికొచ్చేసరికి ఎనిమిదిగంటలయింది. కామేశ్వరి తండ్రిని చూస్తూ నవ్వింది- "నాన్నా... గుడ్‌న్యూస్'' అంటూ.

"నాకు గుడ్ న్యూసా'' ఆశ్చర్యపోయాడు తను.

"అమ్మ ఇల్లు అద్దెకిచ్చింది. వాళ్ళిద్దరూ కూడా బాంకులోనే పనిచేస్తారుట... అద్దె మూడొందలు.. మూడునెలలు అడ్వాన్సు ఇచ్చారు- కొత్తజంట...''

"మీ అమ్మ ఏదీ'' అడిగాడు అతను.

"అసలు సంగతి మరిచేపోయాను. అమ్మ ఆ అద్దెపెట్టి పట్టుచీర కొనుక్కుంది. అది చూపించడానికి ఎదురింటికి వెళ్ళింది'' చెప్తోంది కామేశ్వరి.

అంతలో అన్నపూర్ణ రానే వచ్చింది. "మీ నాన్నకు కాఫీ ఇచ్చావా?'' అని కూతుర్ని అడిగింది.

"కాఫీ వద్దులే... అమ్మాయి టిఫిను పెట్టినంత సంతోషకరమైన వార్త చెప్పింది'' అన్నాడు రామారావు.

కూతురివైపు గుర్రుగా చూసింది అన్నపూర్ణ.

"ఏభైఏళ్ళొచ్చాయి నాకు. పాతిక రూపాయలుపెట్టి చెప్పులు కొనలేదు. రెండొందలుపెట్టి పాంటు, షర్టు ఎరగను. ఈ వాచీకి స్ట్రాప్ పాడై ఆరునెలలయింది. అయిదు రూపాయలు పెట్టలేకపోతున్నాను... ఎందుకో తెలుసా'' అంటూ భార్యని ఉద్దేశిస్తూ కూతురివైపు తిరిగి అన్నాడు రామారావు.

"మీ ఖర్మ... దేనికైనా పెట్టిపుట్టాలి'' పెడసరంగా అంది అన్నపూర్ణ.

"అవును... అంతా పల్లకీలోనే కూర్చుంటే, ఇంక మోసేదెవరు.. సుఖం ఒకరిది కష్టం ఒకరిది'' ఎల్లాగో అన్నాడు.

"మీ వంశమే అంతా... మీ నాన్నగారు చిరిగిన పంచెకు ముడులు వేసుకుని కట్టుకునేవారు. మీ అమ్మ సరేసరి. సాక్షాత్తు భర్త అడుగుజాడల్లోనే నడవటం. ఇంకేం చెప్పేది?''

"అవును... ఎద్దుకి తెలుస్తుంది మెడమీదున్న కాడిబరువు. దున్నేవాడికి కర్రతో కొట్టడం మాత్రమే తెలుసు. ఇది అందరూ చేయలేరు. చేయాలన్నా చేయలేరు. ఎందుకో తెలుసా సంపాదించేవాడు, మిగిలినవారికోసం ఆలోచిస్తాడు. రేపు ఉంది అని ఆలోచిస్తాడు.''

"ఏడుపు ఈ జన్మకు పోదు''

"పోనీలేగాని... ఇప్పుడొచ్చిన వాళ్ళతో మాత్రం దెబ్బలాడకు. పరువుపోయి రోడ్డుమీద కాపురం పెట్టవలసి వస్తుంది'' సలహా ఇచ్చాడు రామారావు.

"నాకు తెలుసు... మీ శ్రీరంగనీతులు నాకు

చెప్పద్దు. ఇంటి విషయాల్లో మీకేం తెలియదని మరోసారి నానోటితో చెప్పమంటారా... మీకేం చెప్పినా అర్థంకాదు. అందుకు ప్రయత్నించరు... నా పరువు— వారిముందు తీయకండి'' గొప్పగా చెప్పింది అన్నపూర్ణ.

''ప్రయత్నిస్తాను'' అన్నాడు రామారావు.

''మీరిక కామేశ్వరికి సంబంధాలు చూడండి'' అని ఆర్డరు చేసింది అన్నపూర్ణ.

''ఇప్పట్నుంచీ తొందరేం''

''ఇప్పట్నుంచీ తొందరపడకపోతే ఎలాగ... మరో నాలుగేళ్ళకైనా కుదురుతుంది. మనదనలే నత్తనడక... ఇప్పుడు అమ్మాయి చదివేది ఇంటరు అని గ్రహించండి- అంతేగాని అయిదోక్లాసుకాదు''

రామారావు ఆలోచిస్తున్నాడు— ఇప్పుడు తను పెళ్ళిచేయగలడా... అమ్మేందుకు ఏం ఉందని... ఉన్నదాన్ని అమ్మి పెద్దకూతురిపెళ్ళి చేశాడు... తాను ఎందుకు చేయలేడూ! ఇల్లు ఉందిగా... అది అమ్మేస్తే సరి.. అనిపించింది.

* * *

రామారావు ఊహించినట్లుగానే ఓరోజు హటాత్తుగా వూడిపడ్డాడు అచ్యుతరామయ్య. కాని అన్నపూర్ణ మాత్రం తెలుసుకోలేకపోయింది. గృహప్రవేశం ఇరవైరోజులుందనగా, తండ్రి ఇక్కడికి రావడం ఆశ్చర్యంగా తోచింది. అమ్మని తీసుకురాకుండా ఎందుకొచ్చినట్లు? అని ఉంది మరోవైపు.

''అమ్మని తీసుకురాలేదేం?'' అని అడిగింది అన్నపూర్ణ.

''ఏమిటే కొత్తగా అడుగుతావ్... మేమిద్దరం ఒకచోట ఈమధ్యకాలంలో కలిసి వున్నామా... మీనాయనమ్మ బతికున్నంత కాలం— ఆవిడతో గోల... ఇప్పుడు ఆ అడ్డు తీరిపోగానే నామీద విరుచుకుపడటం... వారంక్రితం మాపెద్దన్నయ్య వచ్చాడు. ఇంటిపనులు కొన్ని మిగిలాయిట... సాయంగా వుండేందుకు మీ అమ్మను తీసుకువెళ్ళాడు'' చెప్తున్నాడు అచ్యుతరామయ్య.

''మరి ఇన్నాళ్ళూ నీభోజనం మాటేమిటి?''

''మామూలే... వండుకుతినటం... ఇన్నేళ్ళొచ్చాక మీఅమ్మ కొని పడేసిన గ్యాసుపొయ్యి, కుక్కరు వున్నాయిగా. వాటితో కాలక్షేపం. పోతే ఊరగాయలున్నాయి. ఇంట్లో అద్దెకుంటున్న మేస్టారు ఏకూరో, పులుసో పంపిస్తుంటారు... ఓవిధంగా ఇదే బాగుందేమో... మీ అమ్మ ఎదురుగా వుంటే తిట్లు, కేకలే కదా... ఉద్యోగం వుండేంతవరకే మగాడికి విలువ. వాడు సంపాదించే వరకే వాడిమీద ప్రేమ, గౌరవం. ఆరెండూ పోయేక పెళ్ళానికి నోరుపెరిగి, నిర్లక్ష్యం తోడవుతుంది''

''ఎందుకు నాన్నా... ఈ వయసులో అలా తిట్టుకుంటూ పోట్లాడుకోటం... హాయిగా వుండచ్చుకదా'' అన్నపూర్ణ సలహాని మామూలుగానే చెప్పింది.

''మీరు ఆడపిల్లలు. కాబట్టి తల్లినే సమర్థిస్తారు. మగాడు ఎల్లాగో సర్దుకుంటాడు. కాని ఆడది అది భరించలేదు. అందుకే చాలాకుటుంబాల్లో ఆడపెత్తనం వుంటూ వుంటుంది- మగాడి ఆధిక్యత కొంతవరకే''

''పోనీ ఈ ఊరు వచ్చి చిన్నన్నయ్య దగ్గరే వుండవచ్చుకదా...'' అలా అనాలని అనుకోలేదు. కాని నోరు జారింది ఆమెకు.

అచ్యుతరామయ్యకు నవ్వొచ్చింది. ''కొడుకుల్ని కంటే వాళ్ళేదో తవ్వి మొలేస్తారనుకుంటారు. కాని అది వట్టి అబద్ధం, చచ్చేక ఈ కొడుకులు తండ్రికి కర్మ చేసి తరింపచేస్తారోలేదోకాని బతికుండి వేధించుకుని మాత్రం తింటారు. నీవని హాయి... మీఆయన కొడుకు కోసం ఎదురుచూడకుండానే ఆపరేషను చేయించుకున్నాడు... అయినా మీ అన్నయ్యల గురించి నీకు తెలియనిదేముంది'' విరక్తి వినిపించింది.

''అదేంలేదు... మీరు ఊరికే భ్రమపడుతున్నారు''

''నువ్వు నోటితో అబద్ధం చెప్తున్నా కళ్ళు నిజమే చెప్తాయి. మీ చిన్నన్నయ్య గురించి నాకంటే నీకే బాగా తెలుసు. వాడు నరసాపురం అత్తవారింటికి వచ్చి, మాయింటికి వచ్చేడా... అక్కడనుంచి ఎంతదూరం... ఎంత టిక్కెట్టని... ఆదేమంటే కాలువదాటి, నావమీద ప్రయాణం చేయాలిట. బస్సు, ఒంటెద్దుబండి ప్రయాణం వంటికి పడదంటాడు. వాడు చిన్నప్పట్నించీ ఎలాపెరిగాడో మరిచిపోయాడు కాబోలు... నగరంలో ఉద్యోగం చేస్తూ, చేతిలో

నాలుగురూపాయలు కనపడేసరికిఫ ఓ ఇల్లు కట్టేసరికి అదే ప్రపంచం అనుకుంటున్నాడు. వీడిని మించిపోయింది మీవదిన. ఆవిడ గారికి అత్తమామలు కనిపించరు. దృష్టినరసాపురం మీదే వుంటుంది. అమ్మ, నాన్నలకు నెలకు రెండుమూడు ఉత్తరాలు రాస్తుంది. మాకు నాలుగైదునెలలకోసారైనా ఓ కార్డుముక్క రాయచ్చుగా... అదేమంటే ఏం విశేషాలున్నాయంటారు. మరి నరసాపురం రాసేందుకు ఏముంటాయి... అయినా మన బంగారం మంచిది కావాలిగాని, మీవదినను అనటం దేనికి... ముందు వాడికే మేము పనికిరాము... ఇక ఆ చిన్నాడు నరేసరి. అందరిళ్ళల్లోలాగా మనిళ్ళల్లోకూడా పెళ్ళాలిదే రాజ్యం, పాలన..." అచ్యుతరామయ్య ఏకరువు పెడుతున్నాడు.

అన్నపూర్ణకు ఈ చరిత్ర పాఠాలు తెలియక పోతేగా? తానుకూడా అదే ఫార్ములానే ప్రయోగిస్తోందాయె...

"ఇంతకీ రామారావు ఎలావుంటున్నాడు. కులాసాయేనా... ఎలావుంది నీకాపురం" ఆయన ప్రశ్నించాడు.

"మామూలే... అక్కడ నువ్వెంత సుఖపడుతున్నావో నేనిక్కడంత సుఖపడుతున్నాను..." అంది అన్నపూర్ణ.

అచ్యుతరామయ్య దృష్టి ఎదురుగావున్న టి.వి. మీద నిలిచింది- "అల్లుడు ఎప్పుడు కొన్నాడు దీన్ని.. ఎంతయింది" అని అడిగాడు వెంటనే.

"అయ్యోరామా... మీ అల్లుడు కొనటం కూడానా... నేనే ధైర్యంచేసి కొనిపించాను. మూడున్నరవేలయింది... పదిరోజుల క్రితం ఆ టేపురికార్డరు కొన్నాను. రెండువేలు అయింది. ఆమధ్య పక్కవీధిలో అద్దెకుంటున్నవాళ్ళు ఢిల్లీ వెళ్ళిపోతూ వాళ్ళ ఎయిర్‌కూలరు, వాషింగు మెషిను అమ్మేస్తుంటే- ఎటూ మేము కొనే వుద్దేశ్యంలో వున్నాంకాబట్టి- తీసుకున్నాం రెండున్నరవేలు యిచ్చి. ఇకపోతే రిఫ్రిజిరేటరు మళ్ళీ ఏటికైనా కొనాలి" గొప్పగా చెప్తోంది అన్నపూర్ణ.

ఎంతైనా నువ్వు మీ అమ్మకు వారసురాలివే కదా... ఆ పోలికలు, పద్ధతులు ఎక్కడకుపోతాయి... మీ అమ్మనోరు, మీ అక్కచెల్లెళ్ళకు వచ్చింది.- అనుకున్నాడు అచ్యుతరామయ్య. అలా అని- అల్లుళ్ళని గౌరవంగా చూడమని, వారి మాటలు వినమని తన అనుభవం, పెద్దరికం సలహా యివ్వలేవు. ఇచ్చినా కూతుళ్ళు ఖాతరుచేయరని తెలును. అందుకే వాళ్ళు చేసిన పనులకు మెచ్చుకోడం తప్పించి ఏమీ చేయలేడుతను. అయితే ఇప్పుడు అన్నపూర్ణ రిఫ్రిజిరేటరు ఎందుకు కొంటానంటున్నదో అర్థంకావటంలేదు. కొంప తీసి అల్లుడు "మందు"కి అలవాటుపడి వుంటాడా... అది మందుప్రియులకు బాగా ఉపయోగపడుతుందట.

"ఎందుకు ఫ్రిజ్ కొనటం" అని ఊరికే అడిగాడుతను.

"ఎందుకేమిటినాన్నా... పాలు, పెరుగు పెట్టుకోవచ్చు... పిండి, కొబ్బరిచిప్పలు, దొడ్లో కాస్తున్న దొండకాయలు, జామకాయలు దాచుకోవచ్చు. కూరగాయలు, ఆకుకూరలు తాజాగా వుంటాయి"

"అందుకు ఫ్రిజ్ కావాలా?"

"ఏమిటి నాన్నా... నువ్వుకూడా మీ అల్లుడులాగే అడుగుతున్నావు... ఫ్రిజ్‌వల్ల ఎన్నోలాభాలు. సొసైటీలో స్టేటస్సు వుంటుంది" అన్నపూర్ణ గర్వంగా చెప్తోంది.

అంతలో వచ్చింది కామేశ్వరి కాలేజీనుంచి. "ఏం.. తాతా... బాగున్నావా" అంటూ పలకరించింది.

"ఏమే మనవరాలా... ఎలావుంది చదువు... ఏం.. సినిమాలు చూపిస్తావు ఈసారి..." అచ్యుతరామయ్య అన్నాడు.

"ఏంతాతా... నువ్వుకూడా మామయ్యల్లాగే తయారయ్యేవే... నువ్వెప్పుడైనా మమ్మల్ని సినిమాకు తీసుకెళ్ళావా... బస్సుటిక్కెట్లు కూడా నాచేతే తీయిస్తావు... ఇంతకీ అమ్మమ్మ ఏదో... అవున్లే... మీ యిద్దరికీ ఎప్పుడు పడిచచ్చింది... ఇలా ఎన్నాళ్ళని కాపురం చేయటం... హాయిగా డైవోర్స్ తీసుకోవచ్చుగా..." గలగలా మాట్లాడుతోంది కామేశ్వరి.

అన్నపూర్ణ మౌనంగా వింటోంది.

అచ్యుతరామయ్య కూడా బదులు చెప్పలేక టాపిక్ మార్చేసాడు. "ఈవేళ ఏం సినిమా చూపిస్తావ్" అని అడిగాడందుకే.

"తాతా... మీ అభిమానతారలు అనూరాధ, హాలం, జ్యోతిలక్ష్మి, జయమాలిని నటించే సినిమాలు ఆడుతున్నాయి- చూద్దామా" నవ్వుతూ అంది కామేశ్వరి.

"నీ యిష్టమే పిల్లా... నువ్వేం సినిమాలు చూపిస్తే అవి చూస్తాను..." అన్నాడాయన.

"తాతా, నెపం నామీదకు ఎందుకు తోయటం... నువ్వు చూసే సినిమాలు అవేగా... ఈ వయసులో నీకు అటువంటి పిచ్చి మోజు ఏమిటి... హాయిగా భక్తిసినిమాలు చూడచ్చుగా..." అంటూ చురకేసింది కామేశ్వరి.

అంతలో అన్నపూర్ణ తండ్రికి కాఫీ తెచ్చింది.

అచ్యుతరామయ్యకు ఎప్పట్నుంచో "బ్లూ సినిమా" చూడాలని వుంది. ఆ సినిమాల గురించి వినటమేకాని చూసితరించే భాగ్యం కలగలేదు. అలా చెప్పిన వారితో వెళ్ళాలనుంటుంది. వెళ్ళచ్చు. కాని డబ్బు ఖర్చు... వాళ్ళు మందుకొట్టి పక్కన వెచ్చని మగువలు తోడువుంచుకొని మరీ చూస్తారట. కాని, తను? అంత ఖర్చు భరించటమా... ఏదైనా "ఫ్రీకేసు" దొరికితే తను అభ్యంతరం చెప్పడు... ఆ కోరిక, సరదా తీరకుండానే ఈ తనువు పోతుందేమో... పోనీ, అల్లుణ్ని రిక్వెస్టు చేస్తే... అమ్మో... తేలికైపోడూ... ఈ కోరిక ఎలా తీరుతుందో మరి!

ఆ సాయంత్రం కామేశ్వరి, అచ్యుతరామయ్యకు అయిదారు సినిమాలు చెప్పి, ఒకటి సెలక్టు చేస్తే మర్నాడు మాటినీకి వెడదామంది... ఆయన ఓ.కే. అన్నాడు.

ఆ రాత్రి గదిలో రామారావుతో అన్నపూర్ణ-

"రేపు మా నాయనమ్మ తద్దినం... మా నాన్న మనింట్లో పెడతానంటున్నాడు" అంటూ సంభాషణ ఆరంభించింది.

"అయితే నాతో చెప్పటం దేనికి" అన్నాడు రామారావు.

"ఇంకెవరికి చెప్పాలి?"

"నేను వద్దంటే మానేస్తాడా మీ నాన్న... నువ్వు అందుకు అంగీకరిస్తావా?" సూటిగా చెప్పాడు రామారావు.

అన్నపూర్ణ నోట్లో వెలక్కాకాయపడినట్లయింది.

"మీ అన్నయ్య దగ్గర్లోనే వున్నాడుగా... వాళ్ళింట్లో పెట్టుకోవచ్చుగా... నలుగురూ ఏమనుకుంటారు, కొడుకుని కాదని అల్లుణ్ని చేరదీసాడనుకోరూ... అఫ్‌కోర్స్, మీనాన్న డ్రామా ముందు నా యాక్షన్ ఎంతలే..." అన్నాడు రామారావు భార్య జవాబు తెలిసే.

"మా అన్నయ్య సంగతి తెలుసుగా... మళ్ళీ ఆమాట దేనికి" సమర్థించబోయిందామె.

"నిజమే... మీనాన్న పెద్దడిప్లమాట్... కొడుకు వద్దంటాడు. అల్లుడు బేవార్సుగా దొరికాడుగా... అయినా మీ అన్నయ్యకు ఇదేం రోగం... సాక్షాత్తూ నాయనమ్మకదా... ఆవిడ కాసు బంగారం ఇస్తే లక్షణంగా తీసుకుని ఉంగరం చేయించుకున్నాడు. ఆవిడ కాలం చేస్తే కనీసం చూసేందుకు వెళ్ళలేదు. అదేమంటే పిల్లాడి చదువు... పరీక్షలు అన్నాడు. ఇంక మీవదిన సరేసరి 'ఇంట్లోకొచ్చే రోజులు కావు' అని తప్పించుకుంటుంది. వాళ్ళకేనా ఇల్లు, పిల్లలు వున్నది! వాళ్ళింట్లో అద్దెకున్నావిడకు హటాత్తుగా జబ్బు చేస్తే ఎక్కడ కొంపలో గుటుక్కుమంటుందో అని వెంటనే ఖాళీ చేయించాడు... చావు ఎవరికీ చెప్పిరాదుగా... అది ఎక్కడ ఎప్పుడు రాసిపెట్టి వుందో... బతికినన్నాళ్లూ నలుగురిచేతా శెభాష్‌అనిపించుకోవాలి. అంతేగాని నాకు డబ్బుంది ఎవరి అవసరంలేదనుకుంటే ఎలా...ఎంతడబ్బున్నా ఎంతగొప్పవాడైనా తప్పదుచావు. ఏళ్లురాగానే సరికాదు..సంస్కారంవుండాలి"

భర్తమాటలకు అడ్డుపడింది అన్నపూర్ణ. "ఇప్పుడు ఆ గొడవ ఎందుకు... ఏమంటారిప్పుడు "అంటూ-

"అనేందుకేముంది...ఇక్కడ వద్దు..కొడుకు యింట్లోనే పెట్టుకోమను" అనేసాడు రామారావు.

"అయినా మిమ్మల్ని అడగటం ఏమిటి... ఇది నాయిల్లు నాయిష్టం..మానాయనమ్మ తద్దినం. యిక్కడే పెట్టమంటాను మానాన్నని..నాయింటికొచ్చాడు మానాన్న. ఆయన వెళ్లే వరకూ అన్నీ యిక్కడేజరుగుతాయి" నిశ్చయంగా అంది అన్నపూర్ణ.

"పోనీ ఖర్చులైనాపెట్టుకుంటాడా మీనాన్న"వెటకారంగా అన్నాడు అతను. ఆయన

రక్తంలో అటువంటి లక్షణకణాలు లేవు.

"ఏంమాటలు అవి, మానాన్న అంతగతిలే నివాడనుకొన్నారా?"

"అని ఎవరన్నారూ... మీఅమ్మవంటిమీద ఏభై అరవైవేల బంగారం వుండచ్చు. మీనాన్నకు రెండెకరాల మాగాణిపొలం వుండచ్చు. ఏభై రూపాయలు నెలకు అద్దెరావచ్చు. రెండొందలు పైన పెన్షన్ తీసుకోవచ్చు నెలనెలా. కాని లేనిదల్లా యితరులవద్ద తీసుకున్న డబ్బు ఖర్చుపెట్టిన డబ్బు ఎప్పటికీ యివ్వకపోడం...అంతే".

"సూటిగా చెప్పండి, ఏమిటా డొంకతిరుగుడు వాగుడు"

"ఆహా... ఏమీ తెలియనట్లుగా ఆ నటన ఏమిటి... ఇదివరకూ రెండుసార్లు మీనాన్న మీ నాయనమ్మ తద్దినం ఇక్కడపెట్టాడు. అందుకు రెండువందలు ఖర్చు నాకు అయింది... ఇచ్చాడా మీనాన్న? పొగాకు తెప్పించుకున్నాడు, నలభై ఏభైరూపాయలు నాకు క్షవరకళ్యాణం. ఎప్పుడిచ్చాడు? ఇప్పుడెంత చేస్తాడో మరి మీనాన్న! నడుం నొప్పి, కీళ్ళనొప్పులు అంటే డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళాను. ఎక్స్-రే, బ్లడ్‌టెస్టు, ఫీజు, మందులకు మూడొందల యింది. ఇచ్చాడా మీనాన్న... ఇంతకీ మీనాన్న నాకు అల్లుడా నేను ఆయనకు అల్లుడినా? ఇక్కడకొచ్చి ఇల్లరికపు మర్యాదలు పొందాలనుకుంటే అది నావల్లకాదు... తల్లి తద్దినం ఖర్చుని అల్లుడికి రుద్దుదామనుకుంటే, ఇంక అటువంటివి ఎందుకు పెట్టటం... ఈ పనులు ఎందుకు? ఎందుకీ నటన? మనసులోలేనిది కావలించుకుంటే వస్తుందా... చిత్తశుద్ధిలేని శివపూజలు ఎందుకో... గుళ్ళోకెళ్ళి- కళ్ళుపక్కనున్న ఆడదాని మీదనిలపడం! మనంచేసే వెధవపనులని కప్పిపుచ్చుకునేందుకు తీర్థయాత్రలు, నోములు, పూజలు, వ్రతాలు చేస్తే ఏమిటి ప్రయోజనం... హాయిగా ఇంట్లో కూర్చుని రామా కృష్ణా అనుకుంటే మంచిది"

అన్నపూర్ణకు కోపం వచ్చింది- "మీరేం మాట్లాడకండి... పొద్దున్నే లేచి కూరలూ అవీ తీసుకురండి... అంతే" అంది.

"మీ అన్నయ్య తప్పించుకున్నా నాకా ఉద్దేశం వుండదు. సరే... అలాగే కానివ్వు..." అంటూ నిద్రలోకి జారాడు రామారావు.

★ ★ ★

రెండురోజుల తరువాత-

రామారావు ఆఫీసుకు బయలుదేరుతుంటే అడిగింది అన్నపూర్ణ- "సాయంత్రం పెందరాళే రండి" అని.

"ఎందుకు?"

"మానాన్నని బిర్లా మందిర్‌కి తీసుకెళ్ళాలి".

"ఏం... మీనాన్న వెళ్ళలేడా"

"ఆయనకు భయం... ఒక్కడూ బస్సులు ఎక్కలేడు"

"మరి మీవూరునుంచి యీవూరు ఎలా వచ్చేడు... ఎవరు తీసుకొచ్చేరు..." రివర్సుగేరులో ప్రశ్నించాడు రామారావు.

"ఆ గొడవ యిప్పుడు దేనికి... ఇంతకీ వస్తున్నారా లేదా?"

"ఎలా కుదురుతుంది...నెలాఖరు రోజులు గాబట్టి పని ఒత్తిడి ఎక్కువగా వుంటుంది. బహుశా కుదరదేమో..."

"బాగుందండీ వరస... ఈ కాలనీలో వాళ్ళు కూడా మీ ఆఫీసులోనే పనిచేస్తున్నారు కదా... వాళ్ళు పదకొండుగంటలకు బయలుదేరి నాలుగుగంటలకల్లా కొంపలకొచ్చేస్తారు. వాళ్ళకి పనులు వుండవా... మీరొక్కరే పనిచేస్తున్నారా... ఓరోజు పెందరాళే రమ్మంటే కథలు చెప్తున్నారే..." గుమ్మంలోనుంచి అరుస్తోంది అన్నపూర్ణ.

రామారావు సైకిలు లోపల పెడుతూ అన్నాడు- "మీనాన్న వెళ్ళేవరకూ ఆఫీసుకు సెలవుపెడతాను. ఎక్కడెక్కడికి తిరగాలో, ఎంత డబ్బు కావాలో చెప్తే ఏర్పాట్లు చేస్తాను" చికాకు ధ్వనిస్తూ అన్నాడు.

"ఆఫీసులో వెలగబెట్టే రాచకార్యం ఏముంది... సెలవు పెట్టండి... మీరెళ్ళి ఆఫీసులో కూర్చుంటే, ఆయనకు ఏంతోస్తుంది... కాస్త కాలక్షేపంగానైనా వుంటుంది. మీరింట్లో వుంటే... ఎన్నాళ్ళకి మంచిపనిచేశారు..." అంటూ ఆనందపడింది అన్నపూర్ణ.

అంతలో అచ్యుతరామయ్య వచ్చాడు. రామారావుని చూసి అన్నాడాయన- "ఆఫీసుకింకా వెళ్ళలేదా... టైము కాలేదా" అంటూ.

"లేదండీ... సెలవు పెడదామని"

అంతలో అన్నపూర్ణ చెప్పింది- "నువ్వు బిర్లామందిర్ కెడదామన్నావుగా. సెలవు పెడతానన్నారాయన" సర్ది చెప్పుతూ.

ఆయన లోపలకు నడిచాడు. ఆమెకూడా అనుసరించింది. రామారావు బైటే నిలబడి ఆలోచిస్తున్నాడు.

"బిర్లామందిర్ యిదివరకూ చాలాసార్లు చూసానుగా... మళ్లీ ఇదివరకు కంటే కొత్తగా ఏమైనా నిర్మాణాలు జరిగాయా?" అడిగాడాయన.

"అదే... చూస్తే తెలుస్తుందిగా".

"వద్దులెద్దూ..." అన్నాడు అచ్యుతరామయ్య డబ్బు ఖర్చు అవుతుందన్న ఉద్దేశంతో.

అన్నపూర్ణ భర్తదగ్గర కొచ్చి చెప్పింది- "నాన్న దృష్టి అప్పుడే గృహప్రవేశం మీదకు మళ్లింది. కోఠీ వెళ్లి మిలట్రీ సంచులు పెద్దవి రెండు కొనుక్కురండి. అలాగే కామేశ్వరికి ఓణీ ఒకటి తీసుకురండి. అలాగే టిక్కెట్లు కూడా కొని తీసుకురండి. రిజర్వేషను చేయించండి- మరిచిపోకండి" అంటూ గుక్కతిప్పుకోకుండా చెప్పింది.

"ఇంతకీ, నీకేకదా టిక్కెట్లు కొనవలసింది" అని అడిగాడు.

"రెండు టిక్కెట్లు"

"నేను రావటంలేదుగా"

"మీరు వస్తున్నారని ఎవరు చెప్పారు... నాకూ, మా నాన్నకీ"

"మీ నాన్నకి టిక్కెట్లు నేనే కొనాలా... మీ అన్నయ్య ఉన్నాడుగా".

"వాడి సంగతి ఇప్పుడెందుకు... నాన్న మనింటికొచ్చాడు. కాబట్టి మనమే కొనాలి- అది గౌరవం..."

"గౌరవం, మర్యాద, మంచి మన డిక్షనరీలో లేవుగా" అని ఏదో గుర్తుకురాగానే "ఓహో... ఆ రూట్లో వస్తున్నావా... మొగుడిని ఎలా చూసినా ఫరవాలేదులావుంది. తండ్రిని ఏమాత్రం కాలుకిందపెట్టకుండా అతిథి మర్యాదలతో చూడాలి. అదీ నీకు తెలిసిన గౌరవం- మరిచేపోయాను" అన్నాడు రామారావు.

"మీకింక ఈ జన్మకు బుద్ధిరాదు".

"ఎలా వస్తుంది... పుట్టుకతో వచ్చినబుద్ధి పుడకలతో కాని... పోదు... ఉన్న ఆ కాస్త బుద్ధి కూడా నిన్ను పెళ్లాడగానే పోయింది".

"ఇంతకీ ఏంచెప్పానో గుర్తుందా"

"గుర్తుంది... కాని టిక్కెట్ల విషయం మీ అక్కకు చెప్తాను"

"ఎందుకు"

"ఎందుకేమిటి... నేను ఏంచేసినా, చెప్పినా నీకు నమ్మకం కుదరదుగా... మీ వాళ్లు అబద్ధం చెప్పినా అది తియ్యటి నిజంగా వుంటుంది. టిక్కెట్ల విషయం అంటే మాటలా... రిజర్వేషను అంటే అంతతేలికకాదు. దొరక్కపోతే నాకు చేయించడం యిష్టం లేక అబద్ధం చెప్పానని అనుకుంటావు నువ్వు. నాకెందుకు ఈ గొడవ. అయ్యేఖర్చు ఎటూ అవుతుంది. పైగా మాటలు పడాలి. అదీ ఈ వయస్సులో... నా కిష్టం లేదు" అంటూ బయలుదేరాడు రామారావు.

అచ్యుతరామయ్య కూతురి ప్రాభవాన్ని స్వగతంలోనే సంతోషిస్తున్నాడు.

రామారావు తిన్నగా ఆఫీసుకెళ్ళాడు. సాయంత్రం ఆఫీసుకు ఓ అరగంట పర్మిషను పెట్టి కోఠీవెళ్ళాడు. అక్కడ సంచీలకోసం అరగంట తిరిగి, దొరక్కపోగా భయపడుతూనే వదినగారింటికి బయలుదేరాడు.

"మానాన్నకు కొడుకు యిల్లువదిలిపెట్టి రాబుద్ధికావటంలేదా?" అని ప్రశ్నించింది అతని వదినగారు, అన్నపూర్ణ అక్క.

"భలేజోకేశారు... మీనాన్నగారికి కొడుకింటికెళ్ళేధైర్యం వుందా... అందులో వాళ్ళిప్పుడు పెళ్ళివారు కూడా... అందుకేగా గృహప్రవేశానికి రానంటున్నది- పిల్లాడికి పరీక్షలు అని సాకుచెప్పున్నది!" అన్నాడు రామారావు.

"మరి నాన్న మీయింట్లోనే వున్నాడా?"

"ఆహా.... అక్కడాలా"

"మా యింటికి పంపించండి"

"నేను పంపేదేమిటండీ... నాప్రయోజకత్వం ఏముంది... అయినా ఆయన్ని పంపేదీ, పంపకపోవడమూ మీ చెల్లెలు యిష్టంకదా... పైగా మీ యింటికొస్తే బస్సుడబ్బులు ఖర్చుఅవుతాయని భయంకాబోలు... మీచెల్లెలు వస్తే నిక్షేపంగా వస్తారు... మీకు తెలీనిదేముంది"

ఆవిడ మరి మాట్లాడలేదు.

"ఇదిగో ఎనిమిది వందలు. ఈ డబ్బుతో మీనాన్నగారికీ, మీచెల్లెలుకీ టిక్కెట్లు కొనండి... నాకు వీలువడదు. ఎటూ మీటిక్కెట్టుకోసం స్టేషనుకెడతారుగా..." అంటూ డబ్బుతీసిచ్చాడు అతను.

"మా ప్రయాణం అనుమానంగావుంది. వెడతామో వెళ్ళమో... మా మావగారికి ఆమధ్య సీరియస్ అయింది. ప్రస్తుతం బాగానే వుంది. కాని ఏటైములో ఎలావుంటుందో చెప్పలేం. రిజర్వుచేయిస్తా. ప్రయాణంనాటికి పరిస్థితినిబట్టి చేయవలసివస్తుంది. వెళ్ళకపోతే మేము, టిక్కెట్టు కాన్సిలు చేయిస్తాం" అందావిడ డబ్బుతీసుకుంటూ.

"మీయిష్టం... మీకు వీలయితే ఓసారి వచ్చి మీచెల్లెలుతో మాట్లాడండి. టిక్కెట్టుమాత్రం రిజర్వుచేయించండి" అంటూ బయలుదేరాడు రామారావు.

అతను ఆబిడ్సు చేరుకొన్నాడు. తాను ఉంగరం అమ్మినషాపుదగ్గర ఓ క్షణంఆగి అనుకొన్నాడు- "పాతికేళ్ళు నా చేతికున్న ఉంగరం యిప్పుడు ఈ షాపులో వుంది- ఈ ప్రయాణం కారణంగా... దారిఖర్చులకోసం అమ్మేశాను" అని.

రాత్రి తొమ్మిదిగంటలు దాటింది. రామారావు డాబామీద పచార్లుచేస్తున్నాడు. లోపల కామేశ్వరి, అచ్యుతరామయ్యా టి.వి. చూస్తున్నారు. అన్నపూర్ణ వంటిల్లు సర్ది అప్పుడే టి.వి. వున్నగదిలోకి వచ్చింది. "మీ నాన్న ఏడీ..." అడిగింది వస్తూనే.

"డాబామీద వున్నాడులావుంది" చెప్పింది కామేశ్వరి చిరాకుపడుతూ. టి.వి. చూస్తుంటే డిస్టర్బు చేసినందుకు.

"ఏమే పిల్లా... వాళ్ళు ఎందుకల్లా పోట్లాడుకుంటున్నారు?" సీరియల్‌లోని దృశ్యం చూస్తూ అడిగాడు అచ్యుతరామయ్య.

"తాతా... నీకు అర్థమైతే చూడు. లేకపోతే మానేయ్. మధ్యలో మాతో డిస్టర్బుచేయద్దు అయినా నీకు టి.వి. దేనికి... ఎదురింటాయన ఖాళీగా కూర్చున్నాడు. వెళ్ళి పేకాడుకో" కోపంతో అంది కామేశ్వరి.

అన్నపూర్ణకు తండ్రిని అలా అవమానపరచినందుకు కోపం వచ్చింది "ఏమిటా పొగరు, చిన్నాపెద్దా లేకుండా" అంది.

"అబ్బా... వూరుకో అమ్మా..."

అన్నపూర్ణ డాబామీదకెళ్ళి ప్రశ్నించింది భర్తని- "చలిలో యిక్కడేం చేస్తున్నారు... కింద మానాన్న ఒక్కడే వున్నాడు"

"నిండా మునిగినవాడికి చలేమిటి... అయినా నాతో నీకేంమాటలుంటాయి. మీనాన్నతో కబుర్లుచెప్పువెళ్ళి" అన్నాడతను.

"ఇప్పుడు ఏమయిందని..."

"ఏమీకాలేదు... ముందుముందు ఏంజరుగుతోందో అని భయపడ్తున్నాను- అంతే"

"ఇంతకీ టిక్కెట్ల విషయం ఏంచేశారు"

"మరి మీ అక్క రాలేదా" అంటూ జరిగింది చెప్పాడు రామారావు.

"రాలేదు" చెప్పింది అన్నపూర్ణ.

"అయితే టిక్కెట్లకు డబ్బు ఎక్కడిది" తిరిగి అడిగిందామె.

"ఉంగరం అమ్మేశాను?"

"ఇప్పుడంత అవసరం ఏమొచ్చింది"

"వచ్చిందికాబట్టే అమ్మవలసివచ్చింది. టిక్కెట్లు ఊరికే యిస్తారా, నువ్వూ- మీనాన్న ప్రయాణంఅవుతున్నారని"

వెంటనే ఏం చెప్పలేకపోయిందామె.

"సైకిలు కూడా అమ్మేద్దామనుకుంటున్నాను" అన్నాడు అతను.

"ఎందుకు... ఆఫీసుకు ఎలా వెడతారు... స్కూటరు కొంటారా... మీకు నడపటం వచ్చా"

"నువ్వే నన్ను నడిపిస్తుంటే నాకు స్కూటరు నడపటం ఏంవస్తుంది. అయినా నాకు స్కూటరు యోగంవుందా... సైకిలు అమ్మేసి ఆ డబ్బు మాతమ్ముడికి బాకీ తీర్చేస్తాను"

"ఏం బాకీ"

"అప్పుడే మరిచిపోయావా... అవున్లే- మీవాళ్ళకివ్వాల్సిన బాకీలగురించే నీకు గుర్తుంటుంది... వాడిదగ్గర అప్పుచేసి ఎనిమిది నెలలక్రితం అయిదొందలుపెట్టి సూట్‌కేసు కొన్నాం. వాడికి రెండొందలే యిచ్చాం, గుర్తుందా... ఇప్పుడు ఆ మిగిలినడబ్బు ఎన్నాళ్ళని యివ్వకుండా వుంటాను..." రామారావు చెప్తున్నాడు.

"ఏం యివ్వక్కర్లేదు... నెలకు వందరూపా

యలచొవ్వున యివ్వచ్చు'' సలహా చెప్పిందిఅ న్నపూర్ణ.

"నోరుముయ్యి. వాడి బాకీ తీర్చాల్సిందే. జీతంలోఏమాత్రం మిగల్చగలవో నాకు తెలీదా... ఎక్కడలేని డబ్బు నీకు కేసెట్లు, స్టీలు సామానులు, బట్టలు, ప్రయాణాలకే సరిపోదు. ఏదోఒకటి అమ్మకపోతే యిటువంటి బాకీలు ఎలాతీర్చాలి... అవతలివాళ్ళు అడగ టంలేదని- యివ్వకుండా వుండటం నాకు నచ్చదు. అందుకే ఈ నిర్ణయం...'' రామారావు ఆవేశంగా చెప్పాడు.

"మీకు చెప్తే అర్థంకాదు... ఏదో ఒకటి ఏడవండి''

"ఏడవక ఏంచేయగలుగుతున్నాను''

"ఇక కిందకు రండి... మానాన్న ఒక్కడే వున్నాడు''

"ఏం కిందకొచ్చి ఆయనకు కాళ్ళుపట్టాలా''

"ఏమిటీ పిచ్చివాగుడు... నేను ఎక్కడికైనా ప్రయాణం అయితే మీకు ఎక్కడలేని కోప మూ, విసుగు వచ్చేస్తుంది. ఏళ్ళొచ్చాయి... కాని జ్ఞానంరాలేదు.''

"జ్ఞానం, బుద్ధి బజారులో దొరకదు- డబ్బు పెట్టి కొనుక్కోడానికి. అయినా మీనాన్నకేలేదు. ఆయన మీ అమ్మదగ్గర తాకట్టుపెట్టినట్లు, నేను నీదగ్గర తాకట్టు పెట్టాను... నువ్వుకిందకు వద, మీ నాన్న ఒక్కడూఉన్నాడు... నీతో ఏంర హస్యాలు మాట్లాడాలో...''

అన్నపూర్ణ విసుక్కుంటూ కిందకెళ్ళిపో యింది.

జీవితం గురించి వ్యాఖ్యానించటం, అర్థంచెప్పటం ఎవరికైనా సాహసమే. అది అద్దం వంటిది దాని వైవిధ్యం, విశిష్టత సువి శాలం. కొందరి సృష్టిలో జీవితం ఆనందదా యకం, మరికొందరిలో దు:ఖమయమూ కావ చ్చు. జీవితం జీవించేందుకని, అనుభ వించేందుకని వేదాంతులు, అనుభవజ్ఞులు చెప్తారు. కాని ఈ ప్రపంచంలో చాలామంది ఎటువంటి ఆశయం, లక్ష్యం ఆశించకుండా, పొందకుండా బతుకుతున్నారు.

రామారావు జీవితం గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. జీవితం ఎంత ఆలోచించినా నిలకడలేని నదీప్రవాహం. బతుకులో సగ భాగం నిద్రలోనే గడిచిపోతుందట. కొంత కాలం చదువు, ఉద్యోగంలో గడుస్తుందట... వివాహము అయి-పిల్లలు పుట్టి, బాధ్యతలు-స మస్యలు బాధిస్తుంటే-వేధిస్తుంటే ఇంక మని షికి మిగిలేది కోపం... నిరాశ... చికాకు... అను భవాలు నేర్పే పాఠాలుగ ఉక్కిరిబిక్కిరి చే స్తుంటాయి.

ఎంత తరచి చూచినా జీవితానికి మరపురా నిది ఒకటుంటుంది... దానినే మనసు అంటా రు. అటువంటి మనసుని పోగొట్టుకున్నాడు రామారావు. మనసులేని మనువులో మతి పోగొ ట్టుకున్నాడు.

రామారావు ఎవరినీ నమ్మి మోసపోలేదు. ఎవరికీ ద్రోహం, అన్యాయం, అధర్మం చేయలే దు.

"మీకేం తెలియదు. మీరు ఈ ప్రపంచంలో బతకలేరు. నోట్లో నాలుక ఉందిగాని అది మొద్దుబారింది. దాన్ని గరుకు రాతితో సానబ ట్టినా ప్రయోజనం లేదు. వయసుతోపాటు అనుభవం పొందాలి. మీకే అంతా తెలుసుననే అహంభావం తప్ప మరేంలేదు. మనుమల్ని తేలిగ్గా నమ్మి మోసపోతారు మీరు. అది మంచి పద్ధతికాదు. మిత్రత్వంలోని శత్రుత్వాన్ని చూడ లేకపోతున్నారు''

పెళ్ళయిన అయిదో ఏటనుంచి అలా విమ ర్శించసాగింది అన్నపూర్ణ. అప్పటికి అతని వయసు ఇరవైఏడు. ఆమెకు ఇరవైరెండు. అది రోజురోజుకీ పెరిగిన ధోరణేకాని తగ్గలేదు.

అన్నపూర్ణ చేసే పనులు, ఖర్చులు అతనిలో అసంతృప్తి, ఆందోళన, అవమానానికి దారితీ యసాగాయి అప్పట్నుంచీ. ఆమెతండ్రి అచ్యు తరామయ్య మహామేధావి. రాజకీయాన్ని మాటల్లో భలేగా మథిస్తాడు. బహుశా తండ్రి వద్దతే ఈకూతురికి వచ్చివుంటుంది. ఆమెకు తగ్గ భర్త తను కాడేమో... లేక తనకు తగ్గ భార్యకాదేమో... అనికూడా ఎన్నోసార్లు అనుకు న్నాడు రామారావు.

ఈ మూడుసంవత్సరాలకాలం అతనికి ఎంతో గడ్డుగా గడిచింది. ఎంతడబ్బు తెచ్చినా "హుష్ కాకి'' అన్నట్లు ఖర్చు చేసేసింది అన్నపూర్ణ. వాళ్ళ అమ్మమ్మ సంవత్సరీకాలు కాశీలో జరిపించాడు మేనమామ. అప్పుడు తను వెళ్ళింది, ఆరొందలు ఎగిరిపోయాయి.



•ఎనిమిది నెలలు తరువాత ఆ మేనమామ గతిస్తే నాలుగొందలు ఖర్చు. మరో ఏడాదికి వాళ్ళ నాయనమ్మ కాలం చేసింది, మూడొంగలు వదిలిపోయాయి. ఆరునెలల క్రితం వాళ్ళ పెద్దబావ మరణించాడు హటాత్తుగా. నాలుగొందలు ఖర్చుతేలింది. ఆ తరువాత రెండు మూడుసార్లు పెద్దక్కకి ధైర్యం చెప్పేందుకు వెళ్ళింది... మళ్ళీ అంతే ఖర్చు. ఇప్పుడు గృహప్రవేశం... ఎనిమిదొందలు... ఈ ఖర్చులు అదనంగా జరిగేవే... ఈమధ్యలో అమ్మని చూసేందుకు, నాయనమ్మ సంవత్సరీకాలు, పెద్దక్కకి అనారోగ్యం, వాళ్ళ కూతురు-కొడుకుల వివాహాలు... ఇవన్నీ రెగ్యులర్ ఖర్చులు. ఇలా ఆలోచిస్తుంటే బుర్ర వేడెక్కిపోతోంది.

"నువ్వు ఇలా ఇల్లు, పిల్లలు వదిలిపెట్టి తిరుగుతూంటే ఎలా.. ఏదో ఒకటి సర్దిచెప్పి తప్పించుకోవచ్చుకదా మీ అన్నయ్య యించక్కా ఎలా చెప్పుకుని ఎరుగుతున్నాడో... ఒకే తండ్రికి తల్లికి పుట్టిన వారి ఆలోచనల్లో ఎందుకింత వ్యత్యాసం?" రామారావు తరచు అనేవాడు.

"మధ్యలో వాడిగొడవ ఎందుకు. వాడు మావదిన చెప్పినట్లు వింటాడు. మరి మీరు నామాట వింటారా... మీ చెల్లెళ్ళు చెప్పినట్లు మీబావలు వింటారు. మీ అమ్మగారు చెప్పినట్లు మీనాన్నగారు చేస్తారు. మీ తమ్ముళ్ళని

చూసైనా బుద్ధి తెచ్చుకోరేం... పైగా నన్ను తిట్టటం కూడాను''

''నేను... నిన్ను... తిట్టటం నువ్వు పడటం... నేను ఇలా బతుకుతున్నానంటే గాలిపీల్చి, తిండితినికాదు. నువ్వు పెట్టే తిట్లుతిని. నీ ఆటలు చూచి... అంతకన్నా ఏంచేయగలుగుతున్నాను'' రామారావు నంజాయిషి.

''మీరేకాదు... నూటికి తొంభై తొమ్మిదిమంది మగాళ్ళు చేసేదిదే. ఊరికే నలుగురి ముందూ మాత్రం డంబాలు చెప్తారు. మీరు కూడా అలాగే చెప్పండి. పరువేంపోదు'' కసిగా అనేస్తుంది అన్నపూర్ణ తొణక్కుండా.

అనుకున్నప్రోగ్రాం ప్రకారం అన్నపూర్ణ, వాళ్ళక్క, తండ్రితో కలిసి గృహప్రవేశంకి వూరుకెళ్ళిపోయారు. ఇంక మిగిలింది తను, కామేశ్వరి.

ఒంటరితనం... అలవాటులేనిప్రాణం ఏకాంతాన్ని భరించడం కష్టమేమో... తిట్టుకున్నా కొట్టుకున్నా ఏమనుకున్నా ఆ జీవితం వేరు...

రెండురోజుల తరువాత రామారావు తండ్రి వచ్చాడు. ''మీ ఆవిడ వూరికెళ్ళిందటగా..మరి మీభోజనంమాట ఏమిటి'' అని అడిగాడు వీరభద్రయ్య.

రామారావుకి ఆశ్చర్యం కలిగింది. తను ఈ విషయం తండ్రికి చెప్పలేదు. కనీసం తల్లికి కూడా. మరెలా తెలిసిందో...

''నీకు బుద్ధి, జ్ఞానం వుందా... ఇలా గృహప్రవేశాలు, బారసాలలు, పుట్టినరోజులు, చావులు, సమర్తలకు వూళ్ళు వెళ్ళటం ఏమిట్రా... మనమేమిటి... మన తాహతేమిటి... ఏది ఎంతవరకూ అవసరం అని ఆలోచించాలి. నీచెల్లెలు యిల్లు కట్టుకుంటే, గృహప్రవేశానికి రాకుండా అక్కకు రోగం వచ్చిందని పరామర్శించేందుకు వెళ్ళింది తను. నీతమ్ముడి పెళ్ళికి కూడా రాలేదు- నీ మావగారు 'పచ్చిబాలింతరాలు ఎలా వస్తుంది' అన్నాడు. మరి ఆ ముండాకొడుకు అదే ముహూర్తానికి రాజమండ్రి పెళ్ళికి ఎలా తీసుకెళ్ళాడు? అక్కణ్ణుంచి కాకినాడ ఎంతదూరం... పెళ్ళివారు బస్సు ఏర్పాటుచేశారని పోయాడు వాడు కాకినాడ. వస్తే దారి ఖర్చులవుతాయని ఆలోచించాడు.. నీ పెళ్ళానికైనా జ్ఞానం వుండద్దూ..." పెద్దకూతురి పెళ్ళిచేసి రెండెకరాల పొలం అమ్మేసావు. ఇప్పుడు కామేశ్వరి పెళ్ళి ఎలాచేస్తావు... ఏ ముండాకొడుకూ నలభై-యాభై వేలన్నా యివ్వనిదే మాట్లాడడు... నువ్విలా డబ్బుని మంచినీళ్ళల్లా ఖర్చుచేస్తుంటే, రేపు నీకు అవసరం అయినప్పుడు ఏ లంజాకొడుకు యిస్తాడు. నీ బావమరిదిని చూసైనా మారవేంటి... వాడు తల్లిని, తండ్రిని కొంపకు రానీయడు. చూడు, అన్నయ్య యింటికి గృహప్రవేశం ఎలా మానేశాడో... ఇంతకీ ఎప్పుడొస్తుంది దొరసాని'' కోపంగా నాలుగు దులిపేసాడు తండ్రి.

కామేశ్వరి తాతయ్యకు గ్లూకోజు కలిపి తెచ్చింది- ''మరి నువ్వు వెళ్ళలేదేమే, మీఅమ్మతో...'' గ్లాసు అందుకుంటూ అన్నాడు ఆయన.

''నాకు యూనిట్ టెస్టులు... ఎలావెళ్ళను'' అంది తను.

''పరీక్షలేకదా... ఇప్పుడు చూడు, నీకు పట్టు పరికిణీ ఛాన్సుపోయిందా... వెళ్ళవలసింది'' ఎగతాళిచేస్తూ అన్నాడు వీరభద్రయ్య.

''భలే తాతా... ఈ మామయ్యలు ఏంపెడతారో నాకు తెలుసు... నీకూ తెలుసు...'' వెటకారంగా అంది కామేశ్వరి.

''పోన్లేకాని మీ అమ్మ వచ్చేవరకూ మాయింటికి రండి''

''పరీక్షలున్నాయి కదా...''

''ఇంక రెండేకదా... మీ అమ్మ ఎటూ పదిహేను, ఇరవై రోజులదాకా రాదు... మీ పెద్దమ్మని చూసి వాళ్ళ ఫ్రెండ్సుని చూసివస్తుంది. మీనాన్న చేతకానివాడు... అన్నింటికీ గంగిరెద్దులా తలవూపుతూ వుంటాడు. మీనాన్న తాళం కప్పలాంటివాడు. తాళంచెవి మీ అమ్మ దగ్గరుంది''

కామేశ్వరికి తండ్రిమీద జాలిగావుంది. అటు తల్లి... యిటు తాత... ''నాన్నా... నువ్వు ఎందుకిలా అమ్మకి లొంగిపోయావు'' స్వగతంలో అనుకుంది తను.

ఆరాత్రి చాలాసేపటివరకూ నిద్రరాలేదు రామారావుకి. ఏవో ఆలోచనలు... ఒంటరిగా అన్నపూర్ణ అంతదూరం ప్రయాణం చేస్తు

న్నందుకు. ముప్పయ్ఆరు గంటల ప్ర యాణం... ఎంత వాళ్ళ అక్క తండ్రితోడుగా వుంటేమాత్రం... రోజులు ఎలావున్నాయి. మగా డికే రక్షణలేని రోజులు... ఆడవాళ్ళకి ఎక్క డుంది...

మరోవైపు ఈవిషయం తండ్రికి కూడా తెలి సినందుకు గిల్టీ... తాను భార్యని వారించలేక పోయిన విషయం మరోసారి తెలియటం... ఏమిటో ఈ పెళ్ళాలు... వీళ్ళు శారీరకంగా బలహీనులు కావచ్చు... మానసికంగా మాత్రం అబలలు కారు.

ఎప్పటికో రామారావుకి నిద్రపట్టింది.

కామేశ్వరి మాత్రం తల్లికోసం బెంగట్టుకొన్న ట్టుగా బిక్కముఖం వేసింది. అన్నపూర్ణకివేమీ పట్టవు!



మర్నాడు రామారావు ఆఫీసు కెళ్ళేసరికి అవతారం ఎదురుచూస్తున్నాడు. నిజానికి అతనిపేరు అవతారం కాదు. ఏవో రకరకాల వేషాలు వేస్తుంటాడు. ఒకవారం పంచె, లాల్చీతో వస్తాడు. మరోవారం పాంటు, షర్టు...గె డ్డం పెంచి లేటెస్టు హెయిర్ స్టైయిలు..ఒక సారి నున్నటి గుండు, దానికి సెంటునూనె...ను దుటిమీద వీభూతి రేఖలు, మధ్యలో కుంకుమ బొట్టు...మెడలో రుద్రాక్షమాల...కొన్నాళ్ళు హిప్పీ కటింగు...స్టెప్‌కటింగు...ఇలా దర్శనం యిచ్చినరోజులు కూడా వున్నాయి. కాబట్టి చాలామంది అతని పేరుని మరిచిపోయి 'అవ తారం'గా గుర్తుపెట్టుకోసాగారు.

"ఏమోయ్ రామారావు...మీ ఆవిడని ఎవ్వా రో పంపించినట్లున్నావ్... ఏం అదృష్టవంతుడి వోయ్...ఇకనీకు బోలెడు స్వేచ్ఛ, స్వాతంత్రం అన్నమాట..." అంటూ పలకరించాడు అవ తారం.

"నాబొంద అదృష్టం...అయినా నువ్వెప్పుడు చూశావ్" అని అడిగాడు రామారావు.

"నిన్న నాంపల్లి స్టేషను దగ్గర...ఉదయం ఏడు గంటల సమయంలో..ఈస్టుకోస్టు ఎక్స్ ప్రెస్‌లో మీ ఆవిడని రైలెక్కిస్తుండగా చూశా ను...నేను అప్పుడు ప్లాట్‌ఫారం మీదే వున్నా ను"

"అక్కడేంపని నీకు..."

"ఏంపని అని అడుగుతావేమిటి...మా గర్ల్ ఫ్రెండుని విజయవాడ పంపిస్తున్నాను. వాళ్ళా యన యింక వచ్చేస్తాడుట... వెళ్ళిపోతా నంది... అయినా వారంరోజులపాటు నాతో వుందిగదా... బాగోదని పంపేసాను..." గర్వంగా చెప్పాడు అవతారం.

షాక్ తిన్నాడు రామారావు. "ఏమిట్రా ఈప ని...మీ ఆవిణ్ణి పంపటందేనికి...నువ్విలా దొడ్డి దార్లు తొక్కటం ఏమిటి...మీ ఆవిడకు అన్యాయం చేయొచ్చా..."

"ఏమిట్రా అన్యాయం...మొగుణ్ణి వదిలి వూళ్ళకెళ్ళటం భార్యలకు న్యాయంగా వుందా...అసలే చలికాలం...ఏంచేసేది...ఏవో కక్కుర్తి పనులు తప్పవు..."అవతారం జవాబి చ్చాడు.

రామారావు ఏదో ఆలోచిస్తున్నాడు.

"నాకు తెలీక అడుగుతున్నాగానీ, మీ ఆవిడ ఎందుకిలా తరచుగా కాంపులు వేస్తూ వుంటుంది...నువ్వెలా మానేజ్ చేస్తున్నా వు...అంతంత డబ్బు ఎక్కడ తెస్తున్నా వు...వంటా, వార్పూ కష్టంకదా... పెళ్ళాన్ని అదుపులో వుంచకపోతే లాభంలేదు... ఇది నలుగురికీ తెలిసిందనుకో, మన పని క్లోజు. తలెత్తుకుని తిరగలేము. గుర్రం కళ్ళెం కాస్త బిగువుగా వుండాలి...."

అవతారం మాటలకు అడ్డుపడ్డాడు రామా రావు- "మరి నువ్వు ఎందుకు మీ ఆవిడని వూళ్ళకు డిస్పాచ్ చేస్తుంటావ్..."అని.

"నీకూ నాకూ తేడా లేదా. నువ్వు సంసార పక్షం వాడివి. పైగా యిద్దరు పిల్లల తండ్రివి. మరి, నేను...నీకు తెలుసుగా..నేనూ-మా ఆవి

ఉ...దాన్ని కొంపలో వుంచాననుకో, మన శృంగార లీలలు బ్రేకువడతాయి. కాబట్టి మన వ్యవహారం సాఫీగా నడవాలంటే ఏ అడ్డు వుండకూడదు.''

''మరి నీకు కావలసినట్లే, తనకు కావలసి వుండదా...అప్పుడేం చేస్తుంది తను!''

''ఏమీలేదు... మన ఫార్ములాయే ఫాలో అవచ్చు.అయినా కాకులన్నీ ఒకచోట...కొంగలు ఒక చోట చేరతాయి...నానంగతి వదిలేసి నీనంగతి ఆలోచించు...ఇన్నేళ్ళయింది కదా, మీ ఫ్రెండుని ఓసారి చూసిరారాదూ...ఇదే మంచి అవకాశం...''అవతారం రామారావులోని మనసుకి మరోసారి అంకురార్పణ చేసాడు.

నిజమే...చూస్తే బాగుంటుంది..అన్నపూర్ణ ఎంతో ఖర్చుచేసి, తనమాట వినకుండా వూళ్ళు తిరిగి వస్తుంది. కాని తాను ఒక్కసారి కూడా ఆమెను చూడాలనుకున్నా కుదరటంలేదు. బలమైన తన మనను జేబుకి లొంగిపోతోంది...ఇప్పుడే అవతారంగారిని వదిలించుకోవాలి...కామేశ్వరిని, తండ్రి దగ్గరకు పంపి, తను ఆమె దగ్గరకెడితే మంచిది.

అవతారం వెళ్ళగానే అరుణ వచ్చింది- ''నమస్తే అంకుల్...మీరు చూపించిన యిల్లు బాగుంది...మా అమ్మకి రమ్మనమని రాసాను. ఎల్లుండి రావచ్చు...మీరోసారి మా కొత్తయింటికి అప్పుడు రావాలి...'' అందామె.

''తప్పకుండా వస్తానమ్మా'' అన్నాడు రామారావు.

అరుణ రామారావుతో తాను ఉద్యోగంలో చేరిన నాలుగురోజులకే చెప్పింది ''నాకు ఏమైనా రెండుగదుల యిల్లు చూపించండీ, అద్దె ఎంత తక్కువైతే అంత మంచిది...అమ్మని నా దగ్గర వుంచుకోవాలి''

''మీ అన్నయ్య దగ్గర వుంచితే బాగుంటుందేమో...''

''నిజమే..కాని వాడు ఒప్పుకోవడంలేదు. వదినకూడా నరే అని వంతపాడింది. నాకూ తోడుగా వుంటుంది. పైగా ఒంటరిగావుంటే ఏవో జ్ఞాపకాలతో అమ్మ బాధపడుతూ వుంటుంది. ఊరుమారితే కొంతఅయినా మార్పు వుంటుందని...'' చెప్తోంది అరుణ.

ఆమె మాటల్లోని వాస్తవం గుర్తించాడు రామారావు.

''మా నాన్నపోతూ ఎనభైవేల అప్పు మిగిల్చి పోయాడు. అది మేమే తీర్చాలి...కాబట్టి దయచేసి తక్కువ అద్దెలో చూడండి.''

''అంత అప్పు ఎందుకు చేసినట్లు''

''ఎందుకేమిటి...ఖర్మ...దయచేసి ఆ వివరాలు అడగకండి సార్. వీలైనప్పుడు చెప్తాను- ప్రస్తుతానికి వదిలెయ్యండి''

అప్పట్నుంచీ రామారావు సిన్సియరుగా ఇంటికోసం వేట ప్రారంభించాడు. మొత్తానికి నూటయాభై రూపాయల అద్దెతో రెండు చిన్నగదుల యిల్లుచూసి చెప్పాడు అరుణకు... ఓరోజు ఆఫీసునుంచే తీసుకెళ్ళి చూపించాడు. ఆమెకు నచ్చింది. వెంటనే అడ్వాన్సు తీసిచ్చింది.

రామారావుకి ఆమెను చూస్తూంటే హృదయం ద్రవించి పోతూ వుంటుంది. అరుణ చాలా సామాన్యంగా వస్త్రధారణ, అలంకరణ చేసుకుంటుంది. ఓవిధంగా తండ్రి మరణం ఆమెను జీవచ్ఛవంగా మార్చివేసిందని గ్రహించాడు. టైముకి ఆఫీసుకి వస్తుంది. లంచ్ టైములో సీటులోనే కూర్చుని టిఫిన్ చేస్తుంది. ఒక్కొక్కరోజు అదికూడా వుండదు. కాఫీ కూడా తాగదు. ఎప్పుడైనా తనే ఇప్పిస్తూ వుంటాడు. ఆమె మనస్తత్వం పూర్తిగా తోటి స్త్రీలకు భిన్నంగా వుంది.

వ్యాపారంలోకి అడుగుపెట్టేవాళ్ళు- ఎంత సంపాదించాలి, పన్నులు ఎలా ఎగవేయాలి, ఎలా మోసం చేయాలని ఆలోచిస్తారుట.

రాజకీయాల్లో ప్రవేశించేవాళ్ళు- స్వార్థం, స్వప్రయోజనం గురించి ఆలోచిస్తూ ప్రభుత్వ నిధులు ఎలా దుర్వినియోగం చేయాలని దేవుడికి ప్రార్థనలు చేస్తుంటారుట- తుఫానులు, వరదలు వీలైనన్ని ప్రసాదించమని, ప్రజల నుంచి విరాళాలు విరివిగా ఇప్పించమని కోరుతారట

మరి అరుణ ఎందుకిలా నిర్లిప్తంగా వుంటోంది! ఏమో తెలియదు. వయసులేకనా...అనుభవం చాలకనా...రామారావు అరుణ గురించి ఆలోచిస్తున్నాడు.

★ ★ ★

''రండి...అంకుల్...ఇదే మా యిల్లు''

ఇప్పుడు

# సెరిలాక్®

## కాయగూరల మంచితనంతో బాటు






## మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందించడానికి మరొక మార్గం




ఇదిగో, కేరట్‌లు, టొమెటోల మంచితనం చేర్చబడిన కొత్త సెరిలాక్ వెజిటబుల్. మీ బాబు కొత్త రుచులను అలవరుచుకుంటున్నప్పుడు మీరు అతని ఆహారంలో వైవిధ్యం చేర్చేందుకు.

సెరిలాక్ వెజిటబుల్‌కి సెరిలాక్ లాభాలన్నీ కూడా ఉన్నాయి-ప్రతిసారి తినిపించినప్పుడు పరిపూర్ణమైన పోషక శక్తి, చక్కటి రుచి, క్షణాలలో తయారుకావడం.

4 నెలల నుంచి మీ పాపాయికి పాలు త్రాగించడంతో బాటు, ఘన ఆహారం కూడా అవసరం ఉంటుంది. అతనికి సెరిలాక్ లాభాన్ని అందించండి. 4 నెలల నుంచి సెరిలాక్ వీట్ యివ్వటంతో మొదలుపెట్టండి. 6 నెలలు వచ్చిన తరువాత మీ పాపాయికి కొత్త సెరిలాక్ వెజిటబుల్, లేదా సెరిలాక్ ఆపిల్ లేదా సెరిలాక్ ఆరంజ్ యివ్వండి-మీకు ఏది నచ్చితే అది.

పరిశుభ్రంగా తయారుచేయడానికి, మీ పాపాయికి సమతూకంలో పోషకాహారం సమకూర్చేందుకు, దయచేసి, డబ్బా మీద ఉన్న సూచనలను జాగ్రత్తగా అనుసరించండి.

RK SWAMY/FSL/5463 TEL

**సెరిలాక్ రకణ: పోషకాహారంతో పరిపూరం-ఎంతో రుచికరం**

Nestlé

అంది అరుణ రామారావుని లోపలికి ఆహ్వాని స్తూ.

"భలేదానివే...ఇల్లు చూపించింది నేను...నాకు తెలియనట్లు చెప్తున్నావే..." అన్నాడు అతను నవ్వుతూ.

"సారీ...అంకుల్" అని అరుణ బజరు నొక్కింది.

తలుపులు తెరుచుకున్నాయి.

అరుణతోపాటే రామారావు లోపలికి నడిచాడు.

ఆమె కుర్చీ చూపించింది. వంటగదిలోకి వెళ్ళి తల్లిని పిలిచింది. "అమ్మా...మా సెక్షనాఫీసరు వచ్చారు...ఒకసారి రా అమ్మా"

"వద్దులేమ్మా...నాకా అదృష్టం లేదమ్మా...నువ్వే మాట్లాడి పంపించేసేయి..." అంది తల్లి విచారంగా.

"ఏమిటమ్మా...ఇంకా ఎన్నాళ్ళని యిలా బాధపడతావు...ప్రయోజనం ఏమన్నా వుందా...నేను ధైర్యంగా వుండటంలేదూ...నిన్ను ఈవూరు ఎందుకు తీసుకువచ్చానని...నాన్న తన ఋణం తీర్చుకుని వెళ్ళిపోయాడు...అంతవరకే ప్రాప్తం...పదమ్మా..." అంటూ వేడుకుంటోంది అరుణ.

ఇంక తప్పలేదు.

అరుణ ముందు వస్తే, తల్లి వెనకాలే వచ్చింది తలవంచుకుని.

భుజంచుట్టూ పమిటికొంగుని కప్పుకుంది ఆమె తల్లి.

"నమస్కారం" అందామె కొంచెం తలఎత్తి చూసి.

రామారావు చటుక్కున తలఎత్తాడు- చేతిలోని పత్రిక కిందపడవేసి...ప్రతి నమస్కారం చేశాడు. అంతే, ఆశ్చర్యం...ఎదురుగా కళ్యాణి ...చంద్రుడు లేని నీలాకాశం లాగా...ఆమె నుదురు బోసిపోయింది...ఏమైంది...అని ఆలోచించేలోపలే కళ్యాణికి కళ్ళుతిరిగాయి. అంతే, నేలకొరిగిపోయింది.

రామారావు ముందుకు నడిచాడు. "అంకుల్...నాన్నగారు పోయినప్పట్నుంచీ అమ్మకిలాగే అవుతోంది....ఫిట్సులాగ వస్తున్నాయి" అంది అరుణ బేలగా చూస్తూ.

రామారావు కళ్ళు చెమరుస్తున్నాయి. కళ్యాణిని ఇన్నేళ్ళ తరువాత ఇలా...ఈరూపంలో చూస్తానని అనుకున్నాడా తను! ఇది దైవికమా...దురదృష్టమా...

"అరుణా...కొంచెం గ్లూకోజు కలిపి యివ్వు..." అన్నాడు.

"తాగదండీ...అయిదు పదినిమిషాల్లో లేస్తుంది"

"గ్లూకోజు తాగితే కొంచెం బలంగా వుంటుంది"

గ్లూకోజు లేదు...ఆ విషయం చెప్పేందుకు అరుణ సందేహిస్తోంది. రామారావు గ్రహించాడు అది. "సెంటర్లో దుకాణం వుందికదా...నేను వెళ్ళి తెస్తాలే, ఫరవాలేదు" అన్నాడు లేస్తూ.

"మీరు వద్దులెండి...నేనే తెస్తాను" అంది అరుణ బయలుదేరుతూ...రామారావు కళ్యాణి వైపే చూస్తున్నాడు బేలగా. కొంచెంసేపటికి ఆమె తేరుకుంది.

"ఏమిటి కళ్యాణీ...నిన్నిలా చూడవలసి వచ్చిందా...ఏంజరిగింది?" పరామర్శగా పశ్నించాడు అతను ఎంతోబాధగా.

"ఇది నా తలరాత...అంతే" అంది ఆమె.

"నాకు చెప్పకూడదా..."

"చెప్పొచ్చు... కాని మీరేం చేయగలరు?"

"కాని నావల్ల ఏదైనా సాయంకావాలంటే చేస్తానుకదా..."

"మనిషిని డబ్బు పిచ్చివాడిని చేస్తుంది. అది ఎంతపైకి తీసుకెడుతుందో అంత పాతాళానికి తీసుకుపోతుంది. ఏముంది...ఆయన్ని తమ్ముళ్ళే చంపేశారు...ఆస్తి కోసం" చెప్తోంది కళ్యాణి.

"తమ్ముళ్ళు ఇంతపని చేస్తారని నేననుకోను"

"అవును... అనుకోలేదు నేనుకూడా. కాని నాలుగో మరిది వెయ్యి రూపాయలు యిమ్మన్నాడు. ఆయన లేవన్నారు. కాని ఆ తాగుబోతుముండాకొడుకు నా మెళ్ళో పసుపుతాడు తెంపబోయాడు. సరిగ్గా నాలుగు నెలలు తిరిగేసరికి నా తాడే తెగిపోయింది - ఇలాగ"

రామారావు అడిగాడు.

"నేను అబద్ధం చెప్తున్నాననుకుంటు న్నారా..."

"లేదు...కాని" ఏదో చెప్పబోయాడు అతను.

"మా ఆయన పెద్దకొడుకుకాబట్టి, మావగా రు యింటి బాధ్యతల్ని మాకు అప్పగించారు. మావగారు పోయిన పదిహేనురోజులకే ఆస్తు లు-పంపకాలు అంటూ పట్టుపట్టారు మరుదు లు. మా ఆయన నోరు మెతకది. తమ్ముళ్ళు అడిగిందే తడవుగా అప్పుచేసి డబ్బు యిచ్చే వారు. అయితే వాళ్ళు బాగుపడ్డారు...మేము ఇలా భ్రష్టుపడ్డాము..."

"మరి నీ ఉద్యోగం"

"పెళ్ళయిన అయిదేళ్ళు చేసి మానేశాను"

"ఇంతకీ ఎలా చంపేరంటావు వాళ్ళు - ఆ ఆయన్ని" ప్రశ్నించాడు రామారావు.

"ఒకరోజు రాత్రి తొమ్మిదిగంటలవేళ, ఆయన సినిమా చూసి వస్తున్నారు. ఒకలారీ గుద్దేసింది...అంతే... చచ్చిపోయారాయన"

"అయితే-మీ మరుదులు అని చెప్పా వుగా"

"వాళ్ళే డ్రైవరుకు డబ్బులిచ్చి లారీ ఎక్కించేయమన్నారుట...పోలీసులకు డబ్బి చ్చి కేసులేకుండా- బ్రేకుపాడైపోయిందని రాయించి బైటపడ్డారు వాళ్ళు. డబ్బు ఏపనైనా చేయిస్తుందికదా- మనిషిని బతికించడం తప్ప...చివరికి వాళ్ళు ఏవో దొంగ ప్రామిసరీ నోట్లు సృష్టించి- అప్పులకింద ఆఫీనునుంచి వచ్చిన గ్రాట్యుటీ, ప్రావిడెంట్‌ఫండు, ఇన్సూరె న్సు డబ్బు డెబ్బయ్‌వేలదాకా రాబట్టుకున్నా రు. అన్నగారిని తగలబెట్టి స్నానం చేసిపోయా రు ఆ వెధవలు. కనీసం పదకొండోరోజున కూడా ముఖం చూపించలేదు. ఆఫీసునుంచి డబ్బు వచ్చేవరకూ మా అబ్బాయి చుట్టూ తిరిగారు. ఆ తరువాత మళ్ళీ గుమ్మం తొక్కలే దు. చివరికి యిల్లుకూడా అమ్మించి నన్నూ-నా పిల్లల్ని రోడ్డున పడేయాలని నిర్ణయించుకు న్నారు...ఇదండీ నా కథ"

"మీ అమ్మగారు ఎప్పుడుపోయారు" అడి గాడు చటుక్కున.

"అయిదేళ్ళు అయింది"

"మీవాడేం చేస్తున్నాడు?"

ఎవరిని అంటే ఏంలాభం! వాడూ - పెళ్ళాం కలెక్టరు ఆఫీనులో పనిచేస్తున్నారు - వాడు కూడా వాళ్ళ బాబాయిల మనిషే...అంతా సర్వ నాశనమైపోయింది. ఒక కూతురి పెళ్ళిచేసి ఆయన వెళ్ళిపోయారు- అరుణని నాకప్ప గించి. ఎలా చేస్తానో...ఏంచేస్తానో..." కళ్యాణి గద్గదికంగా చెప్తోంది. కన్నీళ్ళు ధారాపాతంగా స్రవిస్తున్నాయి.

"ఏంబాధపడకు కళ్యాణీ...ఇది దేవుడి పరీక్ష...ఏ సమయంలో ఎటువంటి ఇబ్బందు లు, సమస్యలు, కష్టాలు వస్తాయో మనం ఏంచెప్పగలం...కాలంతోపాటే మనమూ నడ వాలి" రామారావు వేదాంత ధోరణిలో చెప్తున్నా డు.

"మీ నాన్నగారు, అమ్మగారు బాగున్నా రా...పిల్లలేం చదువుతున్నారు?" కళ్యాణికి కొ ద్దిగా ధైర్యం కలుగుతోంది.

"అంతా బాగానేవున్నారు. నేను పెద్ద మ్మాయి పెళ్ళిచేశాను. అల్లుడు విజయవాడ లో-రైల్వేలో-పెర్సనల్ బ్రాంచిలో పనిచేస్తున్నా డు. రెండో అమ్మాయి, కామేశ్వరి ఇంటర్ చదువుతోంది...ఓ చిన్నయిల్లు కట్టుకున్నా ను...ఏదో కాలక్షేపం చేస్తున్నాను" నిర్లిప్తంగా చెప్తున్నాడు రామారావు.

"నేనెప్పుడైనా గుర్తుకు వస్తానా?" ఏ మాత్రం సంకోచం లేకుండా అడిగింది కళ్యా ణి.

"భలేదానివే...నా పరిస్థితులు, నావ్యవ హారం చెప్పుకుంటే సిగ్గుచేటు. నీ ముందిలా నోరువిప్పి మాట్లాడుతున్నానుకాని- మా ఆవిడ ముందు నోరు ఎత్తే ధైర్యంకాని, తను చెప్పినదా నికి కాదనే తెగింపుకాని లేవు. నేను మొగుణ్ణే కావచ్చు... అంతకు మించి మగాణ్ణి కావచ్చు... అయితే ఆ రెండూపెళ్ళయిన అయిదేళ్ళకే నానుంచి వేరయిపోయాయి. నాదనుకున్న నామనిషి నాకు జీవితం చూపించిన మనిషి, నాకు మాటలు నేర్పిన మనిషి, నాచేత ఉద్యోగ ప్రయత్నాలు చేయించిన మనిషి, ఆఫీసులో అనుక్షణం గుర్తుకువచ్చే మనిషి, నాకెవరున్నా రు చెప్పు-నువ్వు తప్ప! ఆ జ్ఞాపకాలే నన్నింకా యిలా బతికిస్తున్నాయి. లేకపోతే ఏనాడో..."

రామారావు మాటలకు కళ్యాణి అడ్డువడింది- "మీరామాట అనకండి. ఇప్పటికే నేను బోలెడు దుఃఖంలో ఉన్నాను. ఇటువంటి పరిస్థితి ఏ స్త్రీకి రాకూడదు. స్త్రీకి యిటువంటి బతుకు నరకం...దయచేసి మీరు ఎటువంటి పిరికి పనులు ఆలోచించకండి" అంటూ.

"మన చేతుల్లో ఏవుంది... అంతా వాడి లీల" అన్నాడతను.

"కాని మన ఆలోచనలు, చేతలకు తోడవుతాయి కదా..."

"నిజం కళ్యాణి...నీమాటలే అప్పుడప్పుడు కొండంత ధైర్యాన్ని ఇస్తుంటాయి- టానిక్కులా పనిచేస్తుంటాయి"

"నా కూతుర్ని కాస్త జాగ్రత్తగా చూస్తూ ఉండండి. తండ్రిలేనిపిల్ల అది. ఈ తండ్రి చేతిలో పడటం దాని అదృష్టం. ఊరుకాని ఊరు. కొత్తజీవితం...బతకటానికి వచ్చింది. దానికి మీరే భవిష్యత్తు చూపించాలి. దాన్ని కూడా ఒక అయ్యచేతిలో పెట్టేస్తే, ఈ జన్మకీ బంధం తప్పుకుంటుంది. తరువాత నేను ఏమైనా ఫరవాలేదు. ఆయన వెళ్ళిపోయినా, బతికున్నందుకు నాకు తప్పదు కదా..."

అంతలో అరుణ వచ్చింది.

"ఇంత ఆలస్యం అయిందేం?" అడిగాడు రామారావు.

"ఏవో చెత్తకంపెనీ తయారీలున్నాయి అంకుల్.. దూరం వెళ్ళేసరికి ఆలస్యం అయింది" అంటూ వెంటనే లోపలికెళ్ళి గ్లూకోజు కలిపి కళ్యాణికి యిచ్చింది. మరోగ్లాసుతో రామారావుక్కూడా యిచ్చింది.

పదినిమూషాల తరువాత వెళ్ళిపోయాడు అతను.

రోడ్డుమీద నడుస్తున్నాడేగాని, ఏవో ఆలోచనలు. కళ్యాణికి వాగ్దానాలు చేసాడేకాని, వాటిని నిలబెట్టుకునే ధైర్యం తనకుందేమిటి ? అన్నపూర్ణకిది తెలుస్తే, తను ఏంకావాలి...ఏదో భయంతో నడుస్తున్నాడు.

ఇలాంటపుడు రామారావుకి ప్రకాశరావు గుర్తుకొస్తుంటాడు. నిజమేమరి... ఎందుకు గుర్తురాడు ! ఇద్దరూ ఒకేపేటలో వుంటున్నారు. ఇద్దరివయసూ ఇంచుమించుగానే వుంటుంది. ఆలోచనలుకూడా ఒకేవిధంగా ఉంటాయి. ప్రకాశరావు జీవితంతో పోరాడాడు. విధిని ఎదిరించాలనుకున్నాడు. అయితే అతని జీవితంలో 'విధి' అంటే కనిపించని శక్తి కాదు. కేవలం జీవితభాగస్వామిని- "దమయంతి" ఆమె గొప్పింటిబిడ్డకాకపోయినా గొప్పింటి ఆలోచనలు, పద్ధతులు మాత్రం పుష్కలంగా ఉన్నాయి. గొప్పవారితో కష్టమే మరి- ఏవిషయంలో చూసినా!.

ఆ ప్రకాశరావు ఎనిమిదినెలల క్రితం హటాత్తుగా చనిపోయాడు.

ఎనిమిది నెలలక్రితం... ఓ ఆదివారం పొద్దున్నే... తూర్పుదిక్కు యింకా వెలుగురేఖలను ప్రసరించలేదు. వీధుల్లో పాలవాళ్ళ అరుపులు, పేపరుబోయ్‌ల కేకలు, పనిమనుషులు చేసే గేటు చప్పుళ్లు యింకా వీధుల్లోకి క్లయిమాక్సు స్థాయికి చేరకముందు-

రామారావు యింటితలుపు చప్పుడయింది.

అన్నపూర్ణ యింకా నిద్రలేవలేదు.

గడియారం వైపుచూశాడు- అయిదు గంటల పదినిముషాలు. రామారావు లేచి తలుపుతీశాడు. ఎదురుగా ప్రకాశరావు రెండో కూతురు నిలబడింది... ఆమె అతన్ని అల్లుకుపోయి భోరున ఏడవసాగింది. అతనికి అర్థంకాలేదు విషయం...

"ఎందుకు ఏడుస్తున్నావు" అనునయంగా అడిగాడు రామారావు. "ఉన్నపళంగా మీరు మా ఇంటికి రావాలి" అంటూ కళ్ళు తుడుచుకుందామె.

"విషయం ఏమిటమ్మా... "తిరిగి ప్రశ్నించాడతను.

"ముందు పద్దవేనుకోండి"...

రామారావుకి అగమ్యగోచరంగావుంది. అన్నపూర్ణతో చెప్పి, తలుపులు దగ్గరగా వేసి ప్రకాశరావు యింటికి నడిచాడు.

వారిరాకకోసం ఎదురుచూస్తున్న దమయంతి, వాళ్ళు లోపలకు రాగానే తలుపులువేసేసి, పడకగదిలోకి తీసుకువెళ్ళి ఏడవసాగింది. కిందపడివున్నాడు ప్రకాశరావు. అతను రక్తంమడుగులో పడివున్నాడు. బనీను, పంచె,

''ఏంజరిగింది?'' దమయంతిని అడిగాడు రామారావు.

పావుగంట క్రితం చనిపోయేముందు ప్రకాశరావు చెప్పిన మాటలు చెప్పింది- ''దమయంతీ... నేనింక రెండుమూడు క్షణాలకంటే బతకను. నేనింక యీ జీవితాన్ని నడిపించలేను. నేను పిరికివాడిని, అసమర్థుడిని... చేతగానివాడిని... కారణాలు నీకు తెలుసు.. నేను తెల్లవారుఝామున మూడింటికి నల్లుల మందు తినేసాను. ఇప్పటికి అది పనిచేస్తోంది కాబోలు... వికారంగా వుంది... ఒకవేళ రక్తం వాంతి అయితే మాత్రం వెంటనే నీళ్ళతో కడిగేసేయి... ఎందుకంటే నేను ఆత్మహత్య చేసుకున్నానని అందరికీ తెలుస్తుంది. పోలీసులు వచ్చి కేసు రాస్తారు. శవపరీక్ష చేస్తారు. లేనిపోని గొడవలు... మీరు యిబ్బందుల్లో పడిపోతారు... నలుగురిదృష్టిలో తేలికైపోతారు. రామారావు మీకు అన్నివిధాల సాయపడతాడు... అతనికి తప్ప ఎవరికీ యీ విషయం చెప్పద్దు. అతనే అన్ని చక్కబెడతాడు... ''

ఇదంతా కేవలం రెండునిముషాల్లో చెప్పి కన్నుమూశాడు ప్రకాశరావు.

అంతావిని రామారావు ఓక్షణం ఆలోచించాడు.

''రాత్రి ఎన్నిగంటలకొచ్చాడు యింటికి'' దమయంతిని అడిగాడు అతను.

''ఒంటిగంటయింది'' చెప్పిందామె.

'''పేకాటకెళ్ళాడా... ''

''తెలీదు''

ప్రకాశరావుకి పేకాట వ్యసనం వుంది. తరచు క్లబ్బుల్లోనే గడుపుతుంటాడు... రామారావుకి తెలిసినంతవరకూ పదిహేను ఇరవై వేలదాకా అప్పులున్నాయి. ఇక క్లబ్బులోనే ఆరేడువేలు యివ్వాల్సిన మరో బాకీ కూడా రామారావుకి తెలుసు.

''ఏమయ్యా ప్రకాశరావు... ఏమిటీపేకాట... ఎవరు తిన్నట్టు. అనవసరంగా అప్పుల్లో పడిపోతున్నావు... మానేసేయ్...'' ఎన్నోసార్లు హెచ్చరించాడు రామారావు.

''లాభంలేదయ్యా... ఇంటికెళ్ళి పెళ్ళాంతో ఎందుకు గొడవ.. రభస... ఎటూ ఈ సంసారం బాగుపడదు... ఇక్కడున్నంతసేపూ డబ్బుపోయినా మనశ్శాంతిగా వుంటుంది... నేను యిలాగే పేకాటలోనే చచ్చిపోతాను'' అనేవాడు ప్రకాశరావు తరచు.

రామారావు దాదాపు అయిదారువేలు దాకా అప్పు యిప్పించాడు - నూటికి అయిదురూపాయలు వడ్డీ నెలకు...

అతని చావుకు పద్దెనిమిది రోజులక్రితం మరో కొత్తఅప్పు.

ఆ డబ్బంతా నెలలో పోగొట్టుకున్నాడు ప్రకాశరావు.

తిరిగి ఇప్పించమని అడిగాడు అతను.

''సారీప్రకాశం... నేను అప్పు ఇప్పించటంవల్లనే నువ్వు పేకాటలో పోగొట్టుకుంటున్నావు... నా కారణంగా నువ్వు పాడైపోతున్నావు... ఇక నేను నీకు అప్పు ఇప్పించను. మన షావుకారు కనీసం మూడువేలయినా చెల్లు వేయించమని అడుగుతున్నాడు— దీపావళినాటికి- అదేదో చూడు'' అన్నాడు రామారావు.

''ఏమిటి... నేను వడ్డీ ఇస్తున్నాను కదా క్రమంగా... అటువంటప్పుడు ఏమిటి ఆ షావుకారుకి ఇబ్బంది...''

''చూడు ప్రకాశం... అప్పుచేసి పేకాటలో పాడుచేస్తున్నావు నువ్వు. పెళ్ళి చేయవలసిన కూతురు ఉంది నీకు. రోజులు ఎలా ఉన్నాయో నీకు తెలియనిదికాదు. కట్నాలు, కానుకలు, ఖర్చులు, ధరలు చూస్తున్నావుగా... అప్పుచేసినా బంగారమో, వెండో కొంటే అదివేరు. ఏదో అవసరానికి ఉపయోగపడుతుంది'' రామారావు సలహా అది.

''రామారావు... నేను నూటఏభై రూపాయల జీతంతో ఉద్యోగంలో చేరాను... ఈరోజు నాలుగువేలదాకా సంపాదిస్తున్నా— చేతికి వచ్చేది వెయ్యిరూపాయలు... ఎందుకంటావు... ఆఫీసులో చేసిన అప్పుల నిమిత్తం... ఎందుకు చేసానంటావు ఆ అప్పులు... దమయంతి కోసం... ఆమె భేషజాలు, ఆడంబరాలకోసం... నా మాట ఎప్పటికైనా నెగ్గిందా... అప్పులకు అలవాటయిపోయాను. తీర్చలేనని నాకూ తెలుసు. రిటైరయ్యాక వచ్చే గ్రాట్యుటీ, ప్రావిడెంటుఫండు, ఇన్సూరెన్సు డబ్బుతోనైనా అప్పులు తీర్చగలనేమో...'' ప్రకాశరావు ...

బు వేదాంత ఫక్కీలో ఉంది.

"ఆరోగ్యాన్ని పాడుచేసుకుని, నిద్రమానుకుని, డబ్బుపోగొట్టుకుంటున్నావు నువ్వు... చదువుకున్నవాడివి, నువ్వే ఇలా చేస్తే ఎలా..."

"ఏంలాభంలేదు రామారావూ"

"ఆ ఖర్చేదో నీకడుపుకి, నీవారి కడుపులకు పెడితే మంచిది. అంతేగాని పేకాడి ఎదుటవారి కడుపులు నింపేందుకు నువ్వేం కుబేరుడివా కావు. అయినా ఏమిటీ వ్యవసనం..." అని కూడా మందలించేవాడు తరచు రామారావు.

కాని, ప్రకాశరావు వినిపించుకోలేదు. "అద్రస్సులేని ముండాకొడుకులు వచ్చి తినిపోయే ఇల్లు మాది. నేను కాదంటే మాత్రం దమయంతి వింటుందా... పైగా బహుమతులు... పోతేపోనీ... ఎలాపోయేది అలాపోతుంది" అంటూ.

రామారావు ఆలోచనలు ఆగిపోయాయి.

"రాత్రి ఇంటికి వచ్చాక మీ ఇద్దరికి పోట్లాట జరిగిందా?" దమయంతిని అడిగాడు రామారావు.

"పోట్లాటా నా మొహమా... వచ్చీరాగానే, లుంగీ కట్టుకుని నిద్రపోయారాయన..." చెప్పింది దమయంతి.

"నిన్న ఆఫీసులో బట్వాడా చేయవలసిన సొమ్ము ఏమైనా మిగిలిందా?"

వారంవారం ప్రకాశరావు ఆఫీసులో బట్వాడాలు చేస్తున్న పైకం గురించి గుర్తు కొచ్చింది ఆమెకు. వెంటనే హేంగరుకున్న ప్యాంటుజేబు చూసింది. అందులో ఒకచీటీ... నాలుగొందలు ఉన్నాయి. చీటీలో ఈ విధంగా రాసివుంది- "కంట్రాక్టరు చెల్లింపులో మూడు వేలు నేను వాడుకున్నాను. నాలుగొందలు మిగిలాయి. కంట్రాక్టరు వస్తే అతనికి వెంటనే చెల్లించండి... లేకపోతే గొడవయిపోతుంది..." అని.

రామారావుకి విషయం బోధపడింది.

"ఇప్పుడేం చేద్దాం..." అని అడిగాడు అతను.

"మీరే చెప్పండి..." దమయంతికి అంతకన్నా ఏం చెప్పేందుకూ తోచలేదు. భర్త చేసిన పని ఆమెను మరింత సంధిగ్ధావస్థలో పడేసింది.

ను, లుంగీ తీసేసి మరోబనీను, లుంగీ చుట్టపెట్టాడు. ముఖానికివున్న రక్తాన్ని శుభ్రంగా కడిగేసాడు. నేలమీదవున్న రక్తపు మడుగుని లుంగీతో తుడిచేసి, తడిగుడ్డతో శుభ్రం చేశాడు. ఓసారి శవంవైపు చూశాడు. రకరకాల భంగిమల్లో నిలబడి చూశాడు. ఎక్కడా అనుమానం కల్గలేదు.

"ఈ విషయం పొరపాటున కూడా బయటకు పొక్కకూడదు" అంటూ దమయంతి వైపు, కూతురువైపు చూశాడు.

రక్తపుబనీను, లుంగీ పెరట్లోవున్న గోతిలో కప్పెట్టాడు. "ఎవరెవరికి ఫోనుచేయాలి... మీవాడు అత్తారింటికెళ్ళాడేమో కదా..." అన్నాడు రామారావు.

"నాకేంతోచటంలేదు... మీరే ఈ వ్యవహారాన్ని నడపండి..." అంటూ భోరుమంది దమయంతి.

రామారావు తిన్నగా వీధిచివరవున్న డాక్టరు దగ్గరకెళ్ళి పిలుచుకువచ్చాడు ఫార్మాలిటీ కోసం.

డాక్టరు పరీక్షచేసి- "ప్రాణంపోయి అరగంట అవుతుంది. రాత్రి ఏం తిన్నారు?" అని అడిగాడు.

దమయంతి కంగారుపడింది.

రామారావు తొణక్కుండా చెప్పాడు- "మా ప్రకాశం రాత్రిళ్ళు భోజనం చేయడు...పడదని. అతనికి ఆరోగ్యంపట్ల శ్రద్ధ ఎక్కువ. ఈమధ్య సిగరెట్లు కాల్చటం కూడా తగ్గించేశాడు. పేకాట కూడా మానేసాడు"

"ఫ్రెండ్సు పిలిస్తే పార్టీకెళ్ళారా రాత్రి" ఏదో ఆలోచిస్తూ అడిగాడు డాక్టరు.

"అటువంటిదేమీలేదు..." మింగుతూ చెప్పాడు రామారావు.

"మిగిలిన వ్యవహారం కోసం ఏర్పాట్లు చేసుకోండి" అని చెప్పి వెళ్ళిపోయాడు డాక్టరు.

అప్పటికా గండం గడిచింది.

రామారావు మిగిలిన వ్యవహారం చూశాడు.

సాయంత్రం అయ్యేసరికి ఈ సమస్యకు పరిష్కారం లభించింది. ప్రకాశరావు కొడుకు అయిదోరోజుకి వచ్చాడు.

" ఏంరామారావుగారూ...మీ ఫ్రెండు, అంటే మా నాన్న ఎలాపోయాడు?" అని అడిగాడు ప్రకాశరావు ఏకైకపుత్రుడు.

"హార్టుఫెయిల్యూర్ అన్నాడు డాక్టరు" చెప్పాడు రామారావు.

"అందుకు డాక్టరుకు ఎంత యిచ్చారు డబ్బు?"

రామారావు ఆశ్చర్యపోయాడు. "ఎందుకు" అని వెంటనే అడిగాడు.

"ఎందుకేమిటి...ఓ పెద్దగండంనుంచి తప్పించినందుకు"

"భలేవాడివే...ఏమిటామాటలు...అబద్ధం చెప్పాల్సిన అవసరం ఏమిటి?" అని బుకాయించాడు రామారావు.

"పోనీలెండి...ఏదో మీదయవల్ల ఓపెద్ద సమస్యకు మంచిపరిష్కారం చూపించారు. ఇంతకీ మా నాన్నకు ఆఫీసునుంచి ఏమాత్రం డబ్బువస్తుంది" అడిగాడు ఆ సుపుత్రుడు.

"ఇపుడే ఆ గొడవలన్నీ ఎందుకు..." పెద్దరికం చూపెడుతూ అన్నాడు రామారావు.

"అలా అనకండి...ఎప్పటికప్పుడు యిటువంటి వ్యవహారాలన్నీ పూర్తయిపోవాలి...మానాన్న చావు, కర్మకాండల వ్యవహారం మీ ఆధ్వర్యంలో పూర్తయ్యాయి. మిగిలిన వ్యవహారం కూడా జరిపించి పుణ్యం కట్టుకోండి...ఎనభైవేలదాకా అప్పులున్నాయి నాన్నకు. డైరీలో అంతా రాసివుంచాడాయన. వచ్చే డబ్బు అందుకు సరిపోవచ్చు. ఇకపోతే చెల్లాయి వివాహం చేయాలి. ఇల్లు అమ్మేస్తాను- మంచి బేరం చూడండి" నిశ్చయంగా చెప్పాడు సదరు సుపుత్రుడు ఏసంకోచం, బెదురూ లేకుండా.

దమయంతికి కొడుకు ప్రవర్తన కోపాన్ని కలిగించినా నిస్సహాయంగానే వుండిపోయింది.

ఆరునెలలయ్యేసరికి ప్రకాశరావు ఇంటివరిస్థితి ఓ తీరుకి వచ్చింది. రామారావు ఆధ్వర్యంలో వ్యవహారాలన్నీ పూర్తయ్యాయి.

దమయంతికి భర్త మరణంద్వారా తొంభైవేలు లభించింది. అప్పులు దాదాపుగా తీర్చేసింది. కర్మకాండలు, దానధర్మాల నిమిత్తం యించుమించు పదిహేనువేలు ఖర్చయింది. కూతురి ఉద్యోగం నిమిత్తం పదివేలు ఖర్చయింది. ఎలాగైతేనేం కుటుంబం ఒడ్డుకి చేరింది.

ఇప్పుడా కూతురు ఉద్యోగస్తురాలు. ఒకప్పుడు ఆమెను చూసిన వరుడు- అప్పట్లో కాదన్నా యిప్పుడు "చేసుకుంటాను" అన్నాడు ఆమెకొచ్చే పధ్నాలుగొందల ప్రభుత్వ ఉద్యోగం చూసి.

రామారావు ఈసారథ్యం కూడా చేపట్టాడు.

ముప్పయ్‌వేలు కట్నం...పాతికవేలు పెళ్ళి ఖర్చు.

ఇల్లు అమ్మించకుండా, సహకారసంఘంలో తాకట్టుపెట్టించి యీ వివాహ ఖర్చు సంపాదించాడు రామారావు.

దమయంతికిప్పుడు ఏబాధా, సమస్యా, కష్టంలేదు. నెలనెలా వెయ్యిరూపాయల పెన్షనుగా వస్తోంది. చెప్పినట్టువిని పడుండే అల్లుడు...పైగా ఇల్లరికపు పద్ధతిలో...అప్పుడప్పుడు చూసిపోయే రామారావు...ఇంకేం కావాలి!

ఆమెకు ఒక్క పసుపు- కుంకుమల విషయంలో తప్పించి మరే విషయంలోనూ లోటు లేదు.

ప్రకాశరావు యిదంతా ఆలోచించే మంచిపనిచేసిపోయాడు...తనకా వయసయిపోయింది...కొద్దిసంవత్సరాల సర్వీసుంది. ఎల్లాగో ఆ సర్వీసుపూర్తిచేసినా తన జీవితం, బాగుపడుతుందన్న నమ్మకం, విశ్వాసం కనుచూపుమేరలో కనిపించలేదు. ఉద్యోగనిర్వహణలో అధికారుల మందలింపులు, హెచ్చరికలు, తప్పొప్పులు, లోటుపాట్లు...ఏవిధంగా ముగుస్తుందో...అందుకే చేతిలో వున్న అవకాశాన్ని వినియోగించుకోడంలోనే వివేకం వుందేమో అనుకున్నాడు.

రామారావుకి స్నేహితుడు ప్రకాశరావు చేసిన ఈ పని బాగానచ్చింది. పోయినవారికోసం ఒకటి...రెండు...మూడు రోజులు...అప్పుడప్పుడు...గుర్తుకొచ్చినప్పుడు విచారిస్తారు...బాధపడతారు...ఏదైనా వున్నవారికోసం మిగిల్చిపోతేనే...లేకపోతే అదీ ఉండక పోవచ్చు

రామారావులో ఆలోచనలు ఆ దారినే కొనసా

గుతున్నాయి...

ఒకసారి రామారావు, ప్రకాశరావు ఆఫీసు పనిమీద విశాఖపట్నం బయలుదేరారు.

"మనం ఉద్యోగం చేస్తున్నాం. అంతో యింతో సంపాదిస్తున్నాం. కాని మనకు తృప్తి ఉండటం లేదు. ఎంత చేసినా యింట్లోవారికి తక్కువగానే వుంటోంది... తక్కువఆదాయపు వాళ్లు, రోజువారీ సంపాదనవరులు ఎలా జీవిస్తున్నారో..." అంటూ సంభాషణ ప్రారంభించాడు రామారావు.

"రోజువారీగా సంపాదించేవాళ్లే హాయిగా, ఆనందంగా జీవిస్తున్నారు. వారు ఉన్నదానితో హాయిగా బతికేస్తారు. ఎటొచ్చీ మనలాటి మధ్యతరగతి వర్గీయుల్లోనే దిక్కుమాలిన భేషజాలు, ఆర్భాటాలూను. ఎదుటివారిని చూసి చేతులు కట్టుకుంటాము. వారితో సమానంగా పోటీపడుతుంటాము.." చెప్పాడు ప్రకాశరావు.

"అందుకే కాబోలు ఈనాడు చాలామంది వివాహాలను వాయిదా వేసుకుంటూ ఒంటరిగా వుండేందుకు ప్రయత్నిస్తున్నారు. ఈ ధరలు, నాగరికత, ఆధునికత ముసుగులో ఉద్యోగంచేసే అమ్మాయిలనే పెళ్లాడుతున్నారు. అలాఅని కట్నకానుకలు కూడా తగ్గించుకోడంలేదు. ముక్కుపిండి, చెవులు మెలిపట్టి మరీ వసూలు చేస్తున్నారు. మనుమలకు ధనదాహం మరీ ఎక్కువయిపోతోంది. పోనీ అదనపు సంపాదనతోనైనా హాయిగా వున్నారా అంటే అదికూడా లేదు. అప్పులు... అప్పులు..." రామారావుకి భార్య అన్నపూర్ణ తీరు గుర్తుకు రాసాగింది.

ప్రకాశరావుక్కూడా దమయంతి గుర్తుకొచ్చింది.

కాకులన్నీ ఒకచోట... కొంగలన్నీ ఒకచోట చేరతాయి కాబోలు... కాకులతో కోయిలలు, కొంగలతో బాతులు కలవ్వేమో!

"ఆడవాళ్లుకూడా తెలివిమీరిపోతున్నారు. చదువు, ఉద్యోగం వారిని స్వేచ్ఛ, స్వాతంత్ర్యంవైపు నడిపిస్తున్నాయి.సంపాదించుకుంటున్నామనే అతిశయం, అహంభావం వారిలో ఎక్కువవుతోంది. ఎదుటి ఆడదానికంటే గొప్పగా, దర్జాగా వుండేందుకు ప్రయత్నిస్తున్నారు. ఫలితంగా మనలాటి భర్తలు సమస్యల్లోపడి అప్పుల్లో తేలవలసి వస్తోంది" చెప్పాడు రామారావు.

"అసలు ఏసంసారమైనా బాగుపడాలంటే యిల్లాలుదే బాధ్యత. తెలివైన భార్య గుట్టుగా, నిబ్బరంగా ప్రవర్తిస్తుంది. అవసరాలని జాగ్రత్తగా ఆలోచించి, అవకాశం మేరకు సర్దుకోడానికి ప్రయత్నిస్తుంది. ఏదైనా మనం దురదృష్టవంతులం... ఈజన్మకింతే రాసిపెట్టివుంది" వేదాంత ధోరణిలో అన్నాడు ప్రకాశరావు.

రామారావు ఇంటికెదురుగా ఓ గొప్ప శాల్తీ వుంటున్నాడు. పొద్దున్నే లేస్తాడు. బాయిలరు వెలిగించి వేడినీళ్లు కాస్తాడు. కుండీల్లోకి నీళ్లు పడ్తాడు. అంట్లు తోముతాడు. బట్టలుతుకుతాడు. కాఫీ కాస్తాడు. వంట చేస్తాడు. పెళ్లాం వెనకే వుండి అన్నిపనుల్లో సాయపడుతూ ఉంటాడు. బజారులోకి ఓ కొత్త వస్తువు వచ్చిందంటే- కనీసం మరునటి నెలలోనైనా యింట్లోకొచ్చేయాలి. లేకపోతే ఆ భార్యామణికి ఎలాగో వుంటుంది. ఆమెకు ఎప్పట్నుంచో రిఫ్రిజిరేటరు, ఎయిరుకూలరు కొనాలని ఉబలాటం.

ఆ రెండూ పొందే అవకాశం త్వరలోనే తలుపు తట్టింది.

పక్కింట్లో వుండే ఓ పెద్దమనిషికి ఢిల్లీ ట్రాన్స్‌ఫరయింది. వారింట్లో రిఫ్రిజిరేటరు, ఎయిరుకూలరు ఉన్నాయి. ఆయన అమ్మేస్తానని మంచి బేరం చూసిపెట్టమని మన మానవుడితో చెప్పాడు. యిలా చెప్పడంలో ఫ్లాష్‌బాక్ ఏమంటే సదరు ఢిల్లీవాలాకు దుబాయ్ వెళ్లే అవకాశం రాబోతోంది. దుబాయ్ వెళ్లాక ఎటూ ఫారిన్ వస్తువులు తెచ్చుకోవచ్చు బోలెడు. విదేశాలకెళ్లేది- కేవలం డబ్బు సంపాదించేందుకే కదా... తిరుగు ప్రయాణంలో విదేశీ వస్తువులు తెచ్చుకొని- వీలయితే అమ్మేసి కాష్ చేసుకోవచ్చు. స్వదేశంలో పుట్టి, దేశాభిమానం వుంచుకోకుండా- విదేశాలకు పోయేవారిసంఖ్య ఎక్కువవుతోంది. తమ సేవలను, విజ్ఞానాన్ని స్వదేశంలోనే అందించవచ్చుకదా... కాని అలా ఎందుకుండదు?

అప్పుడు మన మానవుడికి వేడి పుట్టింది. అయితే ఆ వస్తువులు తన యింట్లోకి రావాలంటే డబ్బు కావాలి. అప్పుడీ వంట్లోరేగిన వేడి చల్లారుతుంది. అటువంటి సమయంలో

సదరు మానవుడి భార్యామణి వెంటనే మెడలో వున్న గొలుసు తీసి భర్తచేతిలో పెట్టింది అమ్మే యమని. గొలుసు మరోసారి ఎలాగైనా కొనుక్కో వచ్చునని ఓ ఉచిత సలహాకూడా యిచ్చింది.

మన మానవుడు గొలుసుతో అబిడ్సు వెళ్లి ఎనిమిదివేలతో తిరిగొచ్చాడు. సాయంత్రం యింటికి సదరు ఢిల్లీవాలా రాగానే ఈడబ్బు ఆయన చేతిలో పెట్టి రిఫ్రిజిరేటరు, ఎయిరు కూలరు తన యింటికి తెచ్చుకున్నాడు. అప్పుడా యిల్లాలు ఛాతి ఎనిమిది అంగుళా లు పెరిగింది. ఇంకా పెరిగే వుంటుందేమో... టేప్ వుంటే కొలిచి మరింత ఆనందించేవాడు సదరు భర్త. ఆ వస్తువులను చూపించేందుకు ఫ్రెండ్సుని పిలిచింది ఆ యిల్లాలు. ఆ వచ్చిన వారిని మాట్లాడనీయకుండా వీరసుత్తి వాయి స్తూ గంటన్నర గడిపింది- గొప్పగా, గర్వంగా...

అలా వెళ్ళినవారిలో అన్నపూర్ణ కూడా ఉంది.

ఇంకేం, ఆ సాయంత్రం రామారావుతో- ''మనంకూడా ఫ్రిజ్, కూలర్ కొనుక్కుందాం'' అంది.

''ఇంతకి ఫ్రిజ్‌లో ఏంపెట్టింది మీ సుత్తి ఫ్రెండు'' అడిగాడతను.

''పెరట్లో కాస్తున్న నిమ్మకాయలు, దొండకా యలు, జామకాయలు, కరివేపాకు, పాలగిన్నె మజ్జిగగిన్నె, కొబ్బరి చిప్పలు పెట్టింది'' అంది అన్నపూర్ణ.

''అయితే మీఫ్రెండు మొగుడు త్వరలోనే కొంపలో మినీ బార్ ప్రారంభిస్తాడన్నమాట...''

''ఎందుకు''

''ఎందుకేమిటి... ఇంతవరకూ బజారులో తీసుకుంటున్న తీర్థపు సీసాలను ఇకముందు ఫ్రిజ్‌లోనే పెట్టుకుని- ఎదురుగా కూర్చుని సేవించవచ్చు- దంపతులిద్దరూ కలిసి'' అన్నాడు రామారావు.

''ఆవిడ అంతచేతకానిదేంకాదు. కొంపలో బండెడు చాకిరీ చేయిస్తోంది మొగుడిచేత'' గర్వంగా చెప్పింది అన్నపూర్ణ.

''ఎందుకో తెలుసా?''

''చెప్పండి''

''అతగాడి పెళ్ళానికి అయిదెకరాలపొలం వస్తుంది. వాళ్ళమ్మకున్న వడ్డాణంలో ఏడుకా సుల వాటా వస్తుంది. అందుకే ఆ మానవుడు కుక్కినపేనులా పడున్నాడు. నువ్వా వున్నావు ఎందుకు, పుట్టింటికెళ్ళినా నాకే టెండరు వేస్తావు...''

అన్నపూర్ణ నోరెత్తలేదు ఆ జవాబుకి.

''మీఫ్రెండు మొగుడికేంఖర్మ, అలా డబ్బు లేదని ఏడుస్తాడేం! ఒక్కడే కొడుకు కదా... పైగా సొంత ఇల్లు జీతం ఆస్తి, పార్టు టైము సంపాదనా.. ఉండగా ఎందుకీ నీలుగుడు... కొంపకెవరూరారు, రానివ్వరు... వచ్చినా పావు గంటలో డిస్పాచ్ చేసేయగల సమర్థులు ఇద్ద రూ... సినిమాలు చూస్తే తలనొప్పి... టీవీ చూస్తే కళ్ళు మంటలు, రేడియో- టేపురికార్డ రు పాటే హోరు, సోఫామీద కూర్చుంటే పైల్సు వస్తాయని, పంచెకట్టుకుంటే మొలవుండు పడుతుందని తువ్వాలుతోటే కాలక్షేపం చేసే మనిషికి ఎన్నిలక్షలుంటే ఏం... ఉన్నడబ్బుని హాయిగా ఖర్చుచేసుకోవచ్చుగా... రేపు ఆ సుపు త్రుడు ఇదంతా హాయిగా అనుభవిస్తాడు. ఇలా వాళ్ళిద్దరూ కడుపు మాడ్చుకుని, కరెన్సీ నోట్లు, బాంకు పాసుపుస్తకాలు చూసుకుంటూ కూర్చోవలసిందే'' రామారావు కోపంగా అన్నా డు.

''వాళ్ళగొడవ మనకెందుకు...'' అంది అన్న పూర్ణ.

''అలా అని నువ్వు ఊరుకోటంలేదుగా... అప్పుడే ఫ్రిజ్, కూలరుకి టెండరు పెట్టా వుగా... అవసరం ఎంతవరకూ అని ఆలోచించ కుండా... వస్తువుయొక్క ఉపయోగం ఆలో చించకుండా, గొప్పలకోసం కొని వాటిని భద్రంగా దాచి గుడ్డపెట్టి తుడుస్తూ మురిసిపో వటం- ఎదుటివారిని ఇరకాటంలో పెట్టటం- నీలాంటి వాళ్ళు చూడ్డానికి ఎగబడటం... ఏమిటి...'' చికాగ్గా అన్నాడు రామారావు.

''చూస్తూ ఉండండి... నేను మీచేత కొని పించకపోతే నాపేరు అన్నపూర్ణకాదు'' అని ఛాలెంజ్ చేసిందామె.

''ఓ పనిచేయకూడదూ...''

''ఏమిటి''

''ఏంలేదు... ఈ ఇల్లు అమ్మేస్తే మూడులక్ష లొస్తుంది. ఆఫీసులోని అప్పులు, బయట అప్పులు తీరేసే రెండున్నర లక్షలు మిగులు

తోంది. ఒకటిన్నర లక్షతో కుంట్లూరు స్థలంలో ఇల్లు కట్టుకుందాం... మిగిలిన డబ్బు నీ చేతికి ఇస్తాను. నువ్వు, మీ నుత్తి ఫ్రెండు కోరి, అబిడ్సు వెళ్ళి మనవద్దలేని సామానులు, వస్తువులు కొని తీసుకురండి...'' అన్నాడతను.

"ఏమిటా వాగుడు..."

"మంచిమాట చెప్తే వాగుడంటావేం..."

"లేకపోతే ఏమిటి... అర్థంపర్థంలేని ఆలోచనలు..." అన్నపూర్ణ సంభాషణ కట్‌చేసింది.

రామారావుకి తరచు ప్రకాశరావు గుర్తొస్తున్నాడు. అతను చేసిన పనే గుర్తుకొస్తుంది. తనని కూడా ఆహ్వానిస్తున్నట్లు... ఇటువంటి భార్యలతో వేగటం చాలాకష్టం అంటున్నట్లుగా... ఇంతకుమించిన నిర్ణయం మరొకటి ఉండదని... చెబుతున్నట్టుగా



వారంరోజుల్నించి రేడియోలో... సైనుబోర్డులమీద, కరపత్రాల్లో, ప్రకటనల హోరు. ఇదంతా "గ్రేట్ ఎక్స్‌పో" వస్త్రప్రదర్శనవారి సందడి. ఇప్పటికే ప్రతిచోటా తగ్గింపు వస్త్రాలేకాదు రకరకాల తగ్గింపువస్తువుల జోరు ఎక్కువయింది. చిన్న పెద్ద, ఆడ, మగ భేదం లేకుండా అన్నిరకాలవారికీ, ఆదాయంతో సంబంధంలేకుండా తగ్గింపు ధరల్లో వస్త్రాలు యివ్వటమే ఈ వస్త్రవ్యాపారుల ధ్యేయంగా కనిపిస్తోంది చూసేవారికి.

అన్నపూర్ణ చేతిలో పడింది అలాంటి ఓ కరపత్రం. అందులో బట్టల వివరాలు, ధరలు, బహుమతులు పేర్కొనబడ్డాయి. చాలా చవకగా వున్నాయని చాలామంది చెప్పుకుంటుండగా తానూ వింది. ఇంత తక్కువ ధరలకు, ఎలా యిస్తున్నారో అర్థంకాదు. సాధా-

మైన భవనాల్లోనో, హోటళ్ళలోనో, బహిరంగప్రదేశాల్లోనో ఏర్పాటుచేయబడుతూవుంటాయి. అద్దెలు కూడా వేలల్లోనే వుంటాయి. సిబ్బంది జీతాలు, కరెంటుచార్జీలు, ప్రచారఖర్చులు, బహుమతులు, లాభం సంగతి సరేసరి. మరి అవి కూడా ఈ ధరల్లోనే చోటుచేసుకుంటాయి కదా... అప్పుడు ధరలు ఆకాశాన్నంటాలికదా...ఇల దిగిన చందమామలా...యింత స్వల్పంగానా ధరలు?...బట్టల నాణ్యత తగ్గిందా...లేక నిలవసరుకా...వంటి అనుమానాలు, సందేహాలు చాలామందికి కలిగినా ఆ ప్రచారపు జోరులో అవన్నీ కొట్టుకుపోవాల్సిందే.

గ్రేట్‌ఎక్స్‌పోలో రోజూ రాత్రి తొమ్మిదిగంటలకు ఆరోజు జరిగిన అమ్మకాలమీద యిచ్చిన కూపన్లను డ్రా తీస్తారు. బహుమతి గ్రహీతలకు ప్రీమియర్‌కారు, మోటారుసైకిలు, రిఫ్రిజిరేటరు, కలర్ టెలివిజను, విదేశీ రేడియోలవంటివెన్నో బహుమతులుగా వున్నాయి. కాబట్టే కొనుగోలుదారుల్లో యీ ఉత్సాహం...వేడి...

తమకాలనీలో చాలామంది ఇప్పటికే కొనుగోళ్ళు చేసేసారన్న విషయం అన్నపూర్ణకు తెలిసింది. వారం పదిరోజులు ఊగిసలాడిందామె. భర్తని తీసుకెళ్ళమంది. కాని అతను వినిపించుకోలేదు. ఫలితంగా కామేశ్వరితో ప్రయాణం అయింది. గతంలో అన్నపూర్ణ యిటువంటి ప్రదర్శనలకు వెళ్ళేది. అయితే కొనుగోళ్ళు మాత్రం చేయలేదు. ఇప్పటి ప్రయాణానికి కారణంలేకపోలేదు. ఎటూ పండగలకు బట్టలు కొనాలి. ఆ కొనేది, యిటువంటి చోట కొంటే పుణ్యంతోపాటు పురుషార్థం అన్నట్టుగా బట్టలతోపాటు బహుమతులు కూడా వస్తాయి. అన్నపూర్ణకు చిన్నప్పట్నుంచీ అదృష్టదేవత స్నేహితురాలు...అయిదురూపాయలకు నూరు రూపాయల స్టీలుగిన్నె రెండురూపాయలకు ఏభైరూపాయల ఫ్లాస్కు రూపాయి లాటరీలో రెండొందలు, యిలా ఎన్నో...సంపాదించింది. ఇప్పుడు యీ గ్రేట్ ఎక్స్‌పోలో తానేబహుమతి పొందగలదో...? ఒకవేళ ఏ బహుమతీ రాకపోయినా విచారించనవసరంలేదు. ఎందుకంటే చెల్లించే ధరలు తక్కువ. ఆ ధరకు కొన్నవి ఓ ఏడాది మన్నినాచాలు.



అన్నపూర్ణ యింతగా ఆలోచించింది.

ఇది పోటీప్రపంచం. పిల్లల చదువుల్నుంచీ అసెంబ్లీ పార్లమెంటు సీట్లవరకూ పోటీనే. కాబట్టి పోటీలో ఎన్నోపద్ధతులు, మార్గాలు తప్పవు. ప్రచారం పెంచి ఆకర్షించాలి. అప్పుడే వ్యాపారం జోరుగా, హుషారుగా, లాభసాటిగా వుంటుంది. గ్రేట్ ఎక్స్‌పోకి వెళ్ళివచ్చి [illegible] దిండుగలేబులు, చిన్నసైజు తువ్వాళ్ళు కూడా ఉచితంగా పొందారు. తానూ చూసి ముచ్చటపడింది. ఆశ్చర్యపోయింది కూడా...వందరూపాయల కొనుగోళ్ళకు టేబులులైటు, రెండువందలకు మూడు బ్లాంక్ కేసెట్లు, అయిదువందలకు అలారం టైముపీసు, ఏడొందలకు రెండు బాండ్ల ట్రాన్సిస్టరు...ఇలా ఎన్నో ఉచిత బహుమతులు ఉన్నాయి. అంటే గ్రేట్ ఎక్స్‌పోకి వెళ్ళినవారికి కొన్న బట్టలు బాగున్నా బాగోకపోయినా లాభమే...

అన్నపూర్ణ పర్సులో పదిహేనొందల రూపాయలున్నాయి.

మనిషి ఆశాజీవి. ఆశపడటంలో తప్పులేదు. కాని ఆశ దురాశస్థాయికి మాత్రం పోకూడదు అని రామారావు థీరీ. ప్రస్తుతసమాజంలో, అధికశాతం ప్రజల్లో దురాశ పెరగటానికి కారణం అతను గుర్తించినా అన్నపూర్ణ మాత్రం గ్రహించేందుకు ఎలాంటి ప్రయత్నం చేయదనే చెప్పాలి.

కామేశ్వరి లోపలకు అడుగుపెట్టింది. అన్నపూర్ణ కూతుర్ని అనుసరించింది. లోపల రంగు రంగుల దీపాలంకరణ, సినిమాసంగీతంతో అట్టహాసంగా వుంది. సీలింగుఫాన్లు, పెడెస్టల్ ఫాన్లు సూపర్‌ఫాస్టు స్పీడులో తిరుగుతున్నాయి.

కొనుగోలుదారులు వస్తున్నారు- వెడుతున్నారు. కొన్నవాళ్ళూ, కొననివాళ్ళూ సంతోషంగానే నిష్క్రమిస్తున్నారు. ఎవరి ఆలోచనలు వారివి. ఎవరి దారి వారిది. అక్కడి వాతావరణం వారివారి గొప్పతనాన్ని మాత్రం చాటుతోంది.

అరగంట పరిశీలించాక పదిహేనొందలూ ఖర్చుచేసింది. అన్నపూర్ణ - పాంటు, షర్టుగుడ్డలు, చీరలు, బెడ్‌షీట్లు, పిల్లో కవర్లు, చూడీదారులు, నైటీల నిమిత్తం.

బిల్లు చెల్లించి తనకిచ్చిన కూపన్‌లని బాక్సులో వేసి ఇంటికి బయలుదేరింది కూతురితో కలసి. ఆమె మస్తిష్కంలో రాబోయే బహుమతి గురించే ఆలోచనలు...

వారంరోజుల తరువాత అన్నపూర్ణకు గ్రేట్ ఎక్స్‌పో వారి నుంచి సమాచారం అందింది. "మీకు ప్రీమియర్ పద్మిని కారు బహుమతి వచ్చింది. రవాణా, ఇన్సూరెన్సు, పన్నుల నిమిత్తం ఏడువేల రూపాయలు చెల్లించమని... ఏ విషయం స్వయంగా వచ్చి తెలుపమని... "

అన్నపూర్ణ ఆనందం ఆవలిగట్టు చేరింది. సంతోషానికి పరిమితిలేదు. తానిప్పుడు కారు యజమాని.

రామారావు ఆ విషయంగురించి శ్రద్ధ చూపలేదు. ఎందుకంటే తనకు స్కూటరే లేదు. ఇక కారెందుకు... అందుకు ఏడువేలు అసలే లేవు... తానిప్పుడు హటాత్తుగా చస్తే - చందాలేసుకుని తగలేయవలసిందే...

అన్నపూర్ణ మరోవిధంగా ఆలోచిస్తుంది.

నాణానికి బొమ్మ బొరుసు ఉన్నట్లే ఆలోచనల్లోనూ తేడాలుంటాయి. కారు బదులు రిఫ్రిజిరేటర్లు, స్కూటర్ అడిగితీసుకుంటే ఉభయతారకంగా వుంటుంది అటు గ్రేట్ ఎక్స్‌పోవారికీ యిటు తమకూ కూడా... భర్త ఎప్పట్నుంచో స్కూటరు కొనాలనుకుంటున్నాడు. కాని పెట్రోలు ధర, ఇన్సూరెన్సు, రిపేర్లు, టాక్సులు, ప్రమాదాలు, పోలీసులతో గొడవలు దృష్టిలో పెట్టుకుని ఆలోచన విరమించుకున్నాడు.

"ఏడువేలు అప్పుచేసి గ్రేట్‌ఎక్స్‌పో లో చెల్లించి, కారు డెలివరీ తీసుకొని అమ్మేస్తే సరి..." అన్నపూర్ణ భర్తకు సలహాయిచ్చింది.

సలహా బాగానే వుంది తనకు ఏడువేలు అప్పుయిచ్చే మహాత్ముడు ఎక్కడున్నాడో... అన్నపూర్ణ పోరు భరించలేక, రామారావు అన్వేషణ సాగించాడు.

రామారావు ముందుగా గ్రేట్‌ఎక్స్‌పోకి బయలుదేరాడు.

"ప్లీజ్... బి సీటెడ్" అన్నాడు మేనేజర్.

రామారావు వచ్చినపని వివరించాడు.

"ఎనీ కూల్‌డ్రింక్ వుడ్‌యు లైక్‌టుహేవ్"

"నో... థాంక్సు.." అన్నాడు రామారావు.

మేనేజరుకు ఈలోగా ఫోన్‌వచ్చింది. ఆ తరువాత.. అలాగ ఆరేడు కాల్సు... పదినిముషాలవరకూ రామారావుతో మాట్లాడే వీలు దొరకలేదు.

"మా అమ్మకాలు విపరీతంగా పెరిగాయి. మేమిచ్చే బహుమతులు బాగున్నాయంటూ మాకెన్నో ఉత్తరాలు వస్తున్నాయి. నిన్ననే హెడ్డాఫీసునుంచి ఓ కొత్తస్కీము గురించి వివరాలు వచ్చాయి." అంటూ కాలింగు బెల్లు నొక్కాడు. ప్యూను వచ్చి ఓఫైలు అందించాడు.

"ఈమధ్య బిజినెస్సులో విపరీతంగా పోటీ పెరిగింది. తగ్గింపు రిబేటు, డిస్కౌంటు వంటి పదాలు తరచూ వినపడుతున్నాయి. కొత్తకొత్త ఆకర్షణలు ప్రవేశపెట్టబడుతున్నాయి. ఇది కొంటే అదిస్తామని అదికావాలంటే యింతవరకూ కొనాలని వ్యాపారనియమాలు, నిబంధనలు వుంటున్నాయి. ఇంతకీ మీకు నిజంగా కారుకావాలా... స్కూటరు నిజంగా బోరుకొడుతోందా... " అన్నాడు మేనేజరు.

"కావాలనేగా వచ్చింది" అన్నాడు రామారావు.

"అదయితేమాకొత్త స్కీము గురించి చెప్తాను వినండి... మీరెటూ కారు తీసుకున్నాక అమ్మేస్తారు. అందుకు మీరు ప్రస్తుతం అయిదువేలు డిపాజిట్ చేసేందుకు వచ్చారు మీరు - అవునా!" సూటిగా అడిగాడు.

రామారావుకి వింతగా వుంది.

"మీరిప్పుడు అయిదువేలు డిపాజిట్ చేసే

మూడేళ్ళలో పదిహేనువేలు అవుతుంది. గడువు తేదీకి మీ సొమ్ము లభిస్తుంది. ఒకవేళ మీకీలోగా డబ్బుకావాలంటే సగండబ్బు అప్పుగా ఇస్తాం- పన్నెండుశాతం వడ్డీమీద. మరో స్కీములో - విలువైన మీలాంటి ఖాతాదారులకు ఇళ్లస్థలాలను కేటాయిస్తాము. ప్రస్తుతం భూమి లేఅవుట్ జరుగుతోంది. మీకేది నచ్చితే అదే తీసుకోవచ్చు'' అంటూ కొన్ని దరఖాస్తులు ముందు పడేసాడు రామారావు.

రామారావుకి ఉక్కిరిబిక్కిరిగా వుంది. ఎటూ ఆలోచించుకోలేని పరిస్థితిలో వున్నాడు. ''సపోజ్, కారు మీకే అమ్మేస్తే, ఏధరకు తీసుకుంటారు'' అని అడిగాడు.

మేనేజరు నవ్వేసాడు- ''మీరిప్పుడు కారు కోసం బుక్‌చేసుకోవాలి. అయిదేళ్ళకుగాని మీకు చేతికిరాదు. డెలివరీనాటికి ఏ ధరవుంటే అది చెల్లించవలసివస్తుంది. పైగా కారుకొన్న రెండేళ్ళకే మీరు అమ్ముకోగలరు'' అని.

ఆలోచనలో పడ్డాడు రామారావు.

ప్యూనువచ్చి ఆరోజు వచ్చిన పోస్టును మేనేజర్ టేబులు మీదపెట్టారు. వాటిలో ఎక్కువగా బహుమతులు పొందిన వాళ్ళు రాసినవే... కొందరు ఉత్తరాలు... ''చూడండి సార్.. మా స్కీమ్‌కు ఎంత రెస్పాన్సు వస్తోందో... చాలా మందికి స్కూటర్లు, ఫ్రిజ్‌లు వంటి వస్తువులు నిరాకరిస్తున్నారు. మూడేళ్ళ తరువాత వచ్చే అధికమొత్తాలమీదే మోజు చూపెడుతున్నారు. నిజమేగా మరి.. పిల్లల చదువులు, ఉద్యోగాలు, వివాహాలు, మొదలైన వ్యవహారాలకు ఉపయోగపడుతుందని. పరోక్షంగా యిది కూడా పొదుపులోని భాగమే. ఎంత డబ్బు వచ్చినా ఖర్చుపెట్టేస్తాం... జీవితంలో పొదుపు చేయాలి... భవిష్యత్తుకి మీలాంటివారు ముందుకు రావాలి... '' చెప్తున్నాడు మేనేజర్.

రామారావుకు ఆ మాటలు నిజమేనని పించింది.

''కొందరు వ్యాపారులు వస్తువుల ధరలను రెట్టింపో మూడింతలో పెంచేసి అయిదు, పది, ఇరవై, నలభై, ఏభై శాతం తగ్గింపు అంటారు. కాని యీ తగ్గింపులు, డిస్కౌంటులు నేతిబీరకాయలోని నేతివంటివని అందరికీ తెలిసిందే... అందుకే మేము కస్టమర్లకు ఎక్కువగా వస్తువులను యిస్తున్నాం... ఇంతకీ మీకు ఏస్కీములో చేరాలని వుంది? మీకు కారే కావాలంటే,

''అయితే నేను డబ్బు ఎప్పుడు చెల్లించాలి?'' అడిగాడు రామారావు.

'' మూడు రోజుల్లోగా చెల్లించాలి. తరువాత మేము తీసుకోము. మీరు బహుమతి నిరాకరించినట్లుగా భావిస్తాము'' నిశ్చయంగా అన్నాడు.

రామారావుకు అవకాశం వదులుకోవాలని లేదు.

కారుకి బదులు డబ్బు డిపాజిట్టు చేయాలని నిశ్చయించుకున్నాడు.

అందుకు డబ్బు కావాలి... ఎలా... ఆలోచిస్తుంటే అతనికి కరుణాకరం గుర్తుకువచ్చాడు.

కరుణాకరం అప్పులు యిస్తాడు.

వాయిదాలమీద బట్టలు, స్టీలుసామాగ్రి, ఫర్నీచరు అమ్ముతుంటాడు. కరుణాకరం, రామారావు క్లాస్‌మేట్స్. ఎప్పుడైనా స్నేహితుడని తనకి అప్పు ఇస్తుంటాడు - వడ్డీలేకుండా.

కరుణాకరం యింటికి వెళ్ళేందుకే నిశ్చయించుకున్నాడు రామారావు.

మళ్ళీ అంతలోనే ఏదో ఆలోచన... వెళ్ళాలా వద్దా అని.

తనకు తక్కువవడ్డీకే యిస్తాడు. కాని ఆ వారకు ఎక్కువగా యితరపనులు చేయించుకుంటాడు. దానివల్ల రామారావుకి శ్రమ... కరుణాకరం ధనరూపంలోనూ పరపతిలోనూ లాభిస్తాడు.

''నాకు ఉచితంగా అప్పుయివ్వకూడదా'' అని అడుగుతుంటాడు రామారావు.

''అమ్మమ్మ... ఉచితంగానా... అదే నావృత్తి కదా... ఏదో నువ్వు అడగగానే డబ్బుయిస్తున్నాను. అక్కడికీ మిగిలినవారికంటే తక్కువ వడ్డీకే యిస్తున్నాను. నువ్వు ఎప్పుడు తిరిగియిచ్చినా ఫరవాలేదు'' అంటూ ఉంటాడు కరుణాకరం. వృత్తిధర్మాన్ని శిరసావహించేవాడిలా.

రామారావు ఇంకేం చెప్పగలడు?

★ ★ ★

రామారావు కాఫీ తాగుతుంటే ఉత్తరం తెచ్చియిచ్చింది అన్నపూర్ణ. ''ఎక్కణ్నుంచి'' అంటూ అందుకున్నాడతను.

''ఇంకెక్కడినుంచి వస్తుంది... మీరు ఎదు

రుచూస్తున్నవారినుంచే... చదువుకోండి తీరుబడిగా'' అంది అన్నపూర్ణ వెటకారంగా.

కాఫీగ్లాసు కిందపెట్టి ఉత్తరం చదివేందుకు ప్రయత్నించాడు- ''ముందు కాఫీ తాగండి. అంతకొంపలు అంటుకుపోయే విశేషాలు ఏమీ లేవు అందులో. ఉత్తరం చదివేక కాఫీతాగితే వంటబట్టదు'' అంటూ ఉత్తరం లాక్కుంది అన్నపూర్ణ.

రామారావుకి అర్థంకాలేదు.

''మీకు లోకంగురించి, మనుమలగురించి యింకా ఎప్పుడు తెలిసివస్తుంది. అంతా మీ లాగే సీదాసాదాగా వుంటారా... ఇతరుల విషయాల్లో జోక్యం ఎందుకు చేసుకుంటారు. నామాట ఎందుకు వినిపించుకోరు! మీరిలా చేయడంవల్ల మీకేదో లాభం వుందనుకునేవాళ్ళేగాని విషయాన్ని అర్థంచేసుకునేవాళ్ళు ఈకాలంలో వుంటారా... '' ఉత్తరంలోని విషయాలను చదువుతూ అంది ఆమె.

''అసలు విషయం ఏమిటో చెప్పకుండా ఈ సోదెందుకు'' అతనికి చికాగ్గావుంది. ఉత్తరంలోని దస్తూరీనిబట్టి అది రెండోబావమరిది నుంచి అని గ్రహించాడు.

''ఈ రోజుల్లో మంచీ, న్యాయం వారివారి ఆలోచనలకే పరిమితం. అయినవాళ్ళు అవసరాల్లో ఆదుకునేందుకు యిదేమైనా పూర్వపురోజులా... తల్లి, తండ్రి, అన్న తమ్ముడు, చెల్లెలు, బంధువులు వాళ్లమీద ప్రేమలు, బంధాలు పెంచుకోకూడదు. జలగల్లా రక్తం పీల్చేవాళ్ళేగాని ఉపయోగపడతారా... ఎదుటివారినుంచి లాభం, ప్రయోజనం ఆశించేవాళ్ళేగాని అయ్యోపాపం అని జాలి, సానుభూతి చూపించరు. ఉపకారం అంటే ఊరుకాదు రాష్ట్రం, వీలైతే దేశంవదిలి పోయేవాళ్ళే. మీరింక మీ బావకు ఉత్తరం రాయకండి... కవరు దండగ'' అని ఉత్తరం రాసేముందే హెచ్చరించింది అన్నపూర్ణ ఆరోజు.

కాని రామారావు వినిపించుకోలేదు.

కాఫీ తాగటం పూర్తయింది.

రామారావు ఉత్తరం చదువుతుంటే, అతని కళ్ళు అక్షరాలవెంబడి ఆత్రంగా పరుగెట్టసాగాయి. గుండెదడగా వుంది. ఇదంతా అన్నపూర్ణ గమనిస్తూనేవుంది.

మూడు నిమిషాల్లో ఉత్తరం చదివి మంచంమీద పడేసాడు రామారావు. ''బావ... బావ... అంటూ ఉత్తరం రాసారు. ఇప్పుడు చూడండి, ఎలా రాసేడో బుద్ధి, జ్ఞానంలేకుండా...''

రామారావు మనసు ఆవేశంతో నిండిపోయింది. ఈ ఉత్తరంకోసం నెలరోజులనుంచి ఎదురు చూసాడతను. అన్నపూర్ణ మాటవినకుండా రాసినదానికి ఫలితమేనా ఇది అని ఆలోచించసాగాడు.

''ఎందుకు అనవసరంగా ఆలోచించడం... బాధపడటంకూడా దేనికి... మాట్లాడక వూరుకోండి... ఇక ఉత్తరం రాయకండి... ఇదొక అనుభవంగా తెలుసుకుంటేసరి... స్వయంకృతం అని నోరుమూసుకుని కూర్చోండి'' అన్నపూర్ణ అంది మందలింపు ధోరణిలో.

మరోసారి ఉత్తరం చదవసాగాడు రామారావు.

''అదేమైనా భగవద్గీతా లేక రామాయణమా... రెండోసారి కూడా చదవాలా... అవతల పారేయండి'' అని ఉత్తరం లాక్కుంది అన్నపూర్ణ.

రామారావు దాదాపు ఏడాది క్రితం హాయత్ నగర్ దగ్గర ఇళ్ళస్థలాలు చూసివచ్చాడు. పదిహేనువేల రూపాయలు అవుతుంది రిజిస్ట్రేషన్ ఛార్జీలతో కలిపి. సిటీబస్సులు బాగానే తిరుగుతున్నాయి. బస్సు డిపోకూడా నిర్మాణంలో వున్నట్లు తెలిసింది. ఓ కిలోమీటరు దూరంలో పాల ఫ్యాక్టరీకూడా నిర్మాణంలో వుంది. తెలుగు వాతావరణం, ప్రశాంతత, మోటారు వాహనాల జోరు - రద్దీకిదూరం... మొదలైన ప్లస్‌పాయింట్లు వున్నాయి. అక్కడక్కడ యిళ్ళుకూడా కడుతున్నారు.

రామారావుకి ఆ ప్రాంతం నచ్చింది. స్థలం నచ్చింది. ధర నచ్చింది. తను కొనాలనుకున్నాడు. కాని డబ్బులేదు. స్థల యజమాని తనకు తెలిసినవాడే. ఎనిమిదివేలు యిచ్చి స్థలం రిజిస్టరు చేయించుకోమన్నాడాయన. మిగిలినది నెమ్మదిగా యివ్వమన్నాడు. అయితే అందుకు కారణం లేకపోలేదు. తాను అప్పటికే పదిహేనుమంది చేత స్థలాలు కొనిపించాడు. కాబట్టి ఆ నమ్మకం, కృతజ్ఞత స్థల యజమానికి వుంది.

ఈ బావమరదికి ఉత్తరం రాయక మునుపే, బ్యాంకులో పనిచేస్తున్న తమ్ముడు దగ్గరికెళ్ళి డబ్బు విషయం ప్రస్తావించాడు రామారావు.

"ఎప్పుడిస్తావు?" అని సూటిగా అడిగాడు ఆ తమ్ముడు.

"ఓ ఏడాదిలో యిస్తాను"

"అలా కుదరదు... మూడునాలుగు నెలల్లో యిచ్చేమాటుంటే రేపు వచ్చి డబ్బు తీసుకెళ్ళు" అన్నాడు నిశ్చయంగా.

"కష్టం" చిన్నబుచ్చుకున్నాడు రామారావు.

"మరి నాపరిస్థితికూడా ఆలోచించాలికదా. నేను నాయింటికి ప్లాస్టరింగు, కాంపౌండువాల్ నిర్మాణం, గేటు తయారీ నిమిత్తం వుంచిన డబ్బు అది. తాపీ మేస్త్రీ దుబాయ్ పోతున్నాడు. మరో కొత్తవాడికి ఈ పని అప్పగించాలని... వాడెక్కడో పెద్దపనిలో వుండటంవల్ల నాపని ఆనటంలేదుకాబోలు... ఏదైనా వానాకాలం రాక మునుపే యీపని పూర్తిచేయాలి" అన్నాడు తమ్ముడు.

"పోన్లే... నీపనులు చేయించుకో" అన్నాడు రామారావు.

ఆ తరువాత రెండో తమ్ముడు దగ్గరకు వెళ్ళాడు. అన్నగారు చెప్పింది సావధానంగా విని ఇలా అన్నాడు ఆ తమ్ముడు- "నాకు యీమధ్యనే పెళ్లయిందికదా! కట్నంలో డబ్బు మిగిలివుంటుందని అనుకున్నారేకాని మరో విషయం ఆలోచించలేదేమో... కొత్త సంసారానికి కావలసిన సరంజామా, వస్తువులు నేను సమకూర్చుకోవాలి కదా... ప్రస్తుతం నేనేమీ సర్దలేను" నిర్మొహమాటం ఆ మాటల్లో ధ్వనించింది.

రామారావు చిన్నబుచ్చుకున్నాడు మరోసారి.

అప్పుడు తండ్రి- వీరభద్రయ్య దగ్గరకెళ్ళాడు అతను. "నిజమేమరి... తండ్రి కొడుక్కి సాయంచేయాల్సిందే... కాని నా గురించి కూడా ఆలోచించావా నువ్వు... లేదు. నువ్వు ఆలోచించినా, నీ పెళ్ళాం సాగనివ్వదు. ఎందుకో తెలుసా, నీకు నోట్లో నాలుకవున్నా అది మాట్లాడలేదు. మొద్దుబారిపోయింది నీనాలుక. దాన్ని ఆకురాయిపెట్టి సానపెట్టినా ప్రయోజనం వుండదు. రిటైరయ్యానని, గ్రాట్యూటీ- ప్రావిడెంటుఫండు- ఇన్సూరెన్సు- పెన్షను- డబ్బు వచ్చివుంటుందని తీసుకురమ్మని నీపెళ్ళాం యిక్కడకు పంపివుండచ్చు. అది నీ తప్పుకాదు. డబ్బుకి ఆ పవరుంది. నేను మిమ్మల్ని కన్నాను. పెంచాను. చదువులు చెప్పించాను. అదృష్టం బాగుండి ఉద్యోగస్తులయ్యారు మీరంతా. నేను యిల్లు కట్టాలనుకుంటున్నాను. నా శేషజీవితాన్ని కొడుకుల దగ్గర గడపాలనుకోవటంలేదు. ప్రస్తుతం చిన్న యిల్లు కొనే వుద్దేశంలో వున్నాను. కాబట్టి నేనేం సహాయం చేయలేను. అయినా, ఎటూ యిల్లుందికదా నీకు... మళ్ళీ స్థలం దేనికి" అన్నాడు వీరభద్రయ్య తొణక్కుండా.

రామారావుకి ఆ మాటలు ఛెళ్ళుమనిపించాయి. ఆలోచనలు తరుముతుంటే మనసు పరిపరివిధాల పరుగెట్టసాగింది. ఈ స్థలం ఎలా సంపాదించాలి... అందుకు డబ్బు ఎక్కణ్ణుంచి తేవాలి... ఆ స్థలం వదులుకోవాలని లేదతనికి. అప్పుడతనికి ఈ బావమరిది గుర్తుకొచ్చాడు. సదరు బావమరిదికి తండ్రినుంచి యీ మధ్యనే పదిహేనువేలు వాటాగా లభించింది. దానికితోడు గాంధీపురంలోవున్న స్థలం అమ్మగా ఏభైవేలు వచ్చింది. కాబట్టి రామారావు డబ్బుకోసం ఉత్తరం రాసాడు- "బాంకువడ్డీమీద డబ్బు సర్దుబాటు చేయాలి నువ్వు. ఏడాది తరువాత చెల్లిస్తాను. నేను చేసిన ప్రయత్నాలేమీ ఫలించక నీకు రాస్తున్నాను. ఈ విషయం మా చెల్లెలుతో చెప్పవలెను. నేను అక్కడికి వచ్చి చెప్పాలనుకున్నాను. కాని వీలుపడలేదు. ప్రామిసరీనోటు రాసిస్తాను" అంటూ.

అందుకు బావమరిది యిలా బదులిచ్చాడు... "నిజమే నువ్వనుకున్నట్లుగా నాదగ్గర అరవై అయిదువేలు వున్నాయి. కాని అది ప్రస్తుతం నా దగ్గరలేవు. బాంకులో ఫిక్సెడ్ డిపాజిట్టు చేసాను. అప్పు తీసుకోవచ్చు కాని అది అంత మంచి పద్ధతి కాదేమో... దానికితోడు నాకు ఆఫీసునుంచి 'హౌస్ బిల్డింగు లోను' మంజూరయింది. రెండుమూడు నెలల్లో నిర్మాణం మొదలుపెట్టాలి. ఈరోజుల్లో నిర్మాణం ఎంత కష్టమో నీకు తెలియనిదికాదు. సిమెంటు, స్టీలు, కలప, ఇతర ఖర్చులు

ఎలావున్నాయో తెలుసుకదా... అప్పుడు నేను కూడా వీధిలోపడి చేతులు చాచవలసి వస్తుంది. తనకు మాలిన ధర్మం పనికి రాదుగా... అప్పులు చేసి యిటువంటి యజ్ఞం చేయకూడదు అని గతంలో నువ్వే ఎప్పుడో చెప్పినట్టు గుర్తు...''

రామారావు బుర్రవేడెక్కిపోయింది.

తానింక ఆ స్థలంకొనే అవకాశం లేదు. ఆ విషయమే యజమానితో చెప్పేందుకు వెళ్ళాడు అతను.

''చూడండి రామారావుగారూ... నేను యీ హైదరాబాదు యిరవై ఏళ్ళ క్రితం ఎనిమిది వందల రూపాయలతో వచ్చాను. వళ్ళు దాచుకోకుండా నా శ్రమని, కష్టాన్ని యీ నేలకు అంకితం చేసాను. ఇప్పుడు అదే నేలతో వ్యాపారం చేస్తున్నాను. భగవంతుడి దయవల్ల యిప్పుడు లక్షల కధిపతినయ్యాను. మీద్వారా పదిహేనుమందికి యిళ్ళస్థలాలు యిప్పించారు. కాని మీరు తీసుకోకపోవటం ఏమిటి... మీకు ఈ స్థలం ఉచితంగా యివ్వాలి... కాని వ్యాపారధర్మం అడ్డుపడుతోంది. అయితే మీకో ఉపకారం చేయాలనుకుంటున్నాను. మీరు యీ డబ్బుని వీలున్నప్పుడు యివ్వండి. అందుకు నాకు నోటు రాసివ్వనవసరం లేదు. కాగితం మీద మీరు రాసే అక్షరాల, వాక్యాల కంటే మీ వ్యక్తిత్వం మీదే నాకు విశ్వాసం...'' అన్నాడు ఆ స్థలం యజమాని.

లోకంలో యిటువంటివాళ్ళుండబట్టే- మాటకూ, వ్యక్తిత్వానికీ ఓటు పడుతోంది.

ఏమాటకామాటే చెప్పాలి. రామారావు స్థలాలను కొనిపించినవారిని తన ఖర్చుతో తీసుకెళ్ళి చూపించాడు. అదే సమయంలో యీ బావమరిది గుర్తొచ్చాడు. అతనిచేత కూడా కొనిపించాలనిపించింది. ఎప్పట్నించో ఓ స్థలం హైదరాబాదులో చూసిపెట్టమని తరచు ఉత్తరాలు రాసేవాడు. ఏదో ఆఫీసుపనిమీద నగరానికి వచ్చినప్పుడు, రామారావు యింటికి వచ్చాడు. హయత్‌నగర్ తీసుకెళ్ళి స్థలాలు చూపించాడు. అతనికి స్థలం ధర, చుట్టుపక్కల ప్రాంతాల కాలనీలు నచ్చాయి. ''ప్రస్తుతం మూడువేలు వున్నాయి. అది ముందిస్తాను. నాలుగు నెలల తరువాత మిగిలిందిస్తాను. యజమానికి చెప్పి ముందుగా నాకు ప్లాటు రిజిస్టర్ చేయించండి'' అన్నాడు బావమరిది.

రామారావు ఆకాశంవైపు చూశాడు. అతనికి పగలు సూర్యుడు కనిపించాడు. రాత్రి చంద్రుడు, చుక్కలు దర్శనమిచ్చాయి. మొదట్నుంచి. యితరులకు సాయపడాలన్నధ్యాసే. తాను తమ్ముళ్ళ చదువులకు, చెల్లెళ్ళ వివాహాలకూ ఆదుకున్నాడు. బోలెడంత డబ్బు వృధాగా ఖర్చుచేశాడు. భవిష్యత్తుకోసం దాచుకోలేదు, ఆలోచించలేదు. అయితే అది యీరోజు యిలా పరిణమించింది. మంచితనానికి మరో పేరు అసమర్థత, చేతకానితనం, పిరికితనం అని అనుభవంద్వారా గ్రహించాడు. సినిమాలు, కథల్లోనే అమాటలకు విలువ, స్థానంవుందని గ్రహించాడు. బావమరిది ఉద్దేశాన్ని స్థలయజమానితో చెప్పేందుకు వెళ్లాడు రామారావు.

''రామారావుగారూ...మీకు డబ్బు గురించీ, ప్రపంచం గురించీ తెలియకపోవచ్చు. డబ్బు మనిషిని ఎటువైపైనా నడిపిస్తుంది. డబ్బు విషయంలో జాగ్రత్త, ముందుచూపు ఎంతో అవసరం. విరోధాలకూ, కక్షలకూ డబ్బే మూలం. మీకు అయితే యీ అవకాశం యివ్వగలను. కాని మీరు మా బావమరది అని యిటువంటి వ్యవహారాన్ని బాధ్యతగా స్వీకరించడం బాగోలేదు. మీపరిస్థితి నాకుతెలును. మీమేలుకోరి చెప్తున్నాను- కొంచెం ఆలోచించండి'' అని చెప్పాడు యజమాని.

రామారావుకి ఆ మాటలు ఆలోచనలను రేపాయి.

బావమరిదికి ఎల్లాగైనా స్థలం ఇప్పించాలని ఉద్దేశం. అందుకే ఆ మూడువేలు పంపించమని ఉత్తరం రాసేడు. మిగిలిన డబ్బుకి తాను నోటు రాసిచ్చేడు. అయితే యీ విషయం మాత్రం గోప్యంగావుంచాడు. స్థలం రిజిస్ట్రేషను అయిపోయింది. దస్తావేజు దగ్గర పెట్టుకున్నాడు.

బావమరిది చెప్పినగడువు తీరిపోయింది.

రామారావు డబ్బుగురించి ఉత్తరం రాశాడు.

జవాబు యిలావచ్చింది- ''హయత్‌నగరు దగ్గర స్థలం ఏమిటి బావగారూ..అదిఎప్ప

టికి అభివృద్ధి చెందుతుంది. అర్థరాత్రి ఏరోగమో వస్తే సిటీకి రావలసిందేగా...ఆటోలు కూడా దొరకవు. ఒకవేళ దొరికినా— దారిలోనే పేమెంటు ప్రాణం జాతీయరహదారిమీద కలిసిపోతుంది. మీద్వారా ప్లాటులు తీసుకున్న వారి ఉద్దేశాలతో నేను ఏకీభవించలేను. ఖరీదెక్కువైనా నగరంలో తీసుకోడం మంచిది. మరో విషయం, యీమధ్యనే ఓ స్కూటరు బేరానికొచ్చింది. అదికొనాలని ఉద్దేశం. మీమాట తీసెయ్యలేక స్థలంకోసం డబ్బు పంపించాను. ఏమీఅనుకోకుండా ఆడబ్బుపంపేయండి. ఒకవేళ యజమానికిచ్చివుంటే వాపసుతీసుకోండి. రిజిస్ట్రేషను అయిపోయివుంటే అమ్మేసేయమని ఆయనకు చెప్పండి. మీ చెల్లెలు ఇలారాయమంది'' అంటూ.

రామారావు గొంతులో వచ్చివెలక్కాయపడింది. డబ్బున్నవారిలాగే ఆలోచిస్తారా? ఏం చేసేందుకుతోచని పరిస్థితిలో పడ్డాడతను.

''ఏం నిర్ణయించారు?'' ప్రశ్నించింది అన్నపూర్ణ.

''ఏమీ ఆలోచించలేదు'' నిర్లిప్తంగా అన్నాడు అతను.

''తప్పంతా మీదే...''

''మధ్యలో నేనేంచేశాను''

''ఏంచేస్తున్నారో మీకు తెలీదు...అసలు మీరు స్థలం విషయం వారికెందుకు చెప్పారు? డబ్బుగురించి ఎవరైనా అడిగారా..ఓ తమ్ముడు ప్లాస్టరింగు పని చేయించాలని తప్పుకున్నాడు. మరోతమ్ముడు యింటి సామానులుకొనాలని ప్లేటు ఫిరాయించాడు. ఇవ్వటం యిష్టంలేదని చెప్పకుండా యిలా కుంటుసాకులు చెప్పారు ఈ బావమరది పెద్ద ప్లానుతోనేవున్నాడు. మీనాన్నగారు మాత్రం తక్కువతిన్నారా..కూతుళ్ళు ముగ్గురుకూ మూడేసివేలుయిచ్చారు. మీ ఆఖరి తమ్ముడి ట్రాన్సఫరు నిమిత్తం ఆఫీసులో నాలుగువేలు ఖర్చుచేశారు. మీఅమ్మగారి పేర పదిహేనువేలు ఫిక్సెడ్ డిపాజిట్టు చేశారు. మీతోమాత్రం యిల్లు కొనాలని అబద్ధం చెప్పారాయన...తండ్రి ఆదుకోకపోతే ఎవరు ఆదుకుంటారు. మీ పిచ్చిగాని...అయినా ముందు జాగ్రత్తలేకుండా జల్సాగా ఖర్చుచేశారు. తమ్ముళ్ళు-చెల్లెళ్ళుకోసం ఖర్చుచేశారు. ఇప్పుడు మీకు మొండి చెయ్యి చూపారు అందరూ''.

ఇదంతా తనకుతెలియకపోతే కదా..

అన్నపూర్ణకెలా తెలిసిందానిమాత్రమే ఆలోచిస్తున్నాడు రామారావు. ఆవిషయం అడిగితే సీరియస్‌గా చెప్తుంది. అప్పుడు విషయం మరింతగా సాగుతుంది. అవకాశం వచ్చినప్పుడుల్లా ఎగతాళి చేస్తుంది. అది భరించడం తనవల్ల అయ్యేపనికాదు. కొన్ని సమస్యలకు మౌనమే జవాబు. దానివల్ల తాను నష్టపోయేదేమీ ఉండదు. అన్నపూర్ణ మాటల్లో నిజంలేకపోలేదు. ఈ రోజుల్లో ఎదుటవారిని నమ్మేముందు వారిని బాగాస్టడీ చేయాలి. ఉపకారం చేసేముందు అదిపొందేవారి అర్హత, యోగ్యత తెలుసుకోవాలి. స్వార్థంలేని ఉపకారం ఏమిటి..సముద్రంలో గ్లాసుముంచితే గ్లాసుడు నీళ్ళు మాత్రమే వస్తాయి. అంతేగాని సముద్రం అంతా గ్లాసులోకిరాదు. ఇప్పటికైనా కళ్ళు తెరచి భవిష్యత్తుని గురించి ఆలోచించాలి అనుకున్నాడు రామారావు.

స్థలం యజమానితో బావమరది స్థలం గురించి, తనకిచ్చిన స్థలం బాకీగురించి మాట్లాడేందుకు బయలుదేరాడు అతను. ''వళ్ళచెట్టుకే రాళ్ళదెబ్బలు'' అంటే ఇదేకాబోలు! అనుకుంటూ.

రోడ్డు దాటేందుకు అయిదునిమిషాల నుంచీ ప్రయత్నిస్తున్నాడు రామారావు. ఇరువైపులనుంచీ వాహనాల రద్దీ ఎక్కువగానే వుంది. ట్రాఫిక్ కానిస్టేబులు లేడక్కడ. బిజీ సెంటర్ అది. ట్రాఫిక్‌ని అయిదునిమిషాలకోసారి నిలిపి పాదచారులకు రోడ్డుదాటేందుకు సాయపడాలి... కానీ వాహనాలు కొల్లేటి చాంతాడులా... చీమల బారులుగా పోతుంటే ఎవరికైనా సహనం చచ్చిపోతుంది. కోపం, చికాకు సరేసరి...

రామారావుమీద దయకాబోలు రద్దీకొద్దిగా తగ్గింది. ఇదేసమయమనుకొని నాలుగడుగులు ముందుకు వేసాడు రామారావు. అయిదో అడుగు వేస్తుంటే ఏ పక్కనుంచో ఓ స్కూటరు వచ్చి గుద్దింది. సెకండులోగా అతను కింద, చెప్పులు ఫుట్‌పాత్‌మీద పడ టం... స్కూటరు సడన్‌బ్రేకుతో ఆగటం... జరిగిపోయింది.

కరుణాకరం యింటికి వెడుతుంటే ఏమిటీ

అపశకునం?

రామారావు లేచి వంటికి, బట్టలకు పట్టిన దుమ్ము దులుపుకుని, చెప్పులు తీసుకుని, స్కూటర్‌వాలావైపు చూసాడు. అయితే స్కూట రువాలా నిమ్మకునీరెత్తినట్లు వున్నాడు.

"ఏంసార్... ఆ రంగుకళ్ళజోడు తీసి డ్రైవ్ చేస్తే మంచిది కదా" అన్నాడు రామారావు మోచేతికి తగిలిన దెబ్బమీది రక్తాన్ని తుడుస్తూ.

"నాకేం చత్వారంలేదు. కళ్ళు బాగానే కని పిస్తున్నాయి. అందుకే మీరు బతికిపోయారు... రంగుకళ్ళజోడు పెట్టుకుంటే రోడ్డు కనవడకపోదు" అంటూ గర్వంగా చెప్పాడు స్కూటర్ వాలా.

"అందుకేనా, రాంగుసైడునుంచి వస్తున్నారు"

"అయినా మీరు యిక్కడ ఎలా క్రాస్ చేస్తున్నారు... అసలు మీకు రోడ్డు సూత్రాలు తెలుసా... మీ యిష్టం వచ్చినట్లు క్రాస్ చేయడమేనా..."

"చూడండిసార్... మీరు యీ రద్దీ జోనులో స్పీడుగా రావడంతప్పు. రాంగుసైడులో వచ్చి గుద్దటం మరోతప్పు. అందులో ఇది డౌనుగావున్న రోడ్డు. రంగుటద్దాలు పెట్టుకుని, ఇన్‌షర్టువేసుకొని బ్రీఫ్‌కేసుతో స్కూటరు డ్రైవ్‌చేసినంత మాత్రాన సరిపోదు..."

స్కూటరువాలా వినిపించుకోటంలేదు. ఎలాగైనా తప్పించుకునిపోవాలని వుద్దేశపడుతున్నాడు. ఈలోగా ట్రాఫిక్ కానిస్టేబులు వస్తే కేసు... చలాను... లేనిపోని గొడవ... అయితే వాళ్ళిద్దరే యిలా నిలబడి చర్చించుకుంటున్నారు. ఎవరూ పట్టించుకోటంలేదు. ఎవరికి కావాలి ఎవరెలాపోతే...

"నాకు డాష్ యివ్వడంవల్ల ఏమీ నష్టంలేదు. నాకు దెబ్బలు తగిలితే ఆసుపత్రికి వెడతాను. కాని మీరు ఏ లారీనో, బస్సునో, ఆటోనో డాష్‌యిస్తే ఇంతేసంగతులు. మీ నిర్లక్ష్యం, అజాగ్రత్తవల్ల యింట్లోవున్నవాళ్ళు జీవితాంతం బాధపడతారు. అది గుర్తుంచుకుని స్కూటరు నడిపితే బాగుంటుంది" అన్నాడు రామారావు.

"మీలాంటివారిని మా స్కూటరిస్టులు ఎంతోమందిని చూస్తుంటారు. ఇలా వినడం మామూలే... చూసీచూడనట్లుగా... వినీవిననట్టుగా వుండటమే మంచిది" అన్నట్లుగా చూసి వెళ్ళిపోయాడు స్కూటరువాలా.

బస్సులు, లారీలు, ఆటోలు, టాక్సీలు, రిక్షాలు, సైకిళ్ళు రోజూ ఎన్నో ప్రమాదాల్లో గురవుతుంటాయి. కర్మ దురదృష్టం, అని వేదాంతంవైపు ఆలోచించేవాళ్ళుకూడా లేకపోలేదు.

దగ్గరలో ఓ ప్రాథమిక ఆరోగ్యకేంద్రం వుంది.

రామారావు అక్కడకు వెళ్ళాడు. డాక్టరు ఓ నర్సుతో ముచ్చట్లు చెపుతున్నాడు. మరొక నర్సువచ్చి అతనికి ఇంజక్షనుచేసి ఏదో మందుగాయాలకు పూసింది. కాలుకొద్దిగా నొప్పిగా వుంది. లాగుతోంది. నలపరంగా ఉంది. ముందులేకపోయినా అరగంట తరువాత యిప్పటికి తెలుస్తోంది.

తెల్లపాంటు మూలంగా రక్తపు మరకలు కొద్దిగా కన్పిస్తున్నాయి. ఏమరుపాటున ఎవరైనా చూస్తే మినీమర్డరు చేసివస్తున్నట్టుగా భావించవచ్చు... అందుకే ఆసుపత్రిలోని టాయిలెట్‌కెళ్ళి ఎరుపు మరకలు శుభ్రంగా కడిగాడు. కాని గుర్తులు అలాగే వున్నాయి. సబ్బుతోనో, వాషింగ్‌పౌడర్‌తోనో వుతికితే తప్పపోవు...

ఇంజక్షను చేయించుకోటంవల్ల కాబోలు కొంచెం నలవరం తగ్గింది. ఇప్పుడు కరుణాకరం ఇంటికివెళ్ళి అడగటమా లేక నాలుగైదు రోజులు పోయాక వెళ్ళటం మంచిదా - అనే సందిగ్ధంలో కొంచెంసేపు వూగిసలాడాడు. అయితే వెళ్ళేందుకే సిద్ధపడ్డాడు. బయలుదేరాక ఏదో అడ్డంకివల్ల మానుకోటం ఏమిటి?

టైము ఒంటిగంట అవుతోంది.

దాదాపు కిలోమీటరు దూరం నడిచాడు సిటీబస్సుదిగాక.

కొంచెందూరంలో రామారావుకో దృశ్యం కనిపించింది. ఇద్దరుపిల్లలు - పది, ఎనిమిది ఏళ్ళ వయసుంటుంది. అన్న చెల్లెలు అని చూసినవారు యిట్టే గ్రహించగలరు. వాళ్ళు స్కూలు యూనిఫాం ధరించారు. కిందపడివున్న పుస్తకాలను తీసుకొని బ్యాగుల్లో సర్దుకుంటు

న్నారు. పక్కగా నడుస్తున్నవాళ్ళు మంచికీ, మానవత్వానికీ తిలోదకాలు యిచ్చారు కాబోలు హాయిగా, సరదాగా చూసిపోతున్నారు.

రామారావు ఆ పిల్లల్ని సమీపించి "ఏమయింది" అని ప్రశ్నించాడు.

."ఎవరో సైకిలు డాష్‌యిచ్చి వెళ్లిపోయాడు" "చెల్లెలు వైపు చూస్తూ చెప్పాడు ఆ బాబు.

పాప బిక్కముఖం పెట్టింది.

రామారావు వారి బట్టలకంటిన దుమ్మును దులిపి, పుస్తకాలను బాగుల్లోకి సర్దేశాడు. "మీ యిల్లు ఎక్కడ... ఇక స్కూలు లేదా" అని అడిగాడు.

పిల్లలు చెప్పారు—

"ఎలా వెడతారు?"

"బస్సుమీద"

"బస్టాపు దూరంకదా... అంతవరకూ నడవగలరా..." అడుగుతున్నాడు రామారావు.

పిల్లలకేం జవాబు చెప్పాలో తోచలేదు.

రామారావు ఆటోపిలిచాడు. పిల్లలను కూర్చోపెట్టి తాను ఎక్కాడు - ఇంటివైపు.

పావుగంటలో ఇల్లు చేరారు.

గుమ్మంలో పిల్లల రాకకోసం ఎదురు చూస్తున్నవారి తల్లి కనిపించింది. రామారావు పిల్లలను దింపి ఆటోఫేరు చెల్లించాడు. ఆశ్చర్యంగా రామారావువైపు చూసింది ఆమె.

"ఏమిటోనండీ... ఈ స్కూటరువాళ్ళకి కళ్ళు నెత్తిమీదకొస్తున్నాయి. ఇక సైక్లిస్టులు కూడా ఏమాత్రం తీసిపోనట్లుగా తొక్కుతున్నారు. బయటికెళ్ళిన వాళ్ళు ఇల్లు చేరేదాకా భయంగానే ఉంటోంది..." అంటూ పిల్లలను తల్లికి అప్పగించి తన ప్రమాదం గురించి వివరించాడు రామారావు.

అంతలో ఆ పిల్లల తండ్రి వచ్చాడు.

అతను రామారావుని చూసి ఆశ్చర్యపోయాడు.

స్కూటరువాలా... తనని డాష్‌ఇచ్చినవాని ఇల్లా... ఈ పిల్లలు అతని పిల్లలా...

"పాపం ఉదయం ఎవరో స్కూటరు డాష్ ఇచ్చారుట. ఇప్పుడు మన పిల్లల్ని ఎవడో సైక్లిస్టు డాష్‌ఇస్తే- పిల్లల్ని ఆటోమీద తీసుకువచ్చారు" అంటూ చెప్పసాగింది ఆ కన్నతల్లి.

స్కూటర్‌వాలా గిల్టీగా అన్నాడు- "సారీ సార్.. పొరపాటైపోయింది... బ్రేకువేసినా ఓ పట్టాన ఆగలేదు బండి. ఇంతకీ గాయాలు బాగా తగిలాయా? మిమ్మల్ని అనవసరంగా నిందించాను. నా తప్పుని సమర్థించుకున్నాను... క్షమించండి"

"తప్పు మీదీ నాదీకాదు. ట్రాఫిక్‌ని కంట్రోలు చేయవలసిన కానిస్టేబులు అక్కడ లేకపోవడమే... ఏ ఉద్యోగి అయినా తన బాధ్యతని మరిచిపోతే ఎలాగ... క్రమశిక్షణలేనివారికి ఉద్యోగం చేసే అర్హతలేదు. ఆ సమయంలో పెద్ద ప్రమాదం జరిగితే ఏమయ్యేది... ప్రమాదం జరగకుండా చూడవలసినదిపోయి తీరుబడిగా వచ్చాడు ఆ ట్రాఫిక్ పోలీసు. పైగా నెంబరు నోట్‌చేసుకోపోయారా అని ప్రశ్నిస్తున్నాడు. ఆ డ్యూటీ నీది అంటే కసురుతున్నాడు సదరు ట్రాఫిక్ కానిస్టేబులు. ఇదండీ మన పోలీసుయంత్రాంగం పనిచేస్తున్న తీరు..." అన్నాడు రామారావు.

"ఇంతకీ మీ ఇల్లు ఎక్కడ సార్?" ప్రశ్నించాడు స్కూటరువాలా. చెప్పాడు రామారావు— "కాని నేను ప్రస్తుతం వేరేపనిమీద ఓ ఫ్రెండుని కలిసేందుకు వెడుతున్నాను" చెప్పాడు రామారావు.

"నేను డ్రాప్ చేస్తానులెండి".

ఇంతలో కాఫీలు తెచ్చింది ఆ ఇంటి ఇల్లాలు.

పదినిముషాల తరువాత రామారావుని తీసుకుని స్కూటరువాలా బయలుదేరాడు. అరగంట తరువాత స్కూటరు కొత్తపేట క్రాస్ రోడ్డు దగ్గర ఆగింది.

"ఇక్కడ ఆపండి... నేను వెడతాను... చాలా థాంక్స్" అన్నాడు రామారావు.

స్కూటరువాలా ప్రతి నమస్కారం చేస్తూ— "జరిగినదానికి ఏమీ అనుకోకండి... అప్పుడప్పుడు ఇంటికి వస్తూఉండండి" అని వెనుకకు మళ్ళాడు.

దూరంగా కనిపిస్తున్న వేపచెట్టువైపు నడిచాడు రామారావు. ఆ చెట్టుకింద కాసేపు

నిలబడాలని రామారావు ఉద్దేశం. జేబులో నుంచి జేబురుమాలు తీసి ముఖం తుడుచుకొని నెమ్మదిగా అడుగులు వేయసాగాడు. పైము మూడున్నర అయింది.

రామారావు వేపచెట్టుని సమీపిస్తుంటే కుడి పక్కగా ఉన్న రోడ్డు మొదట జనం గుమిగూడి ఉన్నారు. ఆ సందులోనే మునలయ్యఇల్లు ఉంది. ఆయన తనకు స్నేహితుడు. మంచి మాటకారి. తెలివైనవాడు. కానైతే అవి అతని భార్యకు, కొడుకులకు రుచింపవు. అందుకే వారు ఆయన్ని చిన్నచూపు చూస్తారు.

ఎప్పుడైనా కనిపించినప్పుడు ఈ గోడంతా చెప్పుకుని బాధపడుతూ ఉంటాడు. ఆ సందు మొదట ఏదో హడావుడి కనిపించింది. వాతావరణం గందరగోళంగా తోస్తోంది. ఏదో జరిగినట్లుగా తోస్తోంది. అప్పుడు కనిపించాడు కరుణాకరం.

రామారావుని చూసి దగ్గరకొచ్చాడు కరుణాకరం.

"ఏమైంది?" ప్రశ్నించాడు రామారావు.

"మునలయ్య రాత్రిపోయాడు"

ఆశ్చర్యపోయాడు రామారావు– "అయ్యో పాపం... నాలుగురోజుల క్రితం కలిసి గంటసేపు మాట్లాడేడు. ఏదైనా సినిమాకు వెడదామని అంటే ఆదివారం మీ ఇంటికి వస్తాను, వెడదామన్నాను... ఇంతకీ ఏమయింది" అంటూ సానుభూతిగా అన్నాడు.

"రామారావ్... నీకు, నాకు మాత్రం ఆ ఫీలింగు ఉంది. కాని ఇక్కడ చేరిన వారెవరికీ బాధ, విచారం, ఆలోచనలేదు. అప్పుడే మునలయ్య ఇంటిని, బంగారాన్ని, ఆస్తులను చేజిక్కించుకోవాలని లోపల తతంగం జరుగుతోంది. నిన్న సాయంత్రం బాంకునుంచి మునలయ్య పదివేలు రూపాయలు తెచ్చాడు. ఇప్పుడు అవి లేవు. ఆ సమయంలో బావమరిది తప్ప ఎవరూలేరు. పెళ్ళానికీ డబ్బు విషయం తెలీదు. అలాఉంచు. మునలయ్యకు అయిదుగురు కొడుకులుకదా... కాని ఏంలాభం! పెద్దవాడు, రెండోవాడు అమెరికాలో ఉన్నారుకదా... పొద్దున్నే ఫోను చేసి రమ్మని చెప్తే, తాము వచ్చేందుకు వీలుకాదని తమ్ముళ్ళచేత కర్మకాండ జరిపించమంటున్నారు. రాత్రి మూడు నాలుగుసార్లు ఫోనుకోసం ప్రయత్నిస్తే దొరకలేదు వాళ్ళు. ఇపుడిదీ జవాబు. ఇక ఈ ముగ్గురు కొడుకులూ వారం క్రితం మునలయ్యను చూసేందుకొచ్చి ఆస్తిపంపకాల గురించి ఒత్తిడిచేశారుట. ఆ వేధింపే ఆయన గుండెపోటుకు కారణమైంది. రాత్రి నాకు కబురు అందింది. ఇప్పటికీ శవం పెరట్లో బాత్‌రూం దగ్గరున్న చెట్టుకింద పడిఉంది.

కరుణాకరం మాటలకు అడ్డు తగిలాడు రామారావు.

"శవం అక్కడ ఉండటం ఏమిటి.." అని.

"బాత్‌రూము కెళ్ళి తిరిగి వస్తూ అక్కడపడిపోయి ప్రాణాలు విడిచాడుట మునలయ్య. డాక్టరుని తెచ్చేవారు కూడా లేరుట. అంతా నిముషాల్లో జరిగిపోయింది" కరుణాకరం చెపుతున్నాడు.

"మరి నువ్వయినా శవాన్ని లోపలకు చేర్పించకపోయావా"

"నేను చేయలేదనా... నన్నెవరూ అక్కడ లెక్కచేయటంలేదు. పైగా అక్కడి వాతావరణం వేరుగా వుంది. మునలయ్యది సొంత యిల్లేకదా... కొడుకులు అంగీకరించలేదు. పోయినసమయంలో తిథి, నక్షత్రం మంచివికాదట.. పైగా మునలయ్యకు ఓ దిక్కుమాలినరోగంకదా... కట్టుకున్న పెళ్లామే వినిపించుకోటం లేదు అక్కడ. ఇక కన్నకొడుకులు ఎందుకు వింటారు. ఎవరికివారు తప్పుకుంటున్నారు. రాత్రినుంచి చీకటిలో మంచులో అలాగే పడివుంది శవం. కొడుకులు ఏదో ఉద్ధరిస్తారని, తలకొరివి పెడతారని, పున్నామనరకంనుంచి తప్పిస్తారని ఆశపడతారు కన్నవాళ్లు. పైగా గర్వంగా, గొప్పగా ఫీలవుతారు వాళ్లు. కాని యిలా తయారవుతున్నారు యీ కొడుకులు. డబ్బు, ఆస్తి చాటు మనుషులు... ఇప్పుడు యీ కొడుకులు కర్మచేయమంటున్నారు. తప్పుకుంటున్నారు. వారికి జీవితం, భవిష్యత్తు ముఖ్యమట... తండ్రి ఆస్తిపాస్తులు కావాలిట.. ఎంతో నచ్చచెప్పాను. కాని ఏంలాభం! చదువుకున్నమూర్ఖులు, కుసంస్కారులు... మునలయ్యకు ఎంత ఖర్మవచ్చిపడిందో చూడు... ఇంతకీ, నువ్విలా వచ్చావేమిటి?"

"నీకోసమే వచ్చాను" అన్నాడు రామారావు.

"ఏమిటీపని..." అడిగాడు కరుణాకరం.

"అర్జంటుగా అయిదువేలు కావాలి"

కరుణాకరం మీనమేషాలు లెక్కపెట్టసాగాడు. వినిపించుకోనట్టు ఫోజు పెట్టాడు. "ముసలయ్య నాకు స్నేహితుడుకదాని కర్మకాండ నేనే చేద్దామనుకుంటుంటే యిబ్బంది వచ్చిపడింది. నాకు తల్లి తండ్రి వున్నారు... పైగా ఎల్లుండి ఓ కొత్త వ్యాపారం ప్రారంభిద్దామనుకుంటున్నాను. ఏర్పాట్లు కూడా చేస్తున్నాను. ఇప్పుడు యీ వ్యవహారం ఎలా చేయగలను... అందుకే ఎవరైనా కనిపిస్తారేమోనని యిక్కడ చూస్తున్నాను- ఇంతలో నువ్వు కనిపించావు"

రామారావుకి ముసలయ్య సజీవంగా కనిపిస్తున్నాడు. మరోవైపు 'గ్రేట్ ఎక్స్‌పో' వారి ఆర్థికపథకాలు కనిపిస్తున్నాయి. డబ్బుకోసం కరుణాకరం దగ్గరకొస్తే ఫలితం యిది. ఇప్పటికిది రెండోఅవాంతరం... ఏమిటీ అడుగుఅడుగునా అడ్డంకి! అనిపించింది. కరుణాకరం కూడా యిప్పుడు డబ్బు ఇచ్చేలా లేడు. తాను ఇక ఎవరిని అడగగలడు... ఇంట్లో తాను అన్నపూర్ణతో ఏంచెప్పగలడు. తాను చేసిన ప్రయత్నాలు ఆమె నమ్ముతుందా... ఇప్పుడేం చేయాలి... మళ్లీ ఆలోచన్లు ముసురసాగాయి.

ముసలయ్య ఎంత గొప్పగా బతికాడు!

చివరికి ఎటువంటి చావు వచ్చిపడింది!

మంటల్లో మానవత్వం అంటే యిదే కాబోలు! ఆ మంటలు అందించే వేడి శగల్లో చలికాచుకోడమేనా కొడుకుల ఆశయం.

రామారావులో తళుక్కున ఓ ఆలోచన మెరిసింది. "కరుణాకరం- నేను చేస్తాను... ఈ కర్మకాండ" అన్నాడు.

కరుణాకరం చటుక్కున అన్నాడు- "ఏమిటి నువ్వనేది.. నీకు తల్లీ.. తండ్రీ వున్నారు.."

"వాట్ నాన్సెన్స్ యు ఆర్ టాకింగ్... ఓ మూల ముసలయ్య అలా చచ్చిపడున్నాడు. టైము నాలుగుగంటలు కావస్తోంది. అటు కొడుకులూ సాగనంపక, యిటు స్నేహితుడుగా నువ్వు మాట్లాడక, నేనూ చేయకపోతే ఆ శవం గతి ఏమిటి... నాకు యీ పద్ధతులు, ఆచారాలు, పట్టింపులపట్ల నమ్మకంలేదు. ఎప్పుడో ఏళ్లక్రితం ఏర్పడిన సిద్ధాంతాలను యిప్పటికీ మూఢంగా, గుడ్డిగా నమ్మటం ఏమిటి... కాలాన్నిబట్టి, పరిస్థితులనిబట్టి మనం ముందుకు నడవాలి... మనం కూడా ముసలయ్య కొడుకుల్లా ఆలోచించటం ఏమిటి.. ఈ తతంగం నేను జరిపిస్తాను.. ముసలయ్య ఆత్మ ఏలోకంలో వున్నా అది సంతోషిస్తుంది... ముందు ఆ వ్యవహారం చూద్దాం- పద" అంటూ ముందుకు నడిచాడు రామారావు.

కరుణాకరం అనుసరించాడు.

ముసలయ్య కొడుకులతో విషయం చెప్పాడు.

ఈ బాధ్యత రామారావుకి బదిలీ అయినందులకు వాళ్లు స్వగతంలోనే సంతోషించారు.

సాయంత్రం ఆరున్నరయ్యేసరికి స్మశానంలో బూడిదయిపోయింది ముసలయ్య శవం.

పదిహేనో రోజున—

రామారావుకి ముసలయ్య కొడుకులు ద్వారా కరుణాకరం ఎదుట పదివేల రూపాయలు లభించాయి. ఉత్తరక్రియలు, మిగిలిన కార్యక్రమాలు చూసినందుకూ, జరిపినందుకూ.

రామారావు ఆశ్చర్యపోయాడు. "ఏమిటీ డబ్బు" అని అడిగాడు వెంటనే.

"ఏమీలేదు రామారావ్... పారితోషికం.. నువ్వు చేసిన ఉపకారానికి ప్రతిఫలం. అసలు వాళ్లు నాతో యీ విషయం ముందే చెప్పారు. స్నేహితుడివి కదాని చెప్పలేకపోయాను. మన మధ్యవున్న పరిచయం, స్నేహం చెప్పనివ్వలేదు- ఇది వారి తప్పుకాదు" కరుణాకరం చెప్పాడు నంజాయిషీగా.

"అయితే మాత్రం... చేసినపనికి వెలకట్టాలా... అందులో యీపనికి! ముసలయ్య నాకు మంచిస్నేహితుడు. అంతే... ఈ డబ్బు దయచేసి తీసుకోండి" నిశ్చయంగా అన్నాడు రామారావు.

అప్పుడు ముసలయ్య కొడుకుల్లో ఒకడన్నాడు- "ఓమాట చెప్తాను, ఏమీ అనుకోరుగా..."

"చెప్పు"

"ఈలోకంలో డబ్బుకున్న విలువ, పరపతి, గుర్తింపు, గౌరవం మనిషికి కూడా లేదు. మనిషికేమీ లేకపోయినా బతకగలడు. కాని డబ్బులేకపోతే ఒక్కరోజుకూడా గడవదు. డబ్బు మనల్ని శాసిస్తుంది, పాలిస్తుంది, పరుగె

ట్టిస్తుంది. అదృష్టమో, దురదృష్టమో మాకు డబ్బుకి లోటులేదు. నేను కమర్షియల్ టాక్సు ఆఫీసులో రోజుకి వంద రూపాయలు పైనే సంపాదిస్తాను. నా తరువాత యిద్దరూ పోలీసు డిపార్టుమెంటులో ఉద్యోగులు. ఇక వారి ఆదాయం గురించి మీరే ఆలోచించండి. మా అన్నయ్యలిద్దరూ అమెరికా ఎందుకు వెళ్లారంటారు! అసలు చాలామంది విదేశాలకు ఎందుకుపోతున్నారు, తమ సేవలను స్వదేశంలోనే ఉపయోగించవచ్చుకదా... ఆవిషయం ఇక వదిలేయండి.. మేము అయిదుగురు సోదరులం. డబ్బుని ఎలా ఖర్చుచేయాలో తెలియక, తోచక నోట్లు చింపేస్తుంటాము సరదాకి. మా తండ్రి- దటీజ్ యువర్ ఫ్రెండ్, చావువల్ల మాకెంత నష్టమో ఆలోచించండి. అయినా బాధపడమే ... ఎందుకో తెలుసా, కల్పతరువులాటి ఉద్యోగాల్లో ఆయన మమ్మల్ని చేర్పించాడు... పదిరోజుల్లో ఈ ఖర్చంతా సంపాదించగలం.. ఆఫీసుల్లో ఉద్యోగులు, పాలకులు, వరుల్లు, వ్యాపారస్తులు ఒకరనేమిటి, ఎవరికివారు సంపాదించాలనే ధ్యేయంతోనే ఉంటున్నారు. అటువంటప్పుడు మీలాటివారి ఆలోచనలకు అర్థంలేదు. మనిషి పుట్టినప్పట్నుంచీ చచ్చేవరకూ డబ్బు ప్రమేయం వుంటుంది. మేము పనిచేసినందుకు డబ్బు తీసుకుంటాం. అలాగే మాకెవరు పనిచేసిపెట్టినా అందుకు వెల కడతాం. మీరీ డబ్బుని స్వీకరించాలి. నిరాకరించడం భావ్యంకాదు. చేతిలో వున్న డబ్బుకి బంగారం కంటే ఎక్కువ విలువ ఉంది. ఇప్పుడు తెలీదు... అది లేనప్పుడే దానికోసం పరుగులు-ఉరుకులూ...'' సుదీర్ఘంగా చెప్పాడు ఆపుత్రరత్నం.

కరుణాకరం డబ్బు తీసుకోమన్నట్లుగా చూసాడు.

రామారావుకిదంతా అగమ్యగోచరంగా వుంది.

అతనికి ఆ డబ్బు తీసుకోక తప్పలేదు.

ఈ డబ్బుని 'గ్రేట్ ఎక్స్‌పో'లో పెట్టుబడి చేస్తే... కొంత స్థల యజమానికి యిస్తే... ఆశపుట్టింది. ఆలోచన వురికింది.

కరుణాకరం.. రామారావు రోడ్డుమీద నడుస్తున్నారు.

''ఇప్పుడేం చేస్తారో ఈ డబ్బుతో'' అని అడిగాడు కరుణాకరం.

గ్రేట్ ఎక్స్‌పో పథకం గురించి చెప్పాడు రామారావు.

''ఈ డబ్బు నాకియ్యి... మూడు రూపాయల వడ్డీ యిస్తాను. అంటే నెలకు నీకు మూడొందలు ముడతాయి. నువ్వు అడిగినప్పుడు యిచ్చేస్తాను'' అన్నాడు కరుణాకరం.

రామారావుకి నవ్వొచ్చింది ''భలేవాడివోయ్... నీకు అప్పు దేనికి... అందులో యిటువంటి డబ్బుతోటా...''

''అలా అనుకుంటే ప్రయోజనంలేదు. అసలు నేను యీ విషయం నీకు చెప్పకపోతే... నువ్విలా హఠాత్తుగా లాభం పొందేవాడివికాదుగా... ప్రస్తుతం ఈ డబ్బుని వ్యాపారంలో వినియోగించాలి.. నీకు ఇబ్బంది లేకుంటే యివ్వు... లేకపోతే లేదు'' అన్నాడు కరుణాకరం.

''ఏ పరిస్థితుల్లో నేను ఈ డబ్బు స్వీకరించానో నాకు తెలును... కాబట్టి కొంత నువ్వు తీసుకో...'' అన్నాడు రామారావు డబ్బు ఇస్తూ.

''ఇవేళ మంచిరోజుకాదు.. నేనే మీఇంటికి వచ్చి తీసుకుంటాను'' అని వెళ్లిపోయాడు కరుణాకరం.

రామారావు తిన్నగా గ్రేట్ఎక్స్‌పోకి బయలుదేరాడు.

ఆశ్చర్యం... అక్కడ పోలీసులు.. ఫైర్ ఇంజన్లు... హడావిడిగా వుంది. ఓ అరగంట క్రితం గ్రేట్ఎక్స్‌పో వున్న హొటల్లో అగ్నిప్రమాదం జరిగిందట. వస్త్రాలు పూర్తిగా కాలిపోయాయిట. రికార్డులు, పుస్తకాలు అంటుకుపోయాయిట. పది మందికి గాయాలు తగిలాయి... ఇద్దరు చనిపోయారు.... జనం చెప్పుకుంటుండగా విన్నాడు రామారావు.

అంతే, అతను అక్కడ నిలవలేకపోయాడు. ఇది ఓ హెచ్చరిక కాబోలు... తాను ఆశపడ్డాడు- ఎక్కువగా డబ్బు సంపాదించేందుకు. తనకా అదృష్టం లేదేమో... అందరూ డబ్బుసంపాదించలేరేమో... తానీడబ్బు యిదివరకే మరొకచోట అప్పు తెచ్చి వెంటనే చెల్లించి వున్నట్టయితే- మరోవిధంగా జరిగేదేమో... ఇదికూడా

అదృష్టమేమో...

ఆలోచనలు పక్కకు పెట్టి స్థలయజమానికి బాకీని యీ డబ్బుతో చెల్లు చేసేందుకు బయలుదేరాడు రామారావు.



సాయంత్రం రామారావు వచ్చేసరికి, అన్నపూర్ణ ఏదోలా వుండటం గమనించాడు. చెమ్మ పుకళ్ళు అతన్ని లోపలకు ఆహ్వానించినట్లుగా వున్నాయి. అతనికి అర్థంకాలేదు.

"ఏమిటి అలావున్నావు...ఏమైనా" అని ఆగిపోయాడు. గతంలో వాళ్ళ మావయ్య, నాయనమ్మ, పెద్దబావ చనిపోయిన విషయాలు తెలిసినప్పుడు అన్నపూర్ణ అలాగే కనిపించింది. తను కనిపించగానే భోరున ఏడ్చేసింది. అదిప్పుడు గుర్తుకొచ్చింది. మళ్ళీ ఎవరైనా "బండెక్కారా" అనిపించింది. ఊరు నుంచి తిరిగివచ్చి నెలరోజులు దాటింది. మళ్ళీ ఇప్పుడు ఏదైనా ప్రయాణానికి డబ్బు ఏర్పాట్లు చూడాలి కాబోలు...ఎవరిభయం వారిది.

అన్నపూర్ణ ఉత్తరం చూపించింది.

"ఏమిటి విషయం...చెప్పు" అంటూ పంచె కట్టుకోసాగాడు రామారావు.

"మానాన్నకు వంట్లోబాగోలేదుట"

"ఏమైంది...ఇంటికి చుట్టాలెవరైనా వచ్చారుటా?" అంటూ హాస్యమాడేడు.

"మీకెప్పుడూ పరాచకాలే..."

"కాదామరి...మీనాన్నకెవరూ ఇంటికి రాకూడదు. కాని తనుమాత్రం అందరిళ్ళకూ వెళ్ళి రాచమర్యాదలు కావాలంటాడు. ఆ తండ్రి అలవాట్లు, బుద్ధులూ మీ అన్నయ్యలకూ వచ్చేయి- ఇంతకీ ఏమిటి రోగం..." రామారావులో కోపం బయలుదేరుతోంది.

"చదవండి" అంటూ ఉత్తరం ఇవ్వబోయింది అన్నపూర్ణ.

"మీఅమ్మ రాసిన ఉత్తరమా...అది అర్థంకాదులే. ముందుచెప్పు. తరువాత తీరుబడిగా చదువుతాను..."

"మా నాన్నకు ఊపిరితిత్తుల్లో నీరు చేరిందట...మూత్రంలో కూడా ఇబ్బంది అవుతోందిట...దగ్గు, ఆయాసం కూడా వుందిట...పెద్దాసుపత్రికి తీసుకెళ్ళి వైద్యం చేయించమన్నారుట డాక్టర్లు..."

"అయితే ఇప్పుడు నువ్వు మళ్ళీ ఊరెళ్ళాలా?" అని కొంచెంసేపాగి, "ఎందుకేమిటి...చూసేందుకు..." అన్నాడు అతను.

"వెళ్ళను..." నిశ్చయంగా అంది అన్నపూర్ణ.

"అదేం...నువ్వెళ్ళకపోతే ఆటోలు, బస్సులు, రైళ్ళు, గుర్రపుబండ్లు ఏంకావాలి...వాళ్ళకి ఆదాయంఎలా...కొంపతీసి మీ అన్నయ్య వెళ్ళి చూసివస్తానన్నాడా..."

"లేదుట...మా వదినకు ఇంట్లోకొచ్చేరోజులు కావుట"

"అందులో కొత్త ఏముంది. ప్రయాణానికి ముందు వాళ్ళు చెప్పే మొదటికారణం అదేగా...ఓహో...ఈసారి మీ అన్నయ్యకు ఇంట్లోకొచ్చేరోజులుకావా..."అంటూ నవ్వేసాడు రామారావు.

"మీకు ఏడిపించటం సరదాలేగా..."

"వాట్...నేను ఏడిపించటమా...అది నాజాతకంలో వుందా...నాదంతా ఎస్ మేడం వ్యవహారమేగా"

"నాకు వెళ్ళాలనిలేదు"

"కొంపతీసి మీ అన్నయ్య మీనాన్నని తీసుకొచ్చి వైద్యం చేయిస్తానన్నాడా...అందుకే వానాకాలంలో ఈ ఎండలు..."

"మీకు వెటకారంగా వుందా"

రామారావు జేబులోనుంచి వెయ్యిరూపాయలు తీసి భార్య చేతిలోపెట్టాడు. "ఎప్పుడో రావలసిన ఓవర్‌టైము డబ్బు ఈవేళవచ్చింది. బహుశా నువ్వు ఊరుకెళ్ళాలనేమో...వెళ్ళదలచుకుంటే తొమ్మిదిగంటల

బస్సుకి వెడుదువుగాని...'' అన్నాడు రామారావు.

అన్నపూర్ణ ఆలోచిస్తోంది. భర్త డబ్బిచ్చి వూరికెళ్ళమనటం ఆశ్చర్యంగా వుంది. ఆమెకు వాళ్ళ పెద్దక్క చెప్పినవిషయాలు గుర్తుకొచ్చాయి.

"నీకు పిచ్చా ఛాదస్తమా...అంతడబ్బు తగలేసి గృహప్రవేశానికి వెడతావా...'' అంది పెద్దక్క ఏకాంతంగా అన్నపూర్ణని పక్కకుపిలిచి.

"వెళ్ళకపోతే బాగోదుకదా...పైగా చిన్నక్క కూడా వస్తానన్నది. అందుకే బయలుదేరాను'' చెప్పింది అన్నపూర్ణ.

"దానికి బుద్ధిలేదు. వాళ్ళ మావగారు ఓ ఏభైవేలు ఇచ్చాడు కాబట్టి అది ఎన్నివేషాలైనా వేస్తుంది. మీ మావగారు మీకిచ్చిన రెండెకరాలపొలాన్ని అమ్మి పెద్దకూతురి పెళ్ళి చేసావు. ఇంకోకూతురికిచెయ్యాలి...ఇలా ప్రయాణాలకు ఎంతెంతడబ్బు తగలేస్తున్నావో నీకు తెలుస్తోందా...ఏదో ఉత్తరం రాస్తారు-మర్యాదకోసం. అది చదివి బట్టలు సర్ది బండెక్కటమేనా...నువ్వు మీ ఆయన్ని బాగా ఏడిపించేస్తున్నట్టున్నావు- ఇది మంచిపనికాదు'' హెచ్చరించింది.

"ఆయనే వెళ్ళమన్నారు''

"నాకు చెప్పకు. నీతత్వం నాకు తెలీదా...పెళ్ళయిన ఇరవైఏళ్ళలో నేను నిన్నూ-అతన్నీ గమనించలేదనుకుంటున్నావా... అతనికి నోరులేదు. నీనోటికి భయపడి ఎల్లాగో తెచ్చియిస్తున్నాడుగాని మనస్ఫూర్తిగా మాత్రంకాదు. ఏమైనా, ఇది .ఎటుదారితీస్తుందో అర్థంచేసుకోలేకపోతున్నావు. అన్నయ్యల్ని చూసికూడా అర్థంచేసుకోలేకపోతే ఎలాగే'' కోపంగా అంది తను.

"ఇప్పుడేమయిందని...'' అన్నపూర్ణకు అర్థంకాలేక అడిగింది.

"నావిషయమే తీసుకో... నాకూ నీలాటి నోరేగా... అయితే మీబావ అప్పుడప్పుడు కొట్టేవారు కాబట్టి వూరుకోక తప్పేదికాదు. ఇక నానోటికి, ప్రవర్తనకు విసిగిపోయి ఏంచేశారో తెలుసా...''

"ఏంచేశాడు?'' ఆత్రంగా అడిగింది అన్నపూర్ణ.

"విసిగిపోయిన మొగుడు దారితప్పుతాడు. పెళ్ళాన్ని దాని ఖర్మకు వదిలేస్తాడు. రాక్షసుడైతే కిరసనాయిలు పోసి తగలెడతాడు. కాని మీబావ— వాళ్ళ సెక్షన్లో ఓ మొగుడుపోయిన దాన్ని ఉంచుకుని రాత్రిళ్ళు అక్కడే గడిపేవారు. ఇంటికి ఒంటిగంటకో, రెండుగంటలకో వచ్చేవారు. పిల్లల్ని పట్టించుకోడం మానేశారు. ఇంటిని నరేనరి. ఆయనకు పెళ్ళాం వుందని, పెళ్ళాం కూడా ఓ మనిషే అని, దానికీ మనసుంటుందని, ఆ మనసుకూ కోరిక వుంటుందని మరిచిపోయారు. చెప్పుకుంటే సిగ్గుచేటు. జీతంఅంతా దానికేఇచ్చి, నాకు ఏడువందలు ఇచ్చేవారు. ఏంచాలుతుంది, మరికొంచెం ఇమ్మని అడిగితే మీబాబుని అడిగి తెచ్చుకో అనేవారు. ఎంతిస్తే నీకు చాలుతుంది అనేవారు. ఎంతిచ్చినా నీ దుబారా ఖర్చులకే చాలదు. నీ ప్రయాణాలు నరేనరి. ఇన్నేళ్ళు మీగురించి కష్టపడ్డాను. ఇకముందు నాగురించి కష్టపడతాను. నన్ననవసరంగా విసిగించకు. ఇష్టంలేకపోతే పుట్టింటికి పో అనేవారు. ఇలా ఎన్నో తిట్లు, కేకలు, అరుపులు, గొడవలు జరిగాయి ఏడేళ్ళకాలంలో. చివరికి ఆయన తనదారినపోయి నాకు ఏభైవేల అప్పుమిగిల్చారు. కొడుకుచూస్తే అలా వున్నాడు. ఎవరికి చెప్పుకోను! మీబావ పోయేనాటికి చేతిలో రూపాయిలేదు. ఆఫీసు ఉద్యోగులే ఆ కార్యక్రమం జరిపించారు. ఇక, నాన్న మిగిలిన వ్యవహారాలకు అయిదువేలు ఇచ్చాడు. పెద్దన్నయ్య రెండు వేలు ఇచ్చాడు. పదిహేనురోజులయ్యేసరికి అసలు భాగోతం బైటపడింది. "ఆఫీసునుంచి డబ్బురాగానే, అందరికి బాకీలు తీర్చేస్తే బాగుంటుంది'' అన్నాడు నాన్న అన్నయ్యలు నరేసరి... కాబట్టి మనం ఒకరూపాయి ఖర్చు చేసేముందు అవసరం, ఉపయోగం గురించి బాగా ఆలోచించాలి. ఓ పావలా మిగుల్చుకునేందుకు ప్రయత్నించాలి. అంతేగాని మరోపావలా అప్పుచేద్దాములే అని ఆలోచించగూడదు. ఇదంతా నాకు జీవితాన్ని తరచి చూసేక తెలిసింది. తెలిసింది ఆచరించేలా చేయాలనుకున్నాను. అప్పటికే ఆలస్యం అయింది'' పైకి వెక్కివెక్కి ఏడవసాగిందామె.

అన్నపూర్ణకి అయోమయంగా ఉంది.

"చెప్పుకుంటే సిగ్గు. కనీసం అమ్మదగ్గర కూడా చెప్పుకోలేనిదాన్ని... మొగుడు బయట ఎన్నివేషాలు వేసినా భరిస్తుందేమో ఏపెళ్ళామైనా! కాని కొంపలోకే ఆ తద్దినాన్ని తెచ్చిపెడితే ఏంచేయాలో అర్థంకాదు. మీబావ అదే చేశారు. ఆ ఉంచుకున్నదాన్ని నాతోపాటే ఉండమంటే నేనేం చేయాలి..."

"ఇంత బాక్‌గ్రౌండు వుందా నీజాలికథ వెనుక" అని అడిగింది అన్నపూర్ణ.

"తల్లి, తండ్రీ బతికున్నంతవరకూ, వాళ్ళకి తప్పదు కాబట్టి ఎలాగో భరిస్తారు ఏ కష్టం వచ్చినా... ఇక అన్నదమ్ములంటావా, అది దైవా





ధీనమే... ఎవరుమాత్రం ఎన్నాళ్ళని చూస్తారు? ఎవరికాపురాలు, ఖర్చులు వారికి ఉన్నాయి... వీళ్ళు ఏదో తవ్వి తలకెడతారని, బంగారంవంటి కాపురాలు పాడుచేసుకుంటే నాలాగే బాధపడవలసి వస్తుంది. పదవి, అధికారం ఉన్నంతవరకే రాజకీయనాయకులకు గౌరవం, గుర్తింపు. అది కాస్తా హుళక్కి అయితే ఇంతే సంగతులు. చేప నీటినుంచి బైటపడితే బతకలేదు. బెల్లం ఉన్నంతవరకూ చీమలు చేరతాయి. అలాగే మొగుడున్నంతవరకూ, వాడి నీడన ఉన్నంతవరకే ఆడదాని జీవితం అందంగా, హాయిగా ఉంటుంది. ఎంత చదివినా, ఎంత ఉద్యోగం చేసినా ఆమె బతుకు ఓ మొగుడినీడనే. ఉపన్యాసాలు ఇచ్చినా, కథలు

రాసినా, సందేశాలిచ్చినా ఆడదానిబతుకు వంటింటికి దగ్గర్లోనే ఉంటుంది. అదే మగా డైతే పెళ్ళికాకుండా ఉండగలడు. కాని ఆడదా నికి ఓతోడుండాలి. రక్షణకావాలి... నువ్వు ఆ రక్షణ కవచాన్ని జాగ్రత్తగా కాపాడుకోవే పూర్ణా...'' వివరంగా చెప్తోంది అక్క.

"ఏమిటక్కా... ఏంచెప్తున్నావు నువ్వు... ఇప్పుడిదంతా ఎందుకు... అనలేమైంది నీకు'' అన్నపూర్ణ చటుక్కున అడిగింది.

" నీలో ఉన్న అహంకారం, అతిశయం ఇంత వివరంగా చెప్పినా అర్థం చేసుకోలేక పోతే ఎలాగే... నీదారి మార్చుకో... నువ్విలా ప్రయాణాలు, గొప్పలు అంటూ తిరుగు తుంటే మీ ఆయన ఆఫీసులో ఉంటే- ఏం జరుగుతుందో తెలుసా? పిల్లలు కూడా తల్లిదా రిలోనే నడుస్తారు. తప్పుదారులు తొక్కుతారు. ఆ కాలంలోని మగాడికి, నేటిమగాడికీ చాలా తేడా ఉంది. ఇదివరకు న్యాయం, నీతి, గౌ రవం, మర్యాద అని పెళ్ళినాడు చేసిన ప్రమా ణాలకు కట్టుబడి ఉండేవారు. ఇప్పుడు పెళ్ళ యిన మరునటిరోజునుంచే ఎవరికివారు అవు తున్నారు. బహుశా సినిమాలు చూసి, పత్రిక లు చదివి ఆడదాని జీవితం బంగారపు పళ్ళెంలా ఉంటుందని భ్రమపడుతున్నా వేమో ఈరోజుల్లో... అప్పుడూ ఆడదాన్నే పెళ్ళా డేదు మగాడు. ఇప్పుడూ ఆడదే వాడిని చేసు కుంటోంది. ఇంతకీ మీ ఆయన నీకేం తక్కువ చేస్తున్నాడని... నిన్ను పువ్వుల్లో పెట్టుకుని పూజి స్తున్నాడు. ఏంకావాలంటే అది చేస్తున్నాడు. తన సౌఖ్యం, సుఖం కూడా మానుకుని నిన్ను పంపిస్తున్నాడు. ఇటువంటి మొగుడు ఎన్ని తీర్థయాత్రలు చేసినా, నోములు- వ్రతాలు- పూజలు చేసినా లభించడు. ఇప్పటికైనా ను వ్వు మారకపోతే చాలా చిక్కులో పడిపోతావు... ఇప్పుడు అతనికి మంచిరోజులొచ్చాయి. తను కోరుకున్నది ఇప్పుడు జరిగే సూచనలు బాగా కనిపిస్తున్నాయి... నీ మకాం పుట్టింటికి మారినా ఆశ్చర్యపోనక్కర్లేదు...'' ఆవేశంగా చె ప్తోంది పెద్దక్క.

ఈ గోలంతా అన్నపూర్ణకేమీ అర్థంకావటంలే దు. భర్తకు మంచిరోజులు... కోరుకున్నది జర గటం ఏమిటో... అదే అడిగింది.

"మీఆయన ఒకప్పుడు కళ్యాణి అనే అమ్మాయిని పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు. కాని వాళ్ళమ్మ ఒప్పుకోలేదు. ఇప్పుడు కళ్యాణి నాలాగే ఒంటరిది... తోడులేని నిర్భాగ్యురాలు... ఇంచుమించు నాలాటి జీవితమే తనదీను... ప్రస్తుతం మీ ఊళ్ళోనే ఉంటోంది... ఆమెకూ తురు, మీ అయన ఆఫీసులోనే, మీ ఆయన సెక్షన్లోనే పనిచేస్తోంది. నిన్ను వదిలించుకోవాల నుకుంటే మీ ఆయనకు మంచి అవకాశం. నువ్వు న్యాయం, చట్టం, పోలీసులు అని విర్రవీగావంటే ఇంతే సంగతులు. నాన్న అన్న య్యలు ఏదోచేస్తారని, సాయపడతారని మాత్రం కలకనకు. మనసు విరిగిన మగాడు ఏదైనా చేస్తాడు. కాని మొగుడొదిలిపెట్టిన ఆడ దానిబతుకు మాత్రం పదవి, అధికారం పోయిన నాయకుడికంటే హీనం. అంతవరకూ ఉన్న స్నేహితులు, ఆప్తులు దేరామార్చేస్తారు. ఇప్పుడు మీ ఆయన ఏంచేస్తాడు అన్నది మనం ఊహించొద్దు. అవకాశాన్ని ఏ మగాడూ వదులుకోలేడు. చెప్పడమే నా బాధ్యత... వినడం వినకపోవడం నీ ఇష్టం...'' అంటూ ముగించింది పెద్దక్క.

అప్పట్నుంచీ అన్నపూర్ణ ఆలోచిస్తూనే వుంది. ఇన్నాళ్ళు భర్తని ఆటపట్టించింది...ఇ ప్పుడు తన ధోరణి మార్చుకుంటే చులకన అయిపోదూ...ఇంత బతుకూ బతికి...అన్న ట్లుగా అవదూ. మొగుణ్ని కంట్రోలుచేయక పోతే ఆడదాని బతుక్కి అర్థంలేదు. తన ఫ్రెండ్సు ఎదుట తను ఏంకావాలి...వారి ప్రశ్న లకు తన వద్ద ఏం జవాబులు వున్నాయి. పెద్దక్క పిచ్చిది...మొగుణ్ని మొదట్నుంచీ అర్థం చేసుకోలేదు. చేతులు కాలేవరకూ ఎందుకూరుకోవాలి!

"ఏమిటి మాట్లాడవు...టైమవుతోందిగా...వె డతావా వెళ్ళవా...నువ్వు ఈలోగా బట్టలు సర్దు కో...నేను వెళ్ళి మీ అన్నయ్యకు, చిన్నక్కకు చెప్పివస్తాను'' అన్నాడు రామారావు.

అన్నపూర్ణ ఆలోచనల్నుంచి తేరుకుంది.

భర్త ఎందుకింత తొందరపడుతున్న ట్లు...కొంపతీసి తనను వదిలేసి, పెద్దక్క చెప్పి నట్లు కళ్యాణిని తెచ్చుకుంటాడా...తనకి పుట్టింట్లోనే మకామా...ఎప్పుడూ ప్రయాణం అంటే ఏనుక్కునే రకం...తిట్టిపోసి ఆ తరు వాత, ఏడుస్తూ డబ్బు యివ్వటమే చేతనైన

భర్త యిప్పుడు ఆనందంగా అంగీకరించట మా...దీనివెనుక ఏదో కథ వుందేమో...తన అవసరాన్ని అవకాశంగా తీసుకుంటున్నా డా...తనిప్పుడు ఏం చేయాలి?

"నేను వూరు వెళ్ళటం లేదు" అంది అన్నపూర్ణ.

"నేను వెళ్ళాలా..." అని అడిగాడు రామా రావు.

"ఎవరూ వెళ్ళక్కర్లేదు"

"వెళ్ళకపోతే బాగోదుకదా...ఏదైనా జరి గితే?"

"ఏమీ జరగదు...ఒకవేళ జరిగినా ఫరవాలే దు. నేను జవాబు చెప్పుకుంటాను" నిశ్చ యంగా అంది ఆమె.

రామారావుకిదేమీ బోధపడటంలేదు.

తనిప్పుదేం చేయాలి...చేద్దామనుకున్నది చేయలేకపోవడమా...కనీసం యిదికూడా చే యలేకపోవడమా...తన నిస్సహాయతను, అస మర్థతను యిప్పుడు కూడా దేవుడు మరోసారి రుజువుపరిచాడు.

ఆ రాత్రి ఎంతకీ నిద్రపట్టలేదు వారికి. ఏవేవో ఆలోచనలు... ఎవరి ఆలోచనలు వారివి. అలాగే తెల్లవారింది.

రామారావు ఆఫీసుకు వెళ్ళిపోయాడు మామూలుగా.

అతను అరుణ కోసం చూస్తున్నాడు. రెండు రోజులు సెలవు పెట్టి సామానులు తీసుకొస్తా నని వెళ్ళింది. ఇంకా రాలేదు. టైము పన్నెండు గంటలు దాటుతోంది...ఏమై వుంటుంది? అంతలో ఎవరో సెలవు చీటీ తెచ్చారు.

కళ్యాణి జీవితం యిలా మోడుబారిపో తుందని ఎప్పుడూ తను అనుకోలేదు. దేవుడు పెద్ద విలన్ నిజంగా...అరుణ తన దగ్గర పనిచేయటం...ఆమెకు తను యిల్లు చూ పించటం...వారింటికి తాను వెళ్ళటం...కళ్యా ణిని యిన్నేళ్ళ తరువాత హటాత్తుగా చూడ టం...ఆమె కథ వినటం...అంతా సినిమా టిక్‌గా జరిగిపోయింది. జీవితం కూడా ఓ పెద్ద కథ కాబోలు.....

ఇప్పుడు అన్నపూర్ణ వూరికెడితే, కళ్యాణి ని-అరుణని వచ్చి కొద్దిరోజులు తన యింట్లో వుండమనాలని ఉద్దేశం...కాని నెరవేరేలా లేదు. రామారావుని ఆలోచనలు తరుముతు న్నాయి.

అన్నపూర్ణ అనుకున్న ప్రకారం కళ్యాణివాళ్ళి ంటికి వెళ్ళింది.

వెళ్ళేసరికి ఆమె బియ్యం ఏరుతోంది. నీడ ఆకారంగా బియ్యం చేటలో పడి మసకగా కనిపించేసరికి- కళ్యాణి తలెత్తి చూసింది. "ఎవరు కావాలి?" అని అడిగింది.

అన్నపూర్ణకు వెంటనే ఏం చెప్పాలో అర్థం కాలేదు. "మాది తాటిపాక. నాపేరు అన్నపూర్ణ. మీరు నాకు తెలుసు. మీ పేరు కళ్యాణి కదూ...మీది నగరం కదా..." అంటూ సర్దుకుని చెప్పింది.

కళ్యాణికి కొంచెం ధైర్యం వచ్చింది. "రండి...లోపలకు" అని లోపలకు ఆహ్వా నించింది.

అన్నపూర్ణ లోపలికి నడిచి, అక్కడున్న కుర్చీలో కూర్చుంది. కళ్యాణి వైపే చూస్తోంది పరీక్షగా. "నన్నెప్పుడూ చూడలేదా..." అని మరోసారి అడిగింది.

"ఏమో... గుర్తులేదు. ప్రస్తుతం నా పరిస్థితి ఏదీ గుర్తుపెట్టుకోనియ్యటంలేదు. ఒకవేళ మీతో అమర్యాదగా మాట్లాడితే దయచేసి క్షమించండి" అంటూ కంటతడి పెట్టుకుంది కళ్యాణి.

"ఇంతకీ ఏమయింది?"

"ఏమీ కాలేదా" అని ఎదురుగా వున్న భర్తఫొటోకేసి చూపించింది. ఆ ఫొటోకు దండ వేసివుంది. ఎలక్ట్రిక్ బల్బు మినుకుమినుకు మంటూ వెలుగుతోంది.

"సారీ" అంది కళ్యాణివైపు చూస్తూ అన్న పూర్ణ

"ఎలా పోయారు?" తనే అడిగింది.

"దేవుడు చావుకి తను కారణంగా వుంచుకో డు. ఆ టైముకి ఏదో ఒకటి ఆలోచిస్తాడు"

"మీకీ వూరు కొత్తనుకుంటాను. ఎందుకు వచ్చినట్టు...మీ వూళ్ళో వుండచ్చుకదా?"

"ఇక్కడ మా అమ్మాయి అరుణ పనిచే స్తోంది. అయినా, సొంతవూరు వున్నా-అంతావు న్నా-ఏమీలేనిదాన్నే. ఎక్కడుంటే అదే మనవూ రు. కష్టంవస్తే కాసేపు ఏడ్చిపోయేవాళ్ళు, కష్టా ల్లో వుంటే మరింత ఏడిపించేవాళ్ళు వున్న

లోకం యిది. ఎవరికీ ఎవరిగురించీ అవసరంలేదు. రోజూ పనిమనిషి టైముకి వచ్చి దాని పని అదిచేసుకుపోతే మనకేమీ తెలియదు. అది టైముకి రాకో, రెండుమూడు రోజులు నాగాపెడితేనో మనకు దాని అవసరం గుర్తొస్తుంది. ఎండల్ని మనం తిట్టుకోము. నీరు లేకపోతే మనిషికి మనుగడే లేదు. కాని వానల్ని మనం చీదరించుకుంటాము. కరెంట్ పోతే కిరసనాయిలు దీపం వెలిగించాలని బద్ధకించి, పోయిన కరెంటుని కసితీరా తిట్టుకుంటాము... అలాగే జీవితం కూడా'' కళ్యాణి వివరంగా చెప్తోంది.

"మీరేం చెప్తున్నారో నాకు అర్థంకావటంలేదు"

"ఫరవాలేదు. ఇది ఏదో మనసుబాగోక వాగిన పిచ్చి వాగుడు ఇంతకీ మీవారు ఎక్కడపనిచేస్తున్నారు?'' ప్రశ్నించింది కళ్యాణి స్తిమితంగా.

అన్నపూర్ణ ఆలోచనలో పడింది ఏం చెప్పాలా అని చివరికి చెప్పింది. పేరుతప్ప.

"మీరు ప్రేమించి పెళ్ళాడారా?'' చటుక్కున అడిగింది అన్నపూర్ణ.

"ప్రేమించటం వరకే ఎవరైనా చేయగలిగింది. ఆ తరువాత ఎన్నో అవరోధాలు ఏర్పడతాయి. పరిస్థితులు కావచ్చు; మనుషులు కావచ్చు- ఇది అదృష్టం దురదృష్టంల మధ్య నడిచే తతంగం''

"అదీ పాయింటే! మీరు ప్రేమించి ఓడిపోయారనిపిస్తోంది. మీరు అంతగా ప్రేమించిన మనిషి మిమ్మల్ని ఎప్పుడైనా కలిసారా మీరు మాట్లాడుకున్నారా— మీ భర్తకు ఆ విషయం తెలుసా ఆయన మీ ప్రేమాయణాన్ని హర్షించారా '' అన్నపూర్ణ ప్రశ్నిస్తోంది.

"మీరేం అడుగుతున్నారో నాకు అర్థం కావటంలేదు'' కళ్యాణి చటుక్కున అడిగింది.

"మీరు ఒంటరికదా ఎప్పుడైనా మీ "మాజీ" గురించి ఆలోచించారా ఇప్పుడు ఆయన మిమ్మల్ని చూస్తే మీరు తట్టుకోగలరా'' అన్నపూర్ణ వీలైనంత లోతుగా విషయ సేకరణ చేయాలని ఉద్దేశపడుతోంది.

కళ్యాణికి ఓవైపు ప్రస్తుత దీనస్థితి మరోవైపు రామారావుతోటి ప్రేమాయణం గుర్తుకొస్తోంది. వ్యక్తిగత విషయాలని మరో స్త్రీకి ఎవరూ చెప్పలేరు. అందులో తను ఒంటరి. తను అతడిని ఊహించగలదేకాని, చెప్పుకోలేదు. నోరుదాటిన విషయాలు ఎంతటి ప్రళయాన్ని సృష్టిస్తాయో తనకు తెలుసు. ఇప్పటి తన జీవితం గురించి ఆలోచిస్తోంది.

అన్నపూర్ణకు ఆత్రంగా ఉంది. కాని కళ్యాణి చెప్పే సాహసం చేయటం లేదు.

"మీరు చాలా బాధలో ఉన్నారు. మీ అమ్మాయి ఆఫీసుకెళ్ళిపోతే, మీకు గతం గుర్తొచ్చి మరింత బెంగను, ఆందోళనని కలిగించవచ్చు. మీకభ్యంతరం లేకపోతే, మీకు నేను మాకాలనీలో ఓ ఇల్లు చూస్తాను... రాగలరా '' అన్నపూర్ణ చటుక్కున అడిగింది. నిజానికి అడగాలనికాదు కళ్యాణి ద్వారా పూర్తి కథను తెలుసుకోవాలని ప్రయత్నం మాత్రమే.

"వద్దులెండి— జీవితంలో మూడొంతుల కాలాన్ని మింగేశాను. ఏదో మా అరుణని కూడా పెళ్ళిచేసి పంపేస్తే నా బాధ్యత, బరువు తీరిపోతుంది. ఈ వయసులో ఇంక నాకు కొత్తగా కావలసిందేమిటి'' కళ్యాణి నిర్లిప్తంగా అంది.

అన్నపూర్ణకు ఓవైపు జాలి మరోవైపు అసూయ కలుగుతోంది. స్త్రీ సహజమైన మనస్తత్వం కావచ్చు తను ఆలోచిస్తోంది, ఎందుకు వచ్చినట్లు ఏం చేయాలని అందువల్ల కలిగే లాభం ఏమిటి భర్తని మరింత ఏడిపించాలనా సాధించాలనా ఈ మనుమలకు ఎదుటి వారి కథలు తెలుసుకోవాలని ఆరాటం— ఎందుకో మరి?

కళ్యాణి కాఫీపెట్టి ఇచ్చింది.

అన్నపూర్ణ గ్లాసు అందుకుంది.

"వెడతాను... మరోసారి కలుద్దాం'' అంటూ లేచింది అన్నపూర్ణ మరో పదినిముషాల తరువాత.

"ఉండండి '' అంటూ అలమార దగ్గరకు నడిచి "ఇలా రండి ఈ అలమారలో కుంకుమ భరిణ ఉంది— బొట్టుపెట్టుకుని వెళ్ళండి'' అంది కళ్యాణి. ఆ మాటలు అంటున్నప్పుడు ఆమె పెదవులు వణికాయి.

అన్నపూర్ణ భరిణ తీసింది.

కళ్యాణి ఆమె నుదుటి వైపు చూసింది. బొట్టు మెరుస్తోంది. ఆడదానికి ఆ బొట్టు ఓ

నిండుదనాన్నిస్తుంది. అది భర్తద్వారా ప్రాప్తించినది కాదు. కాని భర్త మరణంతో దాన్ని తీసేస్తే ఎంత బాధ, ఏడుపు వస్తుందో. ఆచారాలు, సాంప్రదాయం అంటూ ఛాదస్తం చేస్తారు. అటువంటి నరకం ఎవరికీ కలగకూడదు. ఆ సౌభాగ్యం జీవితకాలం నిలిచి ఉండాలి. సుమంగళిగా వెళ్ళిపోవడంకన్నా కావలసిందేమిటి ఎప్పటికైనా ఈపద్ధతి పోతుందా ఎందుకీ పనికిరాని చేష్టలు!

కళ్యాణి ఆలోచనలు ఆగిపోయాయి. కలచెదిరిపోయింది. అన్నపూర్ణ వెళ్ళిపోయింది.

★ ★ ★ ★

ఆ రాత్రి అన్నపూర్ణకు ఎంతకీ నిద్రపట్టలేదు. ఏవో ఆలోచనలు వాటివెంట నడిచే నీడల—నీలినీడలు.

తెల్లవారుఝాము...అయిదుగంటలు కావస్తోంది. రామారావు భార్యని నిద్రలేపాడు- "పాలవ్యాను వచ్చింది...వెళ్ళి పాలపాకెట్టు తీసుకురా" అంటూ.

"మీరు వెళ్ళండి" రోజూలాగే చెప్పింది అన్నపూర్ణ నిర్లక్ష్యకంఠంతో.

"ఈవేళ నువ్వువెళ్ళి తీసుకురా"

అన్నపూర్ణ బయలుదేరింది- 'ఏంమొగుడో...ఏడిపించుకుని తినేస్తున్నాడు...' అనుకుంటూ.

పది నిముషాల తరువాత తిరిగి వచ్చింది తను.

తలుపులు తీసి లోపలకు అడుగుపెట్టిన ఆమెకు రామారావు నేలమీద కొట్టుకుంటున్న దృశ్యం కనిపించింది. నోటి నుంచి నురగలు వస్తున్నాయి.

ఆమెకు భయంవేసింది. అరవబోయింది...రామారావు ఆమె చీర కుచ్చెళ్ళు పట్టి లాగాడు- వద్దన్నట్టు. మంచంమీద వున్న డైరీ వైపు చూపిస్తూ...

డైరీలోనుంచి ఒక కాగితం బయటకు కనిపిస్తోంది. అన్నపూర్ణ ఆ కాగితాన్ని అందుకునేలోపే రామారావు వళ్ళు చల్లబడిపోయింది.

ఆమెకు ఏంచేయాలో తోచలేదు. కామేశ్వరిని లేవబోయింది. కాని ఏదో సిక్త్సెన్సు...ఓ మొండిధైర్యం ఆమెలో ప్రవేశించింది. నీళ్ళు తెచ్చి నోరు కడిగేసింది... గ్లాసులో నీళ్ళు పక్కనే వుంచింది. ఇది ఆత్మహత్యగా ఎవరికీ తెలియకూడదు. ఆ పరాభవం తను భరించలేదు.

అన్నపూర్ణ డైరీలోని ఉత్తరం చదవసాగింది. "అన్నపూర్ణా... నేను నీ జీవితంనుంచి తప్పుకుంటున్నాను- నీకు స్వేచ్ఛ, స్వాతంత్రం కలిగించాలని. నేను నీ దృష్టిలో పనికిరానివాడిని...నిస్సహాయుడిని... అసమర్థుడిని...నీ చేతలకు అడ్డుగా నిలిచే స్పీడుబ్రేకరుని. నీవు ప్రయాణాలు చేయటం, డబ్బు తగలెట్టటం బాగా అలవాటుచేసుకున్నావు. నా మాట వినమని, నన్ను గౌరవించమని, మర్యాదగా చూడమని నేనెప్పుడూ అడగలేదు. పరిస్థితుల్ని మనుమల్ని అర్థంచేసుకోమని మాత్రమే చెప్పాను. డబ్బువిలువ గ్రహించమన్నాను... అంతే!.

ఈ ప్రపంచం ఎలాంటిదో నీకు తెలియలేదు. జీవితం గురించి ఎప్పటికి బోధపడుతుందో మరి...నీకు వయసు పెరిగినా, అనుభవం కలుగుతున్నా ఇంటిని-పిల్లల్ని పట్టించుకోకుండా గొప్పలు, భేషజాలు, మెహర్బానీలకే విలువనిస్తున్నావు. ఈ విషయంలో నేను పూర్తిగా ఓడిపోయాను.

మొగుడు - పెళ్ళాన్ని వేధించి, సాధించి, హింసిస్తే అది పత్రికల్లో వార్త. మొగుణ్ని వెంటనే అరెస్టుచేసి న్యాయస్థానం ముందు నిలబెడతారు. వాడికి శిక్షపడవలసిందే. కాని పెళ్ళాలు మొగుళ్ళని ఏడిపించుకుని తింటే నలుగురూ నవ్వుతారు... నమ్మరు. ఎందుకంటే ఇది పురుషాధిక్య సమాజం. అటువంటి మొగుళ్ళు పెళ్ళాలకు లొంగిపోతారు. పుట్టింటి నుంచి క్యాషూ, వస్తువులు తెస్తుందని...ఇంటిపని, వంటపని, పడకింటిపని కూడా చేస్తే పెడుతుంటారు. వారిలో స్వార్థం, స్వప్రయోజనం, లాభం పీకుతూ వుంటుంది. కాని నేను నిన్ను ఏనాడూ బాధించలేదు. నీ చేతలకు అడ్డుచెప్పలేదు. విసుక్కుంటూనే డబ్బు యిస్తూ వచ్చాను. ఈ దుబారా ఖర్చులు, అనవసరపు ఆర్భాటాలు నన్ను విసిగించాయి. నువ్వింక మారవని... మారలేవని గ్రహించాను, ఇన్నేళ్ళ కాపురంలో.

అందుకే నల్లులమందుతో నా గమ్యం చేరుకోవాలని నిశ్చయించుకున్నాను.

ఇక అప్పగింతల విషయం ఆలోచిస్తే నేను ఎవరికీ బాకీలేను. నాచావువల్ల నీకు ఏమీ

నష్టం కలగదు. ఆఫీసునుంచి ప్రావిడెంటు ఫండు, గ్రాట్యూటీ, ఇన్సూరెన్సు వగైరాల ద్వారా డెబ్భైవేలదాకా వస్తుంది. కామేశ్వరికి ఉద్యోగం యిస్తారు. నీకు నెలనెల పెన్షను వస్తుంది. ఇల్లు కట్టినందుకు ఆఫీసువాళ్ళిచ్చిన అప్పుబాకీ మినహాయించుకుంటారేమో...

నీవంటి మీదున్న బంగారం అమ్మేస్తావో...ఎవరికైనా యిస్తావో నీయిష్టం. నీకు చేతినిండా పుష్కలంగా డబ్బు వుంటుంది. ఉత్తరం రావడం తరువాయి, పెట్టె సర్దవచ్చు. పిలవడం ఆలస్యం—ప్రయాణం అవ్వచ్చు. వచ్చేపోయేవారితో కబుర్లు చెప్పుకోవచ్చు... ఎవరూ ఆవరు. కామేశ్వరికూడా నీనోటికి భయపడుతుంది. చచ్చేవాడీ సోది ఏమిటాని అనుకుంటున్నావా...

ఈ శవాన్ని కాల్చేందుకు అనవసరపు ఖర్చుచేయకు. ఎవరేం చెప్పినా చేయకు. బతికినపుడు మనిషిని మనిషిగా చూడగలిగే సంస్కారం వుంటే చాలు...శ్రాద్ధకర్మలు, దానాలు, శిలావిగ్రహాలు, వీధులకి సందులకి పేర్లు పెట్టటం అనవసరం.

ఇతరులని నమ్మేముందు కొంచెం ఆలోచించు.

సెలవు రామారావు."

అన్నపూర్ణ ఉత్తరం దాచిపెట్టి, కామేశ్వరిని లేపింది. ఏడుపులు యథావిధిగా సాగిపోయాయి. ఆ తర్వాత ఫోన్లు, ట్రంకాల్స్, టెలిగ్రాములు వెళ్ళిపోయాయి.

-రామారావు శరీరం సాయంత్రం అయిదు గంటలకు బూడిదయిపోయింది.

నాలుగునెలల తరువాత కామేశ్వరికి ప్రభుత్వం ఉద్యోగం యిచ్చింది. ఆఫీసునుంచి రావలసిన సొమ్ము ఎనభైవేలదాకా అందగానే చిల్లరమల్లర బాకీలు తీర్చేసింది అన్నపూర్ణ.

"పూర్ణా... నువ్వు ఏమీఅనుకోకపోతే నాదోసలహా... మీ అన్నయ్య యీ ప్రయత్నాలన్నీ దగ్గరుండి చేసాడు. వాడిప్పుడు ఆర్థికబాధల్లో వున్నాడు. వాడికి పాతిక ముప్ఫయ్ వేలు సర్దేవంటే - రేపు కామేశ్వరిని వాడి కొడుక్కిచ్చి పెళ్ళి చేసేప్పుడు కట్నకానుకల్లో చూసుకోవచ్చు. దాన్ని పైవాడికి యిస్తే - అల్లుడు సరిగా చూస్తాడో చూడడో... కాబట్టి యీ సంబంధం ద్వారా మీరిద్దరూ వియ్యం అందుకుంటే బాగుంటుంది" ఓరోజు అచ్యుతరామయ్య అసలు విషయం ప్రస్తావించాడు.

"మావాడికి సైకిలు కొనాలనుకుంటున్నాను. బావగారి సైకిలు నాకిచ్చేయి... ఎటూ మీకు ఉపయోగపడదుకదా..." అని ఓ అన్నయ్య అన్నాడు.

"కొంపనిండా యిన్ని సామానులు దేనికి... కొన్ని అమ్మేసి డబ్బు చేసుకుంటే మంచిది. రోజులు బాగోలేవు" అని కూడా అన్నాడు, అచ్యుతరామయ్య.

అన్నపూర్ణకు ఆశ్చర్యంగావుంది.

ఇలా తండ్రి, అన్నయ్యలు డబ్బుకోసం తన చుట్టూ తిరుగుతున్నారేమిటి? మిగతా బంధువులుకూడా చూడటానికి వచ్చి పదిహేను ఇరవైరోజులు తిష్టవేసి తినిపోతున్నారు. ఖజానా ఖాళీ అవుతోంది.

అప్పుడు అక్కకి ఇదే పరిస్థితి... కాబోలు...

ఇప్పుడు తనకీ పరిస్థితి. కళ్యాణికి కూడా యిలాగే...

ఆమెకు భయంగావుంది... తన బతుకు ఏమవుతుందోనని.

ఆక్షణంలో భర్తగుర్తుకొచ్చాడు. అతని మాటలు గుర్తొచ్చాయి. తన ఈసడింపు, నిర్లక్ష్యం, పొగరు గుర్తుకు రాసాగాయి. ఈ ప్రపంచం డబ్బుచుట్టూ నడుస్తోంది. మనుషుల నైతికంగా దిగజారిపోయారు.

ఎందుకీ దౌర్భాగ్యం... ఏమిటీ కాలం...

అన్నపూర్ణకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. ఛీ ఛీ... ఏమిటీ పీడకల.. లేచి మంచినీళ్ళు తాగింది. ఆపైన మంగళసూత్రాలు తీసి కళ్ళకద్దుకుంది... "ఇది కలగానే మిగిలిపోవాలి" అనుకుంది తను.

* * *

అరుణ రామారావుకు ఒక కథ ఇచ్చి చదువమంది. రామారావు చదవటం ప్రారంభించాడు.

బస్సు వచ్చేందుకింకా పావుగంటసైముంది. అప్పటికే బస్టాండు ప్రయాణికులతో కిటకిటలాడిపోతోంది. బస్సు ఖాళీగావస్తే యీ జనంఅంతా ఎక్కినా నిలబడి ప్రయాణం చేయవచ్చు. లేకపోతేనే యిబ్బంది.

సిగరెట్టులోని చివరిదమ్ముని గట్టిగా లాగి, గుండెలనిండా నింపుకుని, ముక్కురంధ్రాల ద్వారా పొగవదిలాడు సుందరం. ఎదురుగా మిర్చిబండి కనిపిస్తే అటు వెళ్ళాడు.

అయిదునిముషాల్లోనే బస్సొచ్చింది.

సుందరం తలనిండా ఎన్నో ఆలోచనలు– పరిష్కారం దొరకనివి; దొరికినా నిరుపయోగ మైనవీను. అయినా ఆలోచించకతప్పదు. అప్పటికి రెండుమూడు నెలలనుంచీ తాననుకున్నవని చేసేందుకు ఓ నిర్ణయం తీసుకున్నాడు. ప్రస్తుతం ఆనిర్ణయం అమలుకే యీ ఆరాటం, తాపత్రయం.

సుందరం బస్సులో కూర్చున్నాడు. ఆ బస్సు పుష్పకవిమానంలా తోచింది. కండక్టరు పాసెంజర్లనందరినీ ఎక్కించాడు. అతన్ని మనసులోనే అభినందించేడు సుందరం.

బస్సు బయలుదేరింది.

అతను ఆలోచిస్తున్నాడు. బస్సు చేరేసరికి ఎంతలేదన్నా తొమ్మిదిగంటలు కావచ్చు. ఇంటికెళ్ళేసరికి మరో అరగంట. అప్పటికి చెల్లెలు నిద్రపోవచ్చు. తానొస్తానని తల్లి మెలకువగావుండచ్చు. ఆసమయంలో తన నిర్ణయం చెప్తే గొడవ అవుతుంది. అలా అని ప్రస్తావించకుండా ఉండటమా... తనకు నిద్ర పడుతుందా...

అనుకున్నట్టుగానే బస్సు తొమ్మిదిగంటలకు చేరింది. ఎయిర్‌బ్యాగు భుజానికి తగిలించుకుని దిగాడు సుందరం.

"మీనాన్న పోతేపోయాడుగాని, మంచి పైముచూసి బండెక్కాడు. అప్పులుపోగా ఎంతలేదన్నా అరవై డెబ్బైవేలన్నా మిగులుతాయటకదా... హాయిగా ఆడబ్బుని బ్యాంకులో వేసుకుంటే వచ్చేవడ్డీతో బతకచ్చు మిగిలిన యిద్దరూ అటువంటి తండ్రి చాతకానివాడెలా అవుతాడు. సుందరం నువ్వు చాలా అదృష్టవంతుడివోయ్..." ఎంతోమంది సుందరంని అభినందించారు.

కాని జరిగింది ఏమిటి!

సుందరం తలుపు తట్టాడు.

శారదమ్మ గడియతీసింది. కొడుకుని చూడగానే ఆవిడకు గుండెదడ పెరిగింది. కాళ్ళు చేతులు వణకసాగాయి. "ఒక్కడివే వచ్చావేం... మీ ఆవిడను కూడా తీసుకురాకపోయావా?" అంటూ పలకరించింది.

"నేను రావటమే దండగ. ఇక తనుకూడా వచ్చి బాధపడాలా..." అంటూ లోపలకొచ్చాడు సుందరం.

శారదమ్మ జవాబు చెప్పలేదు.

"నీకు కొడుకు అక్కర్లేదు. ఊళ్ళోవాళ్ళు కావాలి. ఇంటి విషయాలు నాకంటే ముందుగా వారికే తెలుసున్నాయి. వాళ్ళు అంతకావలసినవాళ్ళయితే వాళ్ళతోనే ఉండవచ్చు- ఇక్కడదేనికి" తీవ్రంగా అన్నాడు సుందరం.

శారదమ్మ నోట్లో గచ్చకాయపడింది. "నీ భార్య పిల్లలు కులాసాయేనా?" అంటూ విషయం తప్పించే ప్రయత్నం చేసింది.

"అడిగినదానికి జవాబు చెప్పకుండా. ఈ సోదెందుకు... ఇంతకీ అప్పులు తీర్చగా ఏమాత్రం మిగిలింది డబ్బు... అన్నింటికీ లెక్కలు రాసేవా..."

శారదమ్మకేంచెప్పాలో తోచలేదు. "అవన్నీ ఇప్పుడెందుకూ... తెల్లారేక తీరుబడిగా చూడచ్చుకదా..." అని మాత్రం అంది.

"అనవసరంగా సొల్లుకబుర్లు చెప్పదు. ముందు ఆ కాగితాలు తీసుకురా... ఇంతకీ మీనాన్న ఈవారంలో దిగబడ్డాడా మళ్ళీ..."

"వచ్చాడాయన- ఆ మండపేట సంబంధం గురించి చెప్పేందుకు... మీ తాతయ్యద్వారా, పావవాళ్ళే కబురుచేశారు... నీ చెల్లెలును వాళ్ళకోడలుగా చేసుకోవాలనుందిట... అందుకే మా నాన్న వచ్చాడు" అంటూ చెప్పింది శారదమ్మ.

"మీ నాన్నకేమీ పనిలేదేమో, వారానికోసారి ఇక్కడకు దయ చేస్తుంటాడు... ఇంతకీ ఎన్ని పూటలు తిష్టవేశాడాయన" అని అడిగాడు సుందరం ఏదో ఆలోచిస్తూ.

"మొన్న లాయరు నోటీసు వచ్చింది. మీ నాన్న ఈ ఇంటిని ఎక్కడో తాకట్టుపెట్టి ఇరవైవేలు తెచ్చారుట... వడ్డీతో కలిపి ముప్ఫయ్ వేలయిందిట... వెంటనే చెల్లించమని నోటీసు... మీ తాతయ్య వెళ్ళి మాట్లాడి వడ్డీలేకుండా ఇరవైవేలు ఇచ్చేందుకు సర్దుబాటు చేసి వచ్చాడు. ఆ బాకీముందు తీర్చాలి..." శారదమ్మ చెప్పింది.

"వ్యాపారస్తుడికి డబ్బు సంపాదనేకానీ మంచిమానవత్వంమీద దృష్టినిలవదు. మీనాన్న వెళ్ళి మన పరిస్థితి చెప్పగానే కరిగిపోయాడా ఆ వ్యాపారి... మీ నాన్న ఏదో ప్లాను వేసాడు'' అంటూ సవ్వేసాడు సుందరం.

"మా నాన్నకు అంతఖర్మ ఏమీపట్టలేదు. మీ నాన్న పోయేక ఇంతవరకూ ఆదుకున్నది మా నాన్న అంటే మీ తాతయ్య. నోటికొచ్చినట్లు మాట్లాడకు''

"అవును. నిజమే- అందుకే మీ నాన్న నాచేత ముందుగానే పదిహేనువేలకు నోటు రాయించుకుని నాన్న చచ్చినప్పట్నించీ అయిన ఖర్చులు చేస్తూ వచ్చాడు. బతికివున్న కుమార్తెమీదా, పోయిన అల్లుడిమీదా అంత నమ్మకం, ప్రేమ ఉన్నవాడు ఇలా చేస్తాడా. డబ్బుదగ్గర బంధుత్వం, చుట్టరికం, రక్త సంబంధం ఏమిటి... అందులో మీనాన్న అన్నయ్యల గురించి అమెరికా ప్రెసిడెంటు కూడా తెలును...''

"ఆమధ్య ఇంజినీరుగారి భార్య కూడా వచ్చి అడిగింది. మీనాన్న ఎప్పుడో పదేళ్ళ క్రితం ఆవిడదగ్గర ఆరువేలు తీసుకున్నాడుట. ఆ డబ్బుకోసం నాలుగైదుసార్లు వచ్చిందావిడ'' మాటలమధ్యలో ప్రస్తావించింది శారదమ్మ.

"ఎంతసేపూ వాళ్ళొచ్చారు, వీళ్ళొచ్చారు అంటావుకాని నాన్నకు ఇవ్వాల్సిన వారిగురించి చెప్పవేం... అసలు నాన్న ఎందుకిలా అప్పులు చేసాడు... ఆ డబ్బంతా ఏంచేసాడు...'' నిలదీసి అడిగాడు సుందరం.

"ఏమీ తెలియనట్లు అడుగుతావేం... నీకు తెలీదా... నువ్వెళ్ళి మీ ఊళ్ళో కూర్చుంటావు... వారానికోసారి వస్తావు. అందరూ వచ్చి నన్ను అడుగుతున్నారు. నేనేం చెప్పాలి వారికి... మీనాన్న అప్పులుచేసి నీ బాబయ్యలను మేపారు... వారి కుటుంబాలను పైకి తీసుకువచ్చారు... మనకు చిప్పమిగిల్చారు...'' నిశ్చయంగా అందావిడ.

"నోర్ముయ్... ఎంతసేపూ బాబయ్యలకి ఇచ్చేడంటావు... నువ్వుచేసే దిక్కుమాలిన ఖర్చుల గురించి మాట్లాడవు... అనవసరపు ప్రయాణాలు, గొప్పలకోసం చేసేపనులు చెప్పవ్... మా బాబయ్యలనుచూసి ఎందుకు ఏడుస్తావు... వాళ్ళేం చేశారని...'' సుందరం గద్దించాడు.

"ఎవరెవరికి ఏంచేశారో అందరికీ తెలిసిందే... మధ్యలో నువ్వు నేను ఘర్షణపడటం ఏమిటి... అన్నట్టు మరిచిపోయాను, మీ పెద్దమ్మక్కూడా నువ్వు వెయ్యిరూపాయలు ఇవ్వాలిటకదా... ఉత్తరం రాసింది తను... అయినా, అయిదేళ్ళయి నీకు ఉద్యోగం వచ్చినా ఆ బాకీ ఇవ్వకపోతే ఏంబాగుంటుంది... వాళ్ళింట్లో ఉండి, ట్రైనింగ్ అయి, వారి పుణ్యమా అని ఉద్యోగస్తుడివయ్యావు. ఆ మాత్రం కృతజ్ఞత ఉండద్దూ...''

"నోర్ముయ్... నేనెవరిదగ్గరా అప్పుచేయలేదు. ఎవరికీ సత్తుపావలా కూడా ఇవ్వక్కర్లేదు. నువ్వు చెప్పిన పెద్దమ్మను, ఇంజినీరుగారిభార్యను జాయింటుగా పైకివెళ్ళి నాన్ననే అడగమను. అంతేగాని మరోసారి ఈ అప్పుల గురించి నాతో చెప్పద్దు''.

"ఏం మాటలివి... డబ్బుతీసుకుని- వాళ్ళని వెళ్ళి మీనాన్నని అడగమంటావా? అంటే వాళ్ళు కూడా చావాలా'' కోపంగా అంది శారదమ్మ.

"నన్ను అనవసరంగా విసిగించకు. నీకింకా పుట్టింటిమీద ఆ మమకారం, మోజుపోలేదంటే అది నాన్న దురదృష్టం. అసలు నీతో నాన్న ముప్పయేళ్ళు కాపురం చేయడమే నీ అదృష్టం. నీమీద జాలితలచి నిన్నుకోరి పెళ్ళి చేసుకున్నందుకు మొగుడికి మంచి దారే చూపించావు. నీలాంటి ఇల్లాళ్ళు ఏంచేసినా అవి బజారుకెక్కవు- ఏంచేస్తాం... అది మగవారి బలహీనత. అందుకే యీ రోజుల్లో చాలా మంది వివాహాలు చేసుకోవటంలేదు- ఈ మాత్రం స్వేచ్ఛ, స్వాతంత్ర్యంపోతాయన్న భయంతో'' అంటూ వీధి అరుగుమీదకెళ్ళిపోయాడు సుందరం- సిగరెట్టు కాల్చేందుకు.

పది నిముషాలు నిశ్శబ్దం.

సుందరం చెల్లెలు కామేశ్వరి యిదంతా వింటూనే వుంది. తల్లి, అన్నయ్యలమధ్య జరుగుతున్న సంభాషణ ఆమెను నిద్రపోనివ్వటంలేదు. "ఏమిటమ్మా... తెల్లారదా... ఇప్పుడు

ఆమె.

అంతలో లోపలకొచ్చాడు సుందరం. "ఓహో... రాణీగారికి నిద్రాభంగం అయిందికాబోలు. అవునులే... ఉద్యోగస్తురాలివి కదూ... పైగా కాబోయే పెళ్ళికూతురివి. అందులో మండపేట భూలోకసత్తెమ్మకి కోడలివి కాబోతున్నదానివి... ఆరునెలల ఉద్యోగ అనుభవంలోనే యింత సమయస్ఫూర్తి, తెలివి, మాటకారితనం, స్వతంత్రం, స్వేచ్ఛ పొందావా... నీకు యింత త్వరగా ఉద్యోగం రావటానికి కారణం కేవలం నేను... అంతేగాని మీ తాతయ్యా మామయ్యలు కారు" అని విరుచుకువడ్డాడు.

కాముడు మంచం దిగింది. "అవున్రా అన్నయ్యా... ఈ యింట్లో నువ్వేకదా మగాడివి... పైగా అన్నగారివి... ఈ ఆస్తికి ఏకైక వారసుడివి. అమ్మని, నాన్నని నువ్వు ఎంత ఏడిపించినా అది నీ స్వంతం, వ్యక్తిత్వం. ఇప్పుడు నువు చేయకపోతే ఎవరు చేస్తారు... ఎందుకు చేస్తారు?" నొప్పించకుండా బుజ్జగిస్తున్న ధోరణిలో అంది ఆమె.

సుందరం తల్లితో అన్నాడు వెంటనే-"చూసావా- నీ కూతురికెంత మాటకారితనం అబ్బిందో... కర్రవిరగకుండా, పాముని ఎలా చంపుతుందో. దీన్ని తీసుకెళ్ళి ఆ భూలోకసత్తెమ్మకు అప్పగిస్తే - అత్తగారిచేత అంట్లుతోమించి, పేడపిసికించి పిడకలు చేయిస్తుంది. తనే అత్తగారిలా ప్రవర్తిస్తుంది. ఇక ఆ మొగుడిచేత బియ్యం ఏరించి, వక్కబట్టలు ఉతికిస్తుంది, వంటచేయిస్తుంది"

కాముడు కల్పించుకుంది-"ఏం తప్పా... మొగాడైనంత మాత్రాన ఏపనీ చేయకుండా పెత్తనం సాగించాలా? అత్తగారు అయితే అధికారం చెలాయించాలా? అసలు నేను ఉద్యోగం చేస్తున్నాననేకదా, ఆభూలోకసత్తెమ్మ నన్ను కోడల్ని కావాలనుకుంటున్నది... పైగా నలభైవేలు కట్నం... లాంఛనాలకు మరో అయిదువేలు.."
అంటూ.

"అయితే కథ చాలా దూరమే వచ్చిందన్నమాట... కొంపలో ఆడపెత్తనం బాగానే ఉందన్నమాట... తల్లీకూతుళ్ళు బాగానే నడిపిస్తున్నారు- నాకేం చెప్పకుండానే. ఇంతకీ ఆ భూలోకసత్తెమ్మ కొడుకు కలెక్టర్రా, కలెక్టరాఫీసులో అటెండరా... నగరంలో ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం... ఈ కాముడు దొరసాని యిక్కడ... ఆ దొరగారు అక్కడ... ఏమిటీ హడావిడి, తొందర... ఈ చుట్టుపక్కల గవర్నమెంటు ఉద్యోగస్తులే లేరా" అన్నాడు సుందరం.

"నన్ను పెద్దమ్మ హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ చేయిస్తుందిట" కాముడు అంది వెంటనే.

"అయితే ఈ విషయం అక్కడికీ చేరిందన్నమాట... ట్రాన్స్‌ఫర్ అంతతేలిగ్గా వస్తుందా... అంత తేలిగ్గా ట్రాన్స్‌ఫర్లు వస్తే యిక చెప్పేదేమిటి..."

శారదమ్మ అంది " మీ తాతయ్య ఈ సంబంధం గురించి మాట్లాడేందుకు మండపేట వెళ్ళాడు. బహుశా వచ్చే ఆదివారం పెళ్ళిచూపులు జరగచ్చు. అపుడు మీ ఆవిడని కూడా తీసుకురా... మీనాన్న సంవత్సరికాల లోపల వివాహం చేయాలని ఉద్దేశం. ఇది మంచిసంబంధం... కుర్రాడు మంచివాడు, యోగ్యుడు, బుద్ధిమంతుడు, స్థితిపరుడు, పైగా రెండులక్షల ఆస్తివుంది"

"నాగురించి కూడా మా మావగారికి యిలాగే చెప్పారుట చాలామంది. వ్యాపారస్తుడు తన వస్తువు అమ్మకం గురించి ఎంతోగొప్పగా, నమ్మకంగా చెప్తాడు. అది వ్యాపారలక్షణం. అలాగే వరులవిషయంలోనూ... ఇప్పుడు నాభార్య ఏడుస్తోంది- యిటువంటి మొగుడిని కట్టుకున్నందుకు. నన్ను వదలిపోయేందుకు ధైర్యం లేదు - ఉద్యోగం లేదుకాబట్టి... తల్లి, తండ్రి, అన్నయ్యలు ముఖంమీద ఉమ్మేస్తారు- మొగుడిని వదిలి వచ్చినందుకు" అన్నాడు సుందరం.

"ఏమైనా యిది మంచి సంబంధం... దగ్గరదీను" అంది శారదమ్మ.

"అవున్లే... నాన్న పోయాడు కాబట్టి తేరగా, అప్పనంగా డబ్బు వచ్చిపడిందని భూలోకసత్తెమ్మతో వియ్యం అందుకుంటున్నావు. ఈ అప్పులు ఎలాగో తీర్చినా, పెళ్ళిలాగ చేయటం... ఇక నాకు మిగిలేది ఏమిటి... కొడుకుగా పుట్టినందుకు నాకు ఒరిగేది, లాభించేది ఏమిటంట... అయినా యీ నిర్ణయాలు, స్వతంత్రం ఎవరిచ్చారు. ఏమిటీ అధికారం... ఇదంతా నడిపిస్తున్నవాళ్ళెవరు" చికాగ్గా అన్నాడు సుందరం.

కాముడు, శారదమ్మ మాట్లాడలేదు.

సుందరంతో వ్యవహారం ముళ్ళమీద పడ్డ గుడ్డవంటిదని, అరిటాకు- ముల్లువంటి బంధం అని వారికి తెలుసు.

"అందుకే నేనూ ఓ నిర్ణయానికి వచ్చాను" అన్నాడతను.

"ఏమిటి?" తల్లీకూతుళ్ళు ఒకేసారి అడిగారు.

"ఇప్పుడే చెప్పాలా... తెల్లారదా..." అంటూ మంచం ఎక్కాడు సుందరం - భోజనం చేయమని శారదమ్మ చెప్తున్నా వినిపించుకోకుండా.



. తెల్లవారేందుకింకా గంటన్నైముంది. రాత్రంతా ఆలోచిస్తూనే వున్నాడు సుందరం. అసహనంగా పక్కమీద దొర్లుతూనే ఆలోచించాడు. అతనికి తండ్రిమీద కోపంవచ్చింది. తన తండ్రి ఎటూ చచ్చేందుకు నిర్ణయించుకున్నాడన్న విషయం - మాటలనుబట్టి, ప్రవర్తనబట్టి తెలుసుకున్నాడు తను. మరో మూడేళ్ళుపోయాక చస్తే - పూర్తి పెన్షన్ వచ్చేది. ఫలితంగా పెన్షనులో కొంతభాగం అమ్మకోడంతో పాతిక ముప్పయ్ వేలదాకా అదనపు ఆదాయం వచ్చేది. ఇప్పుడు కేవలం లక్షాపాతికవేలు మాత్రమే వచ్చింది. ఇందులో చాలా సొమ్ము రోగాలకు, మందులకు, డాక్టరు ఫీజులకు, అప్పులకు సరిపోయింది. ఇక తనకేం మిగిలిందని! సుందరంకు సర్కిల్ ఆఫీసులో పని చేసిన సౌజన్యరావు గుర్తొచ్చాడు. ఆయన రిటైరయిన ఏడాదికి బండెక్కాడు. హాయిగా గ్రాట్యుటీ, ఇన్సూరెన్సూ, పెన్షను సొమ్ము- లక్షా అరవైవేలదాకా కళ్ళచూసాడాయన. [illegible] ఆయనది. [illegible] అదృష్ట[illegible] సిమరి [illegible] ఒకటి [illegible]

[illegible]

ఆలోచించరేమో...

"పేపర్" అంటూ పేపరుబోయ్ అరిచాడు. సుందరం తలుపు తీసి బయటకు [illegible]. లోపలకువస్తూ "పేపరు తెప్పిస్తున్నావు... అంత తీరిక మీకెక్కడిది... ఇకపైన పేపరు వద్దు అని చెప్పండి..." అన్నాడు తల్లితో.

శారదమ్మ కాముడుని నిద్రలేపింది.

ఆవిడ గ్రాట్యుటీ, పెన్షను, ప్రావిడెంటు ఫండు, ఇన్సూరెన్సులకు చెందిన కాగితాలు సుందరంకు యిచ్చింది.

సుందరం కాగితాలు చూస్తుంటే ఏవో ఆలోచనలు... ఎంతడబ్బు! ఇదంతా తనకేదక్కితే ఎంత బాగుంటుంది... అతనికి ఎదురుగా గోడకున్న తండ్రి ఫొటోగుర్తుకొచ్చింది. "చూడు నాన్నా... ఇదంతా నువ్వు మిగిల్చినడబ్బే... కాని నన్ను వారసుడిని చేయలేదు నువ్వు. ఇందులో దాదాపు ఇరవైవేలదాకా అమ్మఖర్చు చేసింది నీ చావు నిమిత్తం. మనిషి చావుకంతఖర్చా... దానికితోడు దానాలు, ధర్మాలు, మాసికాలు, తద్దినాలు. సౌజన్యరావుపాటైనా ఆలోచించలేకపోయావా... నాకు నువ్వు మిగిల్చిందేమిటి... నాపిల్లలకు ఏమి యివ్వమంటావు [illegible] వులు, పెంపకం ఎలా... [illegible] పెళ్ళికి ఎంతలేదన్నా [illegible] ట్టుంది..."

శారదమ్మ, [illegible] సుందరం ఏ నిర్ణయ[illegible] అప్పులతో తన[illegible] వచ్చినడబ్బు [illegible] తీర్చాలి... కాముడు [illegible] తరువాత తమ[illegible]

టైము ఎనిమిది [illegible]

ఇంటిముందు [illegible] రావు స్కూటరుకి స్టాండువేసి [illegible] సుందరం అతడినే చూస్తున్నాడు- [illegible] రిచితుడాని. "ఎవరుకావాలి?" [illegible] న్న ప్రసాదరావుని ప్రశ్నించాడు సుందరం.

"ఈయిల్లు అమ్ముతున్నట్లుగా తెలిసింది" అన్నాడు అతను.

సుందరం ఆశ్చర్యపోయాడు. తన మనను [illegible] యితరులకు ఎలా తెలిసిందాని

"ఎవరు చెప్పారు?" అని అడిగాడు వెంటనే.

"సౌజన్యరావుగారి కొడుకు నా ఫ్రెండు- అతనే చెప్పాడు. సౌజన్యరావుగారితో మీ ఫాదరు చెప్పేవారట తరచు ఇంటి అమ్మకం గురించి" ప్రసాదరావు చెప్తున్నాడు.

"మీదేవూరు... ఎక్కడ పనిచేస్తున్నారు?"

అన్నింటికీ జవాబు చెప్పాడు ప్రసాదరావు.

"మా ఫాదరుని మీరెప్పుడైనా చూసారా... తెలుసా?"

"అంతబాగా తెలీదుగాని, ముఖపరిచయం వుంది"

అంతలో కాముడు ముందరిగదిలోకొచ్చింది- "ఆయన్ను లోపలకు రమ్మనమని చెప్పు" అంటూ.

శారదమ్మకు కొడుకు ధోరణి అర్థంకావటంలేదు. ఆవిడ సుందరంని లోపలకు పిలిచి అడిగింది- "ఇప్పుడు ఇల్లు అమ్మవలసిన అవసరం ఏమిటి? నువ్వు ఎవరితోనైనా చెప్పావా... లేకపోతే ఆయన ఎందుకు వస్తాడు?" అని.

"నా ఇష్టం... నాఇల్లు... నాకు డబ్బుకావాలి. నీ కూతురికి పెళ్ళిచేసేసరికే బోలెడు డబ్బు ఖర్చు అవుతుంది. అది హైదరాబాదు వెళ్ళిపోతుంది... నువ్వెళ్ళి మీ బాబు దగ్గరుండు. చెట్టంత నాన్నేపోయాక— ఇక ఈ ఇల్లు మాత్రం దేనికి... నేను కాకినాడలోనో, వైజాగ్ లోనో ఇంటిజాగా కొనుక్కుంటాను... ఈ ఊరితో నాకు రుణం తీరిపోయింది. ఈ విషయంలో నువ్వు అనవసరంగా కల్పించుకోకు" అన్నాడు సుందరం. ఆ తరువాత అతను ప్రసాదరావు కూర్చున్న గదిలోకివచ్చి కూర్చున్నాడు.

"ఇల్లు చూస్తారా?" అడిగాడు సుందరం.

"చూడాలికదా..." అన్నాడు ప్రసాదరావు.

సుందరం ఇల్లు చూపించసాగాడు- "మూడొందల గజాలస్థలం... ఆరుగదులు... బోరింగు... ఎటాచ్‌డ్ బాత్ అండ్ లావెట్రీలు... మూడొందలఏభై అద్దె వస్తుంది. బస్టాండుకు దగ్గర... సినిమాహాళ్ళకు, బజారుకు దగ్గర..." అంటూ.

"ఎంత చెప్తున్నారు?" అని ప్రశ్నించాడు ప్రసాదరావు.

"రెండులక్షలు" చెప్పాడు సుందరం.

ప్రసాదరావు ఆలోచిస్తున్నాడు. ధర ఎక్కువే. తనకా ఇల్లు నచ్చింది. తూర్పుముఖం... అందమైన తులసికోటవుంది. రెండు కొబ్బరిచెట్లు... ఓ మామిడిచెట్టు... రెండు జామచెట్లున్నాయి... తన తండ్రి ఈ స్థలంకోసం ప్రయత్నించినట్లు, మూడువేలదగ్గర బేరం కుదరలేదని సౌజన్యరావు అంటూ ఉండేవాడట కొడుకుతో. ఆ విషయం చెప్పాకే ఆ ఇంటిమీద తనకు మోజు పెరిగింది. తనకు ఆఫీసునుంచి ఎనభై వేలదాకా అప్పు లభిస్తుంది. కాని మిగిలింది ఎల్లాగ...

"మరోమాట ఉందా?" ప్రశ్నించాడు ప్రసాదరావు.

"ఇది కూరలబేరంకాదండీ... ఒకటేధర- ఇష్టంవుంటె కొనండి... లేదంటే దయచేయండి" మొండిగా చెప్పాడు సుందరం.

"మీ అమ్మగారితో సంప్రదించి చూడండి"

"నేను ఈ ఇంటికి యజమానిని. నేనే మగాడిని. ఇక్కడ ఆడపెత్తనం కారణంగానే ఈ ఇంటి యజమాని మట్టిలో కలిసిపోయాడు. కాబట్టి ఎవరినో అడగవలసిన అవసరం, అగత్యంలేదు"

ప్రసాదరావుకు నవ్వు వచ్చింది- "ప్రపంచంలో మనం దేనినయినా కొనచ్చు... పొందచ్చు... సంపాదించవచ్చు. కాని మన జన్మకారకులను మాత్రం ఏ విధంగానూ తిరిగి పొందలేము— వాళ్ళెటువంటివారైనా... ఎలా ఉన్నా... మనం మన కన్నవాళ్ళని నిందిస్తే మన పిల్లలు మనల్ని సాధించకపోరు... అవు చేలోమేస్తే దూడ గట్టున మేస్తుందాన్న సామెత మీకు తెలసనుకుంటాను" అని.

"నాకు ఈ మెట్టవేదాంతంమీద నమ్మకంలేదు. మనిషి చచ్చేక మిగిలేది బూడిద. ఆ బూడిదను, అస్తికలను గంగలోనో, గోదాట్లోనో కలిపి ఆత్మవంచన చేసుకోడం బాగోదు. చచ్చినవారిని బతికినంతకాలం తిట్టిపోసి— చచ్చేక ఫోటోలో బంధించి అగరబత్తీ వెలిగించటం కేవలం నటన... ఇది అర్థం పర్థంలేని మూఢనమ్మకాలు... కాలంచెల్లిన సాంప్రదాయాలు..." అన్నాడు సుందరం.

"కాని ఏ కొందరో ఇలా నిందించినా, విమర్శించినా, కొట్టిపారేసినా పోయేవికాదుకదా... తరతరాలనుంచీ, యుగాలనుంచీ వస్తున్న

వద్ధతి... కాబట్టి మీ అమ్మగారిని ఓసారి పిలవండి'' అన్నాడు ప్రసాదరావు.

కాముడు శారదమ్మను తీసుకొచ్చింది.

ప్రసాదరావు ఆమెను అడిగి చూశాడు.

శారదమ్మ నిస్సహాయురాలిగా చూసింది.

ప్రసాదరావుకి విషయం బోధపడింది.

ప్రస్తుతం ఎనభైవేలు ఇస్తాను... మిగిలినసొమ్ము నాలుగు నెలల్లో ఇస్తాను. రేపు అగ్రిమెంటు రాసుకుందాం... ప్రస్తుతానికి ఈ పదివేలు ఉంచండి, రేపు డెబ్బైవేలు తెచ్చి ఇస్తాను'' అన్నాడు ప్రసాదరావు.

సుందరంకు స్వగతంలో సంతోషంగా వుంది. ఇంత డబ్బు తాను ఎటూ సంపాదించలేడు, చూడనూలేడు. ఈ ఇంటికి లక్షరూపాయలు రావటం గగనం... అటువంటిది ఈ పిచ్చోడు ఇట్టే బుట్టలోపడిపోయాడు. ఎదుటివారి అవసరాన్ని అవకాశంగా భావించి కామ పొందటమే నేటి సమాజంలోవున్న న్యాయం... నీతి... ధర్మం...

ప్రసాదరావు బయటకు నడిచాడు. స్కూటరు స్టార్టు చేయబోయాడు. కాని అది కదలటంలేదు. కిక్‌కొడుతూనే ఉన్నాడు. సుందరం అయిదారు కిక్‌లుకొట్టి ఇక తనవల్లకాక వెళ్ళిపోయాడు.

శారదమ్మ కాముడిద్వారా ప్రసాదరావుని లోపలకు తిరిగి పిలిపించింది. అతను వచ్చి కూర్చున్నాడు.

''ఈ చుట్టుపక్కల ఇంకా చాలా ఇళ్ళు అమ్మకానికి ఉన్నాయి. ఇదే కావాలా?'' అంది శారదమ్మ కళ్ళు తుడుచుకుంటూ.

ప్రసాదరావుకి విషయం బోధపడింది. ''ఈ సమాజం డబ్బునీడలో, మనిషి పెంచుకునే నాగరికత- భేషజం చాటున పెరుగుతోంది. మనం తిన్నాతినకపోయినా ఉండేందుకు ఓ నీడ కావాలి... నా తండ్రి దిక్కులేనిచావుకి బలయిపోయాడు. ఆయన శవాన్ని కూడా ఇంటిలోపలకు తెచ్చేందుకు ఇంటియజమాని అంగీకరించలేదు. ఇప్పుడు నా తల్లి కూడా రోగిష్టిది. ఆవిడ పరిస్థితి ఏ సమయంలో ఎలా ఉంటుందో తెలియదు... నా తండ్రి పొందిన చావు ఆవిడకు కలగకూడదు. అందుకే ఈ ఇల్లు కొనాలని తాపత్రయం... ముఖ్యంగా మీ వారు మా ఫాదరుకి అమ్మాలనుకున్నారని కూడా తెలిసింది... అందుకే ఈ ప్రయత్నం'' అన్నాడు.

శారదమ్మ అతని మాటల్లోని భావం గ్రహించింది. తండ్రివట్ల ఉన్న ప్రేమ, అభిమానం, గౌరవం గుర్తించింది.

''మీరు ఎనభైవేలు ప్రస్తుతం ఇస్తానన్నారు. మిగిలినది నాలుగు నెలల్లో ఇస్తామన్నారు. అంతడబ్బు ఎలాతేగలరు- అంత స్వల్పవ్యవధిలో అని ప్రశ్నించింది శారదమ్మ. ఆవిడ ఉద్దేశం ఒక్కటే- ఏదో విధంగా అతనిని ఈ బేరంనుంచి తప్పించాలని. సుందరం డబ్బు మనిషి. డబ్బు కోసం ఏదైనా చేస్తాడని తెలుసు. ప్రస్తుతం ప్రసాదరావు ఇచ్చే ఎనభైవేలతో జల్సాగా గడిపేస్తాడు. ఎటూ మరో నాలుగు నెలల్లో మళ్ళీ వచ్చిపడుతుంది డబ్బు. అప్పుడు మరింత విలాసంగా గడవచ్చు. కొడుకు డబ్బుకే లొంగిపోయాడు.

''మా నాన్నగారు ఆరేళ్ళనాడు ఓఇంటి స్థలంకొనాలని పదివేల రూపాయలు సిద్ధం చేశారు. కాని దురదృష్టవశాత్తు మా తాతగారు కాలంచేశారు. ఆ డబ్బు ఆయన ఖర్మకాండకు ఖర్చుఅయిపోయింది. ఆ తరువాత నాన్నగారు తన ఆలోచనని మార్చుకున్నారు. ఇప్పుడు నాన్నగారు లేకపోయినా— ఆయన చావు కారణంగా ఆఫీసునుంచి డబ్బు వస్తుంది. ఆ డబ్బుతో నాన్నగారి కోరికను తీర్చాలి ఎలాగైనా... కొడుకుగా అది నాబాధ్యత... నాకు జన్మనిచ్చి, ఈనాటి నా ఈ స్థితికి కారకులైన వారికి ఈ మాత్రమైనా చేయలేకపోతే నా పుట్టుక వృధానేమో... పోతే నాకో చెల్లెలుంది. ఆమె వివాహం ఫాదరు చేయలేకపోయారు... అది కూడా నేనే చేయాలి. చేయగలనన్న నమ్మకం, ధైర్యం నాకు ఉంది. ఈ విధంగా ఆలోచించే ఈ యజ్ఞంలోకి దిగాను..'' చెప్తున్నాడు ప్రసాదరావు.

శారదమ్మ ఆలోచిస్తోంది. సుందరంని ప్రసాదరావుతో బేరీజు వేస్తోంది. డబ్బుకి దాసోహం అయిన కొడుకు సుందరం. బాధ్యతను, కర్తవ్యాన్ని మరిచినవాడు సుందరం. తండ్రి కట్టుకున్న ఇంటిని అమ్మజూపిన వాడు సుందరం. ఆ డబ్బుతో ప్రపంచాన్ని అనుభవించాలనేవాడు తన కొడుకు ఈ సుందరం. కాని ప్రసాదరావు పూర్తిగా అతీతుడు. అతన్ని కన్నవాళ్ళు

ఎంత అదృష్టవంతులో... సుందరంవంటి కొడుకుని కన్న తను పాపం చేసుకుందేమో... అందుకే పుణ్యఫలాలనిబట్టి సంతానం, ముఖ్యంగా కొడుకులు... పుడతారంటారు.

ప్రసాదరావు స్కూటరు స్టార్టు చేసాడు— "రేపు కలుస్తాను" అంటూ. "ఇటువంటి కొడుకు నాకు పుట్టివుంటే నేనెంత అదృష్టంపొందేదాన్నో" శారదమ్మ స్వగతంలో గొణుక్కోసాగింది.

★ ★ ★

"సార్... నేనిచ్చిన కథ చూసారా... చదివేరా... ఎలా ఉంది?" అని అడిగింది అరుణ ఆ సాయంత్రం ఇంటికెడుతూ.

రామారావుకి నవ్వొచ్చింది. "ఏమిటమ్మా... ఆ కాగితాల్లో ఏం రాసేవు... మీ ఇంటి పరిస్థితులు కథగా రాసేవు. అది అలా జరిగిందా... లేకజరుగుతుందని ఊహించే రాసేవా..." అన్నాడు.

అరుణకేం చెప్పాలో అర్థంకాలేదు. "అది మీకేమనిపించింది?" అని అడిగింది.

"చూడమ్మా... ఈ వయసులో, ఈ అనుభవంలో, ఇన్నేళ్ళ సంసార జీవితంలో ఎన్నో వందలమందిని చూసాను. అటువంటిది నువ్వు కాగితాల్లో రాసినది అర్థం చేసుకోలేనా... ఆ కథలో నీకు సుందరంలాటి అన్నయ్య ఉన్నాడని, శారదమ్మ మీ అమ్మ కళ్యాణి అని, కాముడంటే నువ్వేనని తెలుసుకోలేనా... పోతే, ఈ రోజుల్లో సుందరంలాటి అన్నలు, తమ్ముళ్ళు ఎక్కువవుతున్నారు. తల్లీ తండ్రి కేవలం డబ్బు సప్లయి చేసేందుకే అని ఆలోచిస్తారు. డబ్బుకోసం ఏ పనైనా చేస్తారు. అవసరాలు, కోరికలు కొత్తగా అలవరచుకుంటారు... ఇప్పుడు మీ అన్నయ్య మీ ఇల్లు అమ్మేస్తాడని భయమా. ఈ సంఘటనతో మీ పరిస్థితి ఎలా వుంటుందో ఊహించావా... ఈ కథ ఏ పత్రికకో పంపించేవే అనుకో, అది అచ్చు అయి, మీ అన్నయ్య చదివితే తప్పకుండా నువ్వేరాసి పంపావనుకుంటాడు. అప్పుడు నిన్ను మీ అన్నయ్య కొట్టేందుకూడా వెనుకాడడు. ఎందుకమ్మా ఇటువంటి రాతలు? ఊరుకో, జరిగింది మరిచిపో... నీకు ఉద్యోగం ఉంది. తప్పకుండా మంచిభర్త లభిస్తాడు. ఇంతకన్నా ఏం కావాలి? పోతే, కథలో నువ్వు పేర్కొన్నట్టు ప్రసాదరావు వంటి మంచివాళ్ళు తారసపడక పోరు. అందుకు నా ప్రయత్నం కూడా ఉంటుంది. కాబట్టి అలా చేయి... ఇదిగో నువ్విచ్చిన కాగితాలు, కవరు" అంటూ తిరిగి ఇచ్చేశాడు రామారావు.

అరుణకి ఆ కాగితాలు అందుకుంటుంటే చేయి వణికింది.

"చూడమ్మా... నీకు జీవితం గురించి, దాని విలువ గురించీ తెలీదు. ఇదొక చదరంగం ఆట... గెలుపు ఓటమిలకంటే ఆడే ఆటకే విశిష్టత ఉంటుంది. జాగ్రత్తగా ఎత్తులువేస్తూ - రాబోయేదాన్ని కూడా ఊహించవలసి ఉంటుంది" అన్నాడు రామారావు పెద్దతరహాగా.

అరుణకి అతనిలో తండ్రి కనిపించాడు. కనిపిస్తున్న ఈ తండ్రి ద్వారా తమ జీవితాలు సాఫీగా జరుగుతాయని అందుకు అతని సహకారం పొందాలని ఆలోచిస్తోంది.

"ఈ కాగితాలు ఏ పత్రికకీ పంపించకు. నీదగ్గరేవుంచుకుని, ఎప్పుడైనా తోచనప్పుడు చదువుకో..." అంటూ తనపనిలో లీనమైపోయాడు రామారావు.

ఉదయం తొమ్మిది గంటలకు రామారావు ఆఫీసుకు బయలుదేరేందుకు సిద్ధపడుతున్నాడు. "ఎప్పుడూ ప్రయాణం అంటే ఎగిరి గంతేసేదానివి, ఈసారి ఎందుకిలా ఆలోచిస్తున్నావు... వెడితే బాగుంటుంది- డబ్బు కూడా వుందికదా" అన్నాడతను మరోసారి.

అన్నపూర్ణకు ఆశ్చర్యం వేసింది. వాళ్ల పెద్దక్కమాటలు గుర్తుకొచ్చాయి. కళ్యాణి జీవితం గుర్తుకొచ్చింది. తెల్లవారుజామున వచ్చిన పీడకల మరోసారి గుర్తుకొచ్చింది. ఏదో అపశకునం, కీడు జరుగబోతోందని తోచింది. "మీరేమిటి... ఇన్నిసార్లు వెళ్లమంటున్నారు, ఏమిటి కథ-ఏదైనా వ్యవహారం వుందా?" అంది వెటకారంగా.

"నాకా... అంత ధైర్యమా... అది మీ బావలాటి వాళ్లకి చెల్లుతుంది. అసలు నీ దృష్టిలో నేను మొగుడినా, మగాడినా... ఏదో మూడుముళ్లు వేసినందుకు మొగుడేనన్నమాటేమిటి? నీముందు నేను ఆడంగి మొగుణ్ని... చేతకాని మొగుణ్ని... పనికిరాని మొగుణ్ని. నువ్వు అడిగినప్పుడు డబ్బు సప్లయ్ చేసే మొగుణ్ని. చాలామంది మొగుళ్లు ఈ ఫార్ములా ప్రకారమే

నడుచుకోవచ్చు- నీ ఉద్దేశంలో. నేను 'ఎస్... మేడం' మొగుణ్నేకదా... కాబట్టి నీ ప్రయాణాని కి టిక్కెట్లు కొనితెస్తాను'' అన్నాడు రామారావు.

''మన ఇంట్లోవారికి ట్రాన్స్ఫరు అయిందట. మళ్లీ నెలలో ఖాళీ చేస్తారుట... అయితే ఈసారి ఇల్లు ఎవరికీ అద్దెకివ్వదలచు కోలేదు'' అంది అన్నపూర్ణ నిశ్చయంగా.

''అద్దెకోసం కాకపోయినా, నీకు తోడుగా... నీ నోటికి కాలక్షేపంగా వుండేందుకైనా ఇల్లు అద్దెకి వ్వాలిగా. ఇంతకీ ప్రయాణం మాటేమిటి... త్వరగా చెప్పు ఆఫీసుకు టైమవుతోంది''

''నేను ఊరు వెళ్లటంలేదు. ఇల్లు కళ్యాణికి ఇస్తాను. ఆమెకు తోడు, రక్షణ కావాలిగా. మన కామేశ్వరికి, మీ కొలీగు అరుణ తోడుగా వుండేందుకు ఈ ఏర్పాటు చేస్తున్నాను''

రామారావుకిదంతా ఆశ్చర్యంగా వుంది కళ్యాణి గురించి ఎలా తెలిసిందాని. ''ఏమిటి నువ్వు చెప్పేది'' అని అడిగాడు వెంటనే.

''అవును... చెప్పింది వినిపించలేదా... సాయంత్రం మీరు పెందరాళేరండి. ఈరోజు మంచిరోజు. కళ్యాణిని ఆహ్వానిస్తున్నాను. నాలుగ్గంటలకల్లా ఇక్కడుండాలి'' అంది అన్న పూర్ణ నిశ్చయంగా.

అతను ఏదో చెప్పబోయాడు.

''మీ ప్రశ్నలు, సందేహాలు, అనుమానాలు నాకు అనవసరం. చెప్పినట్టు చేయండి- సాయంత్రం త్వరగా రండి''

''ఎస్... మేడం'' అంటూ ఆ మానవుడు వెళ్లిపోయాడు.

రామారావు నాలుగింటికి తిరిగివచ్చాడు. గుమ్మంలోనే అతనికి కామేశ్వరి కనిపించింది. ''మీ అమ్మ రెడీ అయిందా?'' అంటూ సైకిలు లోపల పెట్టాడు అతను.

కామేశ్వరికి తండ్రి మాటలు అర్థంకాలేదు- ''అమ్మ వూరికెళ్లింది'' అంది.

ఆశ్చర్యపోతూ అడిగాడు రామారావు- ''ఏవూరు'' అని.

''ఇంకే వూరు... తాతని చూసేందుకు. మధ్యాహ్నం పెద్దమ్మ వచ్చి అమ్మను ప్ర యాణం అవమందిట. వారంపదిరోజుల్లో తిరి గివస్తుందిట. ఎదురింటి ఆంటీ చెప్పారు. అమ్మ వాళ్లకి తాళంచెవి ఇచ్చిందట...'' కామే శ్వరి చెప్తోంది.

హతాశుడయ్యాడు రామారావు.

ఏమీ తోచక మంచంమీద వాలాడతను. ఎదురుగా వెంకటేశ్వరస్వామి ఫొటో వుంది. ఆ ఫొటోకేసే చూస్తున్నాడు అతను. ఆ తరువాత స్వగతంలో అనుకున్నాడు. ''ఏమిటి స్వామీ, అన్నపూర్ణ ఇలా తయారయింది. మా ఇద్దరికీ లంగరు సరిగాకుదర్చలేదా... నన్నెందుకు చే తకానివాడిగా చేస్తున్నావు. నా ప్రయత్నాలేమీ ఎందుకు ఫలించటంలేదు. నాలాటి 'ఎస్. మేడం' మొగుళ్లు ఏమీ చేయలేరా... నేను కేవలం నిమిత్తమాత్రుడినేనా. పోనీలే... నువ్వు మాత్రం ఏంచేస్తావు- ఒక్క ఉపకారం మాత్రం చేసిపెట్టు. అన్నపూర్ణ ఇంట్లో లేనప్పుడు మాత్రం నన్ను చావనీయద్దు. ఆమెకు కడసారి గానైనా నా శవాన్ని చూసే అదృష్టం కలిగించు. కామేశ్వరికి మంచి వరుడిని చూసిపెట్టు. నా భార్యాపిల్లలకు ఏలోటూ, ఇబ్బందీ రాకుండా చూడు...'' అని.

''కాఫీ ఇదుగో'' అంటూ గ్లాను అందించింది కామేశ్వరి.

ఆలోచనలు ఆగిపోగానే కాఫీ గ్లాను అందు కున్నాడు రామారావు.

''నేనలా బజారులోకెళ్ళొస్తాను. ఎవరైనా వస్తే ఉండమను. నేను గంటలో వచ్చేస్తాను- వచ్చాక వంట చేస్తాను'' కాఫీ గ్లాను కిందపెడు తూ అన్నాడు అతను.

''సరే'' అంది కామేశ్వరి.

రామారావు కళ్యాణి ఇంటికి బయలుదేరా డు.

★ ★ ★

ఇప్పటికీ అన్నపూర్ణ తన ఇష్టప్రకారమే చే స్తోంది. కోపం వచ్చినప్పుడు కేకలు, అరుపులు తప్ప ఏమీ చేయలేకపోతున్నాడు రామారావు. భార్య అడిగినప్పుడల్లా డబ్బు ఇస్తూనేవున్నాడు అప్పులు చేస్తూనే వున్నాడు. మనసు బాగోలేనప్పుడు మాత్రం కాసేపు కళ్యాణితో మాట్లాడివస్తున్నాడు. అరుణ, కామేశ్వరి వివా హాలు కాగానే ఈ ప్రపంచంనుంచి తప్పుకోవా లనుకుంటున్నాడు రామారావు.

అతని మొర ఆలకించే కాలపురుషుడు ఎక్కడున్నాడో! ★

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతి
భావంతులైన రచయితలకు నెలనెలా నవ
లల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో,
ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను
ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు. చతుర కథలు. చతుర ప్రపంచం వంటి శీర్షికలు
కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు వుంటుంది. "చతుర"లో
అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల
సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు
సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో
వారివారి దస్తూరినిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం
నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

## చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్- 500 482

# విచిత్ర ప్రపంచం

## కనబడుటలేదు

న్యూస్‌పేపర్లలో, టి.వి.ప్రకటనల్లో తరుచుగా 'కనబడుటలేదు' అనే అడ్వర్టయిజ్‌మెంట్లని చూస్తూంటాం. మతిస్థిమితం కోల్పోయి కొందరు తప్పిపోతేకావాలనే ఇంటి నుండి పారిపోయిన బాపతు కొందరుంటారు. వాళ్లంతా మళ్ళీకావాలనుకుంటే, జ్ఞాపకశక్తి పుంజుకుంటే తిరిగి ఇంటికి రాగలరు. కానీ ఏ ఎగ్జిబిషన్లోనో, తిరునాళ్లలోనో అమ్మచెయ్యివిడిచి జనారణ్యంలో కలసిపోయిన పసిపాపలు మళ్ళీ తమవారిని చేరుకోవటం కష్టం. మన సినిమాలలోనైతే అలాంటివాళ్ళు ఎన్నో ఏళ్ల తరువాత తమవారిని కలుసుకుంటే ఆ హీరోనో, హీరోయినో తమవారిని గుర్తిస్తారు. లేదా ఏ పుట్టుమచ్చనో చూసి తల్లిదండ్రులు కూడా గుర్తిస్తుంటారు. కానీ నిజ జీవితాలలో ఇలా జరగటం అరుదు. ఎందుకంటే ఒకటి నుండి ఆరేళ్ల వయసు పిల్లలముఖాలు పెరిగి యుక్త వయస్కులయ్యాక చాలా మార్పులు పొందుతుంటాయి. పోల్చుకుని గుర్తించలేనంతగా కూడా మారతాయి వారి ముఖాలు.

అందుకని పసిపిల్లలుగా వున్నప్పటి ఫొటోలు చూసి పెరిగినతర్వాత వారి ముఖాలు ఏవిధంగా వుంటాయో వూహించి బొమ్మలు వేయనారంభించారు అమెరికాకు చెందిన లూయిస్‌శాడ్లర్, స్కాట్రోజ్ అనే సోదరీమణులు. కేవలం ఫొటోచూసి భవిష్యత్తులో వారి ముఖం ఏ విధంగా ఉంటుందో వూహించి బొమ్మగీయటం ఆషామాషీకాదు. కానీ వీరు ఆ ప్రతిభ చూపి అలాంటి బొమ్మలు గీస్తున్నారు. తప్పిపోయిన పిల్లల తల్లిదండ్రులు ఈ సరికొత్త ఫొటోల్ని టి.వి.ల్లో, పత్రికల్లో ప్రకటించటంతో



చాలామంది పిల్లలు తమ తల్లిదండ్రుల్ని కుటుంబ సభ్యుల్ని తిరిగి కలుసుకొనగలుగుతున్నారు. 1983లో 17నెలల వయసులో తప్పిపోయిన క్రిస్టోఫర్ ఫల్బర్‌ను ఇటీవల ఓ రైల్వే స్టేషన్ వద్ద అలాగే గుర్తించారు. మూడేళ్ల వయసున్నప్పుడు తప్పిపోయిన కింబర్లీ మెగోవాన్‌కి ఇప్పుడు ఏడేళ్ళ వయసు. పదకొండేళ్ళ క్రితం తప్పిపోయిన కూసో సిస్టర్ల ఫొటోల్ని ఒక టి.వి. ప్రొడ్యూసర్ శాడ్లార్ స్కాట్రోజ్ లకిచ్చాడు. వారు ఆ ఫొటోల ఆధారంగా ప్రస్తుతపు కూసోసిస్టర్ల స్కెచ్‌వేసి ఇచ్చారు. దానిని టి.వి.లో ప్రకటించిన కొన్ని నిముషాల్లోనే ఎన్నో టెలిఫోన్లువచ్చాయి. అలాంటి అమ్మాయిల్ని చూశామంటూ. అలా పదకొండేళ్ళ తదనంతరం కూసో సిస్టర్లు తమ తల్లిదండ్రుల్ని కలుసుకోగలిగారు. వారిని కలిపిన ఘనత శాడ్లార్, స్కాట్రోజ్ లకే దక్కుతుంది. ఇలా ఈ సోదరీమణులవలన 1985 నుండి ఇప్పటివరకు కనీసం 500 మంది తప్పిపోయిన పిల్లలు తమవారిని చేరగలిగారు. టెక్సాస్ యూనివర్సిటీలో ఉద్యోగాలు చేస్తున్న ఈ సోదరీమణులు తమ తీరిక వేళల్లోను, సెలవురోజుల్లోను ప్రతిఫలం ఏమీ పుచ్చుకోకుండానే ఇలా రూపచిత్రాల్ని గీస్తూ ఎందరికో సాయపడుతున్నారు. ఒక పాత ఫొటోలోని మొహం చూసి దాని ప్రస్తుత రూపురేఖలకు ఊహాపటం గీయటానికి 24 గంటల సమయంపడుతుంది ఆ సోదరీమణులకి.

## 50 కోట్ల పన్ను

మైసూరు మహారాజా జయచామరాజవడియార్ గత వైభవం భారతీయులందరికీ తెలుసు. స్వతంత్రభారతంలో ఆయన్ని తమిళనాడు గవర్నరుగా నియమించారు కూడా. ఆ పదవిలోంచి రిటైరైన కొంతకాలానికి ఆయన కన్నుమూశారు.

ప్రస్తుతం ఆయన గత వైభవానికీ, మైసూరు మహారాజ భవనానికీ ఏకైక వారసుడు ఆయన పుత్రుడైన శ్రీకాంతదత్త వడియార్. ఈయనగారిపుడు ప్రభుత్వానికి తను కట్టవలసిన 50 కోట్ల రూపాయల పన్నుల బాకీని ఎలా తప్పించుకోవాలిరా దేవుడా అని దిగులుపడుతున్నాడు. ప్రస్తుతం ఆయనకి అధిక మొత్తంలో ఆదాయమేమీ లేకపోవటంతో ఈ సమస్య ఎదురైంది. శ్రీకాంత్ కాంగ్రెస్ (ఐ) పార్టీలో సభ్యుడైనప్పటికీ పార్టీ మెంబర్లెవ్వరూ అతనికి సాయపడేపరిస్థితుల్లో లేరు. అయినా అతను పన్నులనుండి విముక్తుడు కావటానికి రకరకాల మార్గాలన్వేషిస్తూనే ఉన్నాడు.

మైసూరు రాజభవనాన్ని అంబావిలాస్ అని కూడా అంటారు. ఈ శతాబ్దపు ప్రారంభంలో ఈ కళాత్మకమైన పాలెస్ నిర్మాణం జరిగింది. మైసూరు మహారాజులు కళాహృదయులైనందున ప్రపంచంలోని మూలమూలల నుండి ఖరీదైన కళాత్మక వస్తువులు ఈ భవనం కోసం తెప్పించారు. ఈ వస్తువులన్నీ భారీయెత్తునే వుంటాయి. ఫ్లవర్‌వాజులూ, టేబుళ్లూ, సోఫాలూ, మేజాలూ, కార్పెట్లూ అత్యంత ఆకర్షణీయంగా వున్నాయి. రాజులూ, రాజ్యాలూ అంతరించినా ఈ భవనం ఇంకా ప్రజాదరణలో ఉండటానికిదే కారణంకావచ్చు. నవరాత్రి పర్వదినాలలో భవనం మరింత ఆకర్షణీయంగా ఉంటుంది. 1977 నుండి దర్బార్ హాలునూ, కళ్యాణమండపాన్నీ జనం సందర్శించేందుకు రెండు రూపాయల టిక్కెట్టు పెట్టారు. దర్బార్ హాల్లో స్తంభాలు బంగారంతో తాపడంచేయబడ్డాయి. సందర్శకుల ద్వారా ఏటా 25 లక్షల రూపాయలు వసూలవుతుంటాయి. ఈ రాజభవనాన్ని ప్రజాపరంగా మార్చినప్పటినుండీ దీనికొస్తున్న ఆదాయమంతా కర్నాటక ప్రభుత్వానికే చెందుతున్నది. 1974లో జయచామ రాజవడియార్ ప్రభుత్వంతో ఒక ఒప్పందం కుదుర్చుకుని పాలెస్‌ను ప్రభుత్వానికి అధీనంచేసినా ఆయన కొడుకు శ్రీకాంతవడియార్ అది తనకు చెందుతుందని కోర్టులో కేసు నడిపిస్తున్నాడు. తనకున్న స్థలాలు, భవనాల్లో రేసు కోర్సులూ, హొటళ్ళు నిర్వహిస్తూ కాలం గడుపుతున్నాడాయన. ప్రభుత్వంమాత్రం బాకీ ఉన్న పన్నులు 50 కోట్లూ చెల్లించమంటూ ఆయన్ని పదేపదే వత్తిడిచేస్తోంది. ఆయన ఉండే భవంతిలో అరవై గదులున్నాయి. మహారాజకుటుంబం, వారి పనిమనుషులతో, సిబ్బందితో అందులో నివసిస్తోంది. శ్రీకాంత్‌వ



డియార్ ప్రస్తుతం 11 గదుల్ని సందర్శకులు దర్శించటానికి కేటాయించాడు. ఈ పద కొండు గదుల్లో 7 గదులు ఆయన ముత్తాత కృష్ణరాజవడియార్ వ్యక్తిగతంగా వాడుకున్నది. మిగతా నాలుగు గదులు శ్రీకాంత్ నాయనమ్మ కెంప లక్ష్మమణివి. కాని ఈ 11 గదుల నిర్వ హణ చాలా క్లిష్టతరమవుతూవుంది. ఎందు కంటే అన్ని గదుల్లోనూ కోట్ల రూపాయల విలువగల వస్తువులుండటంతో అత్యంత జాగ రూకతతో వీటిని కాపాడవలసి వుంటుంది. ఇందుకు కొన్ని లక్షల రూపాయలు అవసరమ వుతున్నాయి. అందుకే ఈ పదకొండు గదులు సందర్శించేవారి నుండి ప్రత్యేకంగా కొంత నగదు సేకరిస్తే సంవత్సరానికి కనీసం 50 లక్షలు వసూలవుతుందని అభిప్రాయపడుతు న్నాడు. శ్రీకాంత్‌కు 80 మంది సిబ్బంది, 4 విదేశీ కార్లు ఉన్నాయి. ప్రత్యేకించి 1926 మోడల్ రోల్స్ రాయ్స్ కారుంది.

---

## అద్భుత కళాసంచయం

కళా ప్రపంచంలో కుమార్ సంగ్రామ్‌సింహ్ పేరు జాతీయస్థాయిలోనేకాక అంతర్జాతీయస్థా యిలో కూడా ప్రఖ్యాతిగాంచింది. ఆయన ఒక్క డే ఎంతో శ్రమించి వేలాది కళాత్మక వస్తువుల ను పోగుచేసి జయపూర్‌లో 'కుమార్ సంగ్రామ్ సింహ్ మ్యూజియం'లో భద్రపరిచాడు. ఆయన పేరుతో నెలకొల్పిన ఆ మ్యూజియంలో సుమారు 2500 లఘుచిత్రాలు, వెయ్యి సచిత్ర గ్రంథాలు, వెయ్యి ఆయుధాలు, వందలాది విగ్రహాలు, ఫొటోగ్రాపులు, ప్రింట్లు, స్టెన్సిళ్ళు, ఫర్నీచర్ మొదలగునవి భద్రపరచబడి ఉన్నాయి. ఆ మ్యూజియం ఉన్నతశ్రేణి వస్తు సామాగ్రికి ప్రఖ్యాతిగాంచింది. దేశ, విదేశ కళా మర్మజ్ఞులు, పరిశోధకులు ఆయన నెలకొల్పిన మ్యూజియంవల్ల అపారమైన ప్రయోజనం పొందుతున్నారు.

కుమార్ సంగ్రామ్‌సింహ్ జయపూర్ సంస్థా నంలోని నవల్‌గఢ్‌లో 1927లో జన్మించాడు. తండ్రి రావల్‌మదన్‌సింహ్ కూడా గొప్ప కళా ప్రియుడు. సంగ్రామ్ సింహ్ 1938లో అజ్మీర్ లోని మేయో కళాశాలలో విద్య అభ్యసించే కాలంలో గుయీ సాహెబ్ అనే కళాకారునితో పరిచయమైంది. దాంతో ఆయనకు వివిధ కళలపట్ల ఆసక్తి పెరిగింది. పిలానీకి చెందిన స్వర్గీయ భూర్‌సింహ్‌జీ శేఖావత్ ఆయన కా లంలో రాజస్థాన్‌లోని ప్రఖ్యాత చిత్రకారులలో ప్రముఖుడు. కుమార్ సంగ్రామ్‌సింహ్ 1942 నుండి 44 వరకు ఆయన వద్ద చిత్రకళ అభ్యసించాడు. క్షితేంద్రనాథ్ మజుందార్, రాయ్‌కృష్ణదాస్, బ్రజ్‌మోహన్‌దాస్, డాక్టర్ మోతీచంద్రలాంటి ప్రఖ్యాత కళాకారులు, కళామర్మజ్ఞులు ఆయనలోని కళకు మరింత పదును పెట్టారు. కుమార్‌సంగ్రామ్‌సింహ్ అల



హోబాద్ విశ్వవిద్యాలయంలో ఇతర డిగ్రీలతో పాటు చిత్రకళ, ఫొటోగ్రఫీ మొదలగువానిలో డిప్లొమా సంపాదించాడు.

ఈనాడు ఆయన సంగ్రహాలయంలో మొఘలు, రాజస్థానీ, పహాడీ, దక్కనీ, జైన, పాల మొదలగు దుర్లభ వస్తువులు ఉన్నాయి. ఆయన నవల్‌గఢ్‌లో లభించిన వస్తువులేకాక 1950 నుండి కళావస్తువులను పోగుచేయడం ప్రారంభించాడు. వాటిలో ప్రధానంగా రాజస్థానీ చిత్రాల అమూల్యఖజానా ఆయన మ్యూజియంలో సురక్షితంగా ఉంది.

దేశానికి స్వాతంత్ర్యం లభించిన తరువాత జాగీర్లు, దేశీసంస్థానాలు అంతరించాయి. దాంతో వారి ఆర్థికపరిస్థితులు దిగజారాయి. సామంతులు, జాగీర్దార్లు ఆర్థికఇబ్బందులవల్ల తమ అమూల్యా కళాసంపదను అమ్ముకోసాగారు. పాశ్చాత్య సంస్కృతి ప్రభావంవల్ల కూడా వారికి ఆ వస్తువుల ప్రాముఖ్యం తగ్గిపోయింది. ఆ సమయంలో చాలామంది కళావ్యాపారులు లాభం పొందారు. కాని కుమార్‌సింహ్ మాత్రం పెక్కు కళావస్తువులను ఖరీదు చేసి వాటిలో ఉత్కృష్ట వస్తువులను ఎన్నికచేసి మ్యూజియంలో భద్రపరిచాడు. క్రీ.శ. 1623 నాటి రాగ-రాగిణి, మేవాడ్‌శైలి, రసికప్రియ, బీహారీ సత్ సయీ, సూర్‌సాగర్, గీతగోవింద మొదలగు లఘుచిత్రాలు; మార్వాఢ్ దర్బారీ సంస్కృతి, రాజస్థానీ వేట లఘుచిత్రాలు మ్యూజియంలో అమర కళాకృతులుగా నిలిచి ఉన్నాయి.

కళాత్మక చిత్రాలను ఖరీదు చేయడంలో, అమ్మడంలో ఆయన పద్ధతి ఇతర సంస్థానాధీశుల కంటె భిన్నంగా ఉండేది. పెట్టెల కొద్దీ ఖరీదు చేసిన కళాసామాగ్రిలో ఉన్నతశ్రేణికి చెందిన లఘుచిత్రాలతోపాటు అత్యంత సాధారణ చిత్రాలు కూడా ఉండేవి. ఆ తరువాత ఆయన అత్యున్నతస్థాయికి చెందిన వస్తువులను మాత్రమే మ్యూజియంలో భద్రపరిచాడు. భయంకరమైన ఆర్థిక ఇబ్బందులలో కూడా ఆయన తన లఘుచిత్రాలను విక్రయించటానికి సిద్ధపడలేదు. ఒకసారి ఒక విదేశీ మహిళ కోటశైలికి చెందిన రెండు చిత్రాలకు బదులుగా తన కారును కూటా ఇవ్వటానికి సిద్ధపడింది. కాని కుమార్ సంగ్రామ్‌సింహ్ ఆ ప్రస్తావనను నిష్కర్షగా తిరస్కరించాడు.

ఆయన చాలాకాలం వరకు రాజస్థాన్ లలితకళలు, జాతీయ అకాడమీలకు గౌరవనీయ సభ్యుడుగా ఉన్నాడు. కళలకు చెందిన విభిన్న సంస్థలకు ఆయన అందించిన సహకారం అవిస్మరణీయమైంది. జయపూర్‌లోని సిటీప్యాలెస్ మ్యూజియంకు డైరెక్టరుగా వ్యవహరించాడు. ఒక గౌరవనీయ సభ్యునిగా విదేశాలకు

సైతం ఆహ్వానించబడ్డాడు.

రాజస్థానీ చిత్రకళ గూర్చి ఆయన రాసిన అనేక వ్యాసాలు జాతీయ, అంతర్జాతీయఖ్యాతిగల పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఢూంఢార్ పెయింటింగ్‌లను పరిశోధించేవారికి ఆయన కేటలాగు మహత్తర సామాగ్రిగా ఉపయోగపడుతోంది. ప్రస్తుతం ఆయన 'సంగ్రామ్ కళాసంగ్రామ్‌కు డైరెక్టరు'. అందులో వందలాది విద్యార్థులు పారంపర్య కళాశైలి విద్య అభ్యసిస్తున్నారు.

జయపూర్‌లోని సంసార్‌చంద్ర్ రోడ్‌లోని నవల్‌గఢ్ హౌస్‌లో ప్రవేశించగానే వసారాలో ఉన్న 10వ, 12వ శతాబ్దపు విగ్రహాలు స్వాగతం పలుకుతాయి. పెద్ద హాలులో కళాత్మక ఫర్నిచరు అలంకరించబడింది. ఇతర గదులలో కళాత్మక ఉపకరణాలు ఉన్నాయి. అందులో రాజపుత్ర సంస్కృతికి చెందిన గొప్ప భండారమే ఉంది.

## పులా

డాక్యుమెంటరీ చిత్రాలు చాలావరకు సందేశాత్మకంగా వుంటాయి. చిత్రంలోని పాత్రల సంభాషణలకు ప్రాధాన్యత తక్కువగా వుండి వ్యాఖ్యాత స్వరంతోనే జరుగుతున్న సంఘటనల వివరాలు శ్రోతలకి తెలుస్తుంటాయి. అలాంటి డాక్యుమెంటరీ చిత్రమే ''పులా''. ఇది చాలా అరుదైన చిత్రం. ఇదొక వ్యక్తికథ. కథలోని నాయకుడే స్వయంగా ఈ చిత్రానికి వ్యాఖ్యానం చేయడం ఈ చిత్రం యొక్క విశేషం.

పులా మరాఠీసాహిత్యానికే గర్వకారణం అంటారు సాహితీపరులు. అతను ఇతర భాషల పాఠకులకి కూడా సుపరిచితుడు. పులా ఒక గొప్ప హాస్యరచయిత, మంచి నాట్యకారుడు, నటుడు, గాయకుడు, స్క్రిప్టు రచయిత, వక్త; ఇటువంటి బహుముఖ ప్రజ్ఞాశాలి గురించిన విశేషాలతో డాక్యుమెంటరీ చిత్రం నిర్మించింది ఫిలింస్ డివిజన్. అతని బాల్యం, స్కూలు, కాలేజీ జీవనవిశేషాలూ చాలా అందంగా చిత్రించారు. అతన్నిగురించి తెలుసుకోదలచినవారికే చిత్రం ఎంతో ఉపకరిస్తుంది. తనకు స్ఫూర్తినిచ్చింది చార్లీచాప్లిన్, రవీంద్రనాథ్‌టాగోర్‌లని పులా చెబుతుంటాడు.

బటాయచిచాల్, వాస్యవరాచి బరత్ మొదలైన చిత్రాలు అతనిలోని హాస్యగాడిని ప్రపంచానికి చూపాయి. 110 నిముషాలపాటుసాగిన ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని 1983లో 'పులా'నటించగా నిర్మించారు. ఎన్నోకారణాల వల్ల అది చాలాకాలం వరకు విడుదలకాలేదు. టాగోర్ కవిత్వమంటే పులాకి చాలా ఇష్టం. ఆ కవిత్వాన్ని వంగభాషలోనే చదివి ఆనందించాలనే తాపత్రయంలో పులా తన 50వ యేట శాంతినికేతన్‌కు వెళ్ళి వంగభాష నేర్చుకున్నాడు. సాధ్యమైనన్ని భాషలతో పరిచయం, అవగాహన సంపాదించుకోవాలని ఆరాటపడుతుంటాడు పులా. ★



town...ఏ నోట విన్నా...Talk of the town...ఏ నోట విన్నా...Talk of the towr






ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరటావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మొదటి మూడింటికి రు.100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, కథలు, ఫీచర్ల వంటి ఇతర అంశాల పట్లకూడా పాఠకులు తమ అభిప్రాయాలను విడిగా రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలిచాం.

## కూపన్

మే 'చతుర' నవల: పరాజితుడు

సమీక్షకుని పేరు: ..............................................

చిరునామా: ..............................................

..............................................

..............................................

# చతుర కథలు

## దరువు

ఉదయం పదిన్నర కావస్తోంది.

ఆ సెక్షనులో అప్పుడే ఫైళ్ళు దుమ్ముదులుపుకుంటున్నాయి. అప్పటికే స్టాఫంతా సీట్లలో కూర్చొని తమ బుర్రలకు పనిచెప్పి కలాలను కదనుతొక్కిస్తున్నారు.

ఏదో శబ్దం వినిపిస్తే రాస్తున్నమేటరు ఆపి అటువైపుగా చూశాను.

రూబీకి జలుబు చేసింది కాబోలు చిర్రున ఎగబీల్చింది. ఆ శబ్దం... ఏమిటోగా వినిపించి కొంచెం చికాకును కలిగించింది. ఓ మూడు నిమిషాలు గడిచాయో లేదో మళ్ళీ ఎగబీల్చిన



చప్పుడు..

బాబోయ్!!

మరో మూడు నిమిషాలకు మళ్ళీ!

చిర్రు...

చేస్తున్న పనిలో ఏకాగ్రత సడలింది.

కొందరు లోలోన నవ్వుకున్నా మళ్ళీ పనిలో నిమగ్నమయ్యారు.

అదిగో మళ్ళీ చిర్రు...

వళ్ళుమండింది. అయినా అలా ఎగబీల్చవద్దని చెప్పటం సభ్యతకాదు. ఆ అవగాహన రూబీకే వుండాలి. కొన్ని పద్ధతులుకొందరికి నచ్చకపోవచ్చు. ఇంతగా జలుబుచేసినపుడు సెలవుపెట్టేయటమో, ఇన్‌హేలర్ వాడటమో లాంటి ప్రత్యామ్నాయాలు చేస్తే బావుంటుంది. క్షణక్షణానికి ఈవిడగారి చిర్రులు...

నాలో అసహనాన్ని పెంచుతున్నాయి. నా అసహనం అర్థంలేనిదనిపించినా... కొంతసేపే...

మళ్ళీ చిర్రు... మళ్ళీ చికాకు...

పనిచేసే మూడ్ పాడయింది.

ఓ పత్రిక తీసుకుని డైవర్షన్ కోసం

ప్రయత్నించాను.

అబ్బే... మళ్ళీ!

అంతలో తబలా వాయిస్తున్నట్లు టేబిల్‌పై దరువులెయ్యసాగాడు మురళి.

అందరూ అటువైపు చూశారు. ఆపేశాడు. కాస్సేపయ్యాక మళ్ళీ దరువేస్తూ ఆపెయ్యటం, మళ్ళీ ఓ మూడు నిమిషాలకు దరువెయ్యటం, మానెయ్యటం చేయసాగాడు

ఎవరికేమీ అంతుపట్టలేదు.

"ఏవిటోయ్ మురళీ! హుషారు మీదున్నావ్" అంటూ ఆరా తీశాడు రామారావు.

"అబ్బే... ఏమీలేదండీ" అంటూ చిన్నగా

నవ్వాడు.

కృష్ణశాస్త్రి బాధ లోకానికంతటికీ బాధట. మా రూబీ కూడా తన జలుబు యావత్ సెక్షన్‌కే జలుబుపట్టినట్లుగా చేసిందనాలి. లిఫ్టులో ఈవిడగారు చిర్రుమని ఎగబీల్చటం, లిఫ్టు బోయ్ ఎగతాళిగా నవ్వటం నా దృష్టిని దాటిపో లేదు. మధ్యాహ్నం ఎగబీలుస్తూనే లంచ్ ము గించింది రూబీ.

ఒకవైపు రూబీ ఎగబీల్చటమూ, వెంబడే మురళి టేబిల్‌పై దరువులూ మళ్ళీ ప్రారంభ మయ్యాయి.

టీ బ్రేక్‌లో రూబీ, మరికొందరు క్యాంటీన్ వైపు వెళ్ళారు.

మురళిని రామారావు మళ్ళీ ప్రశ్నించాడు దరువుల అంతరార్థం చెప్పమంటూ. మురళి సమాధానాన్ని చెవులు రిక్కిరించి వినసాగాను.

"ఏమీలేదు సార్! మా అక్కయ్యకి ఈమధ్యే పెళ్ళయి అత్తారింటికెళ్ళొచ్చింది. వచ్చి న్నుండీ ప్రతిక్షణమూ 'మావారు - మావారు' అంటూ బావగారి చిద్విలాసాలే చెప్పి సుత్తివే స్తోంది. ఆమె మావారు మావారు అన్నపుడల్లా ఓ కుండ తెచ్చుకుని దరువెయ్యసాగాను. అలా అలవాటయింది. ఇపుడు రూబీగారు ముక్కు చీవిళ్ళెగబీలుస్తుంటే నాకు దరువెయ్యాలని పించిందంతే" అన్నాడు.

--శబరి

## అంతంలేని పాత్ర

సినిమా నటి సితార వివాహం చేసుకున్న తర్వాత ప్రముఖ పత్రికా విలేకరి ఆమెను ఇంటర్వ్యూ చేయటానికి వెళ్లాడు. ఉభయకుశ లోపరులు వగైరా అయిన తర్వాత ఇంటర్వ్యూ మొదలయింది.

తొలిప్రశ్నలు అందరూ అడిగినట్లే అడిగా డు.

"మీ నటజీవితంలో మీకు నచ్చిన పాత్రలే మిటి?"

"ప్రేక్షకులకు నచ్చి, వారు మెచ్చుకున్న పాత్రలే నాకు నచ్చినవి" అన్నదావిడ గుంభ నగా.

"మీరు నటించిన చిత్రాలు పూర్తయ్యాక చూస్తున్నప్పుడు మీరెలా ఫీలవుతారు?"



"ఈ సినిమా సక్సెస్ అయితే నాకెన్ని సినిమాలు వస్తాయా, ఫెయిలయితే ఎంతన ష్టమా అని ఆలోచిస్తుంటాను"

విలేకరి నవ్వేశాడు ఆమె చమత్కారానికి మెచ్చుకుంటూ.

"మీ సినీజీవితంలో మీరు సంపాదించిందే మిటి?"

"మీ అందరి ఆదరం, అభిమానం"

"ఇంకా..."

"కొన్ని మీకు తెలిసినవేగదా! మిగతా తెలి యనివి మీకు చెప్పకూడనివి"

"మీరు ఇన్నేళ్ల నుంచీ సినిమాల్లో నటిస్తు న్నా మీ అందం చెక్కుచెదరలేదు. అందుకు కారణం?"

"ఏదయినా సబ్బుపేరు చెప్పనా?"

విలేకరి నవ్వాడు.

"నాకు తారసపడ్డ ప్రొడ్యూసర్లు, డైరక్టర్లు

వగైరా మొగవాళ్లంతా బుద్ధిమంతులే అయి ఉండటం అసలు కారణం అనుకుంటాను"

"తారాపథంలో ఉజ్వలంగా ఉండగానే మీకు వివాహం చేసుకుందామని ఎందుకని పించింది?"

"నా నటజీవితంలో ప్రతి ఆడదానికీ ఒక మగతోడు కావాలని తెలిసిందిలెండి"

"మీది ప్రేమ వివాహమా?"

కాదన్నట్లు ముసిముసిగా నవ్వి "మా అమ్మా నాన్నలు కుదిర్చిందే" అంది.

"మీ వైవాహికజీవితం ఎలా ఉంది?"

"మీకు తెలియనంతవరకూ బాగానే ఉంటుందిగదండీ"

"మీతో మాట్లాడటం చాలా కష్టమండి"

నటి నవ్వింది.

"ఓకే... ఆఖరి ప్రశ్న. మీకు క్లిష్టమని అని పించిన పాత్ర ఏది?"

"గృహిణి"

"అంటే అది ఇటీవల ఒప్పుకున్న ఏచి త్రంలోనిది?"

"సినిమాలోకాదు. మా శ్రీవారిదగ్గర గృహిణిగా ఉండటం. ఇదొక అంతులేని పాత్ర అనిపిస్తుంది. స్టార్ట్,కట్ ఉండదు. పైగా ప్రతి దానికీ మావారే డైరక్టరుగదా"

--రమేష్

## డర్టీక్రీచర్

బస్సుకోసం ఎదురుచూస్తూ నిల్చున్నాం. వగరుస్తూ హడావిడిగా వచ్చేసింది మీనా. పలకరింపుగా నవ్వాను.

"వాట్ హ్యాపెండ్ టు దిస్ బస్. ఐ థాట్ అది ఆల్‌రెడీగాననుకున్నా. సో ఐ యామ్ లక్కీ" అంది గడగడా.

"ఆలస్యంగా బయల్దేరారా?" అన్నాను ఏదో ఒకటి అనకుంటే బాగోదని.

"మరే? టుడే ఐ హావ్ టు గో నంతకదండీ? బ్యాగ్స్ అండ్ మనీ తీసుకునేసరికి ఐ హావ్ బీన్ లేట్"




అంతలో బస్సొచ్చింది.

"ఓహ్! బస్ ఫుల్లీపాక్‌డ్. వి డోంట్ గెట్ సీట్స్. పదండి! టుడే మై హస్బెండ్..."

బస్సెక్కుతూ కూడా ఏదో చెబుతోందామె!

పక్కనే వున్న కాలేజీ స్టూడెంట్లు కాబోలు కిసుక్కుమన్నారు.

అసలామె తీరే అంత.

అటు తెలుగులోనూ పూర్తిగా మాట్లాడదు. ఇంగ్లీషూ పూర్తిగా వాడదు. మధ్యలో లింకుకిగాను మరొక పదం కావాలామెకి. ఆమె బలహీనత అని నేనర్థం చేసుకున్నా కొందరు ఆటలు పట్టిస్తుంటారు.

అయినా పట్టించుకోదు.

తన తరహాలో తానుంటుంది.

నెమ్మదిగా నచ్చచెబుదామనుకున్నాను-

తన వాగ్ధోరణిలో కొంచెం మార్పు తెచ్చుకొమ్మని. ఆ ప్రయత్నంలోనే అన్నాను-

"మిసెస్ మీనా! మీరేమనుకోనంటే..."

"మ్యార్! మ్యార్! ఐ డోంట్‌మైండ్... ప్లీజ్! టెల్‌మీ...మీరంటే నాకు క్రేజ్! ఐ

లైక్‌యూ సోమాచ్...చెప్పండి" అంది.

నేను చెప్పాలని ఉపక్రమించబోయాను. మళ్ళీ ఏం జ్ఞాపకం వచ్చిందోగానీ మీనా తనే మొదలెట్టింది. వాళ్ళాయన గొప్పలూ, తన పిల్లల గొప్పలూ, తన గొప్పలూ, తమందరిఉ దారవైఖరీ... అవి రోజూ చెప్పటం ఆమె హాబీ!

అవతలివారు ఎంతవరకు వింటున్నారు? లోలోపల ఎంత విసుక్కుంటున్నారో ఆమె పట్టించుకోదు.

ఈమె గొప్పలు సహించలేక ఆమెకెందరో శతృవులుగా మారిపోయారు. శతృత్వమంటే పీకలు తెగ్గోసుకునేంతవరకుకాదుగానీ, ఆమెతో మాట్లాడటానికి భయపడతారు. మొద లెట్టిందంటే ఓ పట్టాన ఆవదుమరి! అందుకే చూసీచూడనట్టు నటిస్తారామెనుచూసి.

నాకు కొన్ని సిద్ధాంతాలున్నందున నేనలా ప్రవర్తించలేను.

అదే మీనాకి అలుసైంది కాబోలు! నన్ను తినేస్తోంది! అయినా నా విసుగుని వెలిబుచ్చ గలుచుకోలేదు. మనస్సేవో ఆలోచిస్తూనేవున్నా ఆమె చెప్పేవాటికి ఊకొడుతూనే వున్నా.

దిగేవారు దిగుతున్నారు- ఎక్కేజనం ఎక్కుతున్నారు.

"దీజ్ పీపుల్ డోన్ట్ నోమానర్స్! డర్టీక్రీచర్స్...దెకెన్ నెమ్మదిగా గెట్‌డౌన్ గదండీ! కానీ దేడోంట్‌డూ! ఛీఛీ!!" తనదైన ధోరణిలో అంటోంది. చదువురాని మనిషిలా వున్న ఒకావిడ హడావిడిగా దిగటం చూసి.

"ఏటమ్మోవ్! శానా జోరుగా ఇంగిలీసు దంచుతుండావ్! నాకూ అర్థమవుద్దీ ఇంగిలీసు. డర్టీక్రీచర్సంటావా! నువ్వే మురికి పురుగువి! నాను పనిసేసేదే ఇంగిలీసోళ్ల ఇంట్లో. హత్తెరికీ! నన్ను...క్రీచరంటావా? నువ్వే పురుగువి! పేడపురుగువి. మర్యాదగా మాట్టాడ్డం నేర్సుకోముందరా!"

మీనా క్షణం కొయ్యబారిపోయింది. బస్సులో అంతా కుతుహలంగా చూస్తున్నారు. ఎంతో గొప్పగా లెక్చర్స్ ఇవ్వగల మీనా మూగగా వుండిపోయింది. మీనా వాగ్ధాటిని ఆపించిన ఆ శాల్తీవైపు కృతజ్ఞతగా చూశాను. అప్పట్నించీ మీనా స్వచ్ఛమైన తెలుగులోనో, ఇంగ్లీషులోనో మాట్లాడుతోంది. రెంటినీ కలగలిపి మాత్రం హింసించటం మానేసింది.

—జ్యోతిరాణి

---

# పసిడి ముత్యాలు

★ నీ నిత్యజీవితంలో వేదాంతం ఆచరించడమే వేదాంతం. పుస్తకాలు చదివితేనే వేదాంతులు కారు.

— స్వామి రామతీర్థ

★ మూర్ఖుని ప్రశంస వినడంకంటే తెలివిగలవానితో చీవాట్లు తినడం మంచిది.

— ఇంజీల్

★ మనిషిలోని సహజగుణానికి దర్పణం అతని ప్రవర్తన. అతనిపై ఇతరుల అభిప్రాయానికి ప్రతిరూపం ప్రతిష్ఠ. శీలసంపత్తి మనిషిలోని సహజలక్షణం; కీర్తిప్రతిష్ఠలు ఇతరులు కలిగించేవి.

— బీచర్

★ నిజమైన సౌందర్యం నిర్మలమైన హృదయంలోనే వుంటుంది.

.గాంధీజీ

★ తన తెలివితేటలగురించి ఆలోచించనివ్యక్తి నిజంగా తెలివిగలవాడు. అనునిత్యం తాను మహామేధావినని జ్ఞాపకం చేసుకొనే వ్యక్తిని భరించడం కష్టం.

— బొయిలూ

★ నమ్మిక లేనిచోట గౌవరం లోపిస్తుంది. గౌరవం మృగ్యమైన చోట నమ్మిక అంతర్ధానమవుతుంది.

— గైల్స్

★ అతి సామాన్యమైన, సహజమైన అందమే అన్నిటికన్నా గొప్పది. అందుకు కారణం అది భగవంతుని నిర్మాణం.

- బ్రౌనింగ్

★ తాగుడు అలవాటు ముందు స్నేహితుడుగా, తరువాత దగాకోరుగా, ఆ తరువాత శత్రువుగా మారుతుంది.

— సామెత

★ జీవించడం ఒక కళ. దానిని తెలుసుకోలేనివాడు మరణించే కళను కూడా గ్రహించలేడు.

--గాంధీజీ

★ నీ ప్రతిమాటనూ, ప్రతి పనిని ప్రశంసించేవాడిని విశ్వసించకు. అందుకు భిన్నంగా నీ దోషాల్ని మృదువుగా విమర్శించేవాడిని నమ్ము.

— సుకరాత్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

